




# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ

# ఎమెస్కో వచన రామాయణం

## (మొదటి సంపుటం)

రచన :

శతావధాని కోట వీరాంజనేయశర్మ

MSCO 130

యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం-సికింద్రాబాద్

EMESCO VACHANA RAMAYANAM - Vol.1

As retold by

Satavadhani Kota Veeranjaneya Sarma

First Edition :
January 1980

Second Edition :
November 1982

Publishers :
M. SESHACHALAM & Co,
Machilipatnam, Secunderabad.

Cover Design :
BAPU

Printers:
PRASAD PROCESS,
Secunderabad-26

Price : Rs. 6-

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237, Rashtrapathi Road, Secunderabad-500 003

MSCO

189

# ద్వాదశాదిత్య మండలం వారి ప్రకాశించే 13 సంపుటాల ఎమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం

ఏనాడు వాల్మీకిమహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆనాటి నుండి అవిచ్ఛిన్నంగా శాఖోపశాఖలలో బహునామాలతో ఆ కల్పవృక్షంభారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దంతాలను ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది. అందుకే ఒక కవి "రాఘవేశ్వర చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని అన్నాడు. మేం కూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహాకార్యానికి పూనుకొన్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం ప్రారంభం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకమే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదములు పరాస్తం చేయబడినై. యథాతథంగా అనువదించినా స్వతంత్ర రామాయణంవలె చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంథులు విడినై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చినకథలే వస్తాయి. ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ చిక్కుముళ్ళన్నీ ఇందులో విడదీయబడినై. త్రైలోక్యపావని అవ్యాహతంగా రసనా స్రోతస్సు ప్రవహిస్తుంటే పచ్చికనేలలు, కేదార ఖండాలు, నల్లని, ఎర్రని, రేగడ భూములు, నిస్సార నిరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపర సుఖాలు తమంతటామే కోరి వరించి వస్తాయి. ఈ రచనావిన్యాసం సరికొత్తది. పండిత పామర భేదం లేకుండా స్త్రీ శిశు విచక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ దృష్టితో చూసుకుంటే తెలుస్తుంది. ఇంతకు పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గు భాగాలెందుకు చేశాడు? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్య అయింది? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా? ఇంకాఎన్నో - ఎన్నో - ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సొంపులు గనండి.

# శ్రీ వీరాంజనేయ స్తవము

1

మనోజవం మారుతతుల్యవేగం, జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథ ముఖ్యం, శ్రీరామదూతం శిరసానమామి.

2

నానావేదరహస్య మంత్రమయమై, నానార్థసంశోభితం
బై, నానారసభావ శబ్దమయమై, యాచంద్రతారార్కమై,
జ్ఞానానంద నిధానసాధన ప్రశస్తంబైన రామాయణా
ఖ్యానంబున్ భవదీయనామమున వ్రాయం బూనితిన్ భక్తిమై.

3

నేను నిమిత్తమాత్రుఁడను, నీవె రచించెదవంచు నమ్మి నీ
ధ్యానములో మునింగెద సదా దయతోడుత కావుమింకఁ బ్రభూ,
జానకి క్షేమవార్తగొని సంద్రముదాఁటి కకుత్స్థవంశ్యు న
న్నానము సంతసించెనే? పవమానకుమారక నీ కసాధ్యమే?

4

నీమది రామచంద్ర పదనీరజ గంధ సమావృతంబుగన్,
నామది తావకీన చరణద్వయ సంతత చింతనంబుగన్,
రామకథాలతాంత మకరందము గ్రోలి జనాళి శోక మో
హామయవార్ధి సంతరణమంద రచింపఁగదయ్య; హే కపీ!

5

ఎందఱు వ్రాసియుండిరి, యిప్పుడెందఱు వ్రాయుచునున్నవారు, ఇం
కెందఱు ముందు వ్రాసెదరో, యెవ్వఁడెఱుంగును? దీని ధీ జనా
నందముగా రచించి రఘునందను కీర్తియపారవెల్గ నా
యందునఁ బ్రేమఁ జూపఁగదరా, కరుణాకర! జ్ఞానసాగరా!

6

ఆత్మతత్త్వంబు నెఱుఁగు యోగ్యతయులేదు, జనమనోహరమైనభాషయును
లేదు,
నీవుకలవను నమ్మికయే; క్షమించి కృతిని పూరించి మాటదక్కించుమయ్య.

# సమర్పణము

1

పురుషుల గణింపవేళన్
బురుషోత్తముఁడన్న పేరఁ బొసఁగితి, పయిపై
నరులను గణింపవేళన్
నరసింహుఁడవైతి, గైకొనన్ దగు కృతినిన్.

2

పరమానందకరంబు నీ చరిత, హాల్యన్ పాడిరెందరు, సుం
దరమందారమరందపానమున భృంగంబట్లు వర్ణించితిన్
కరుణామూర్తి సమీర పుత్త్రుని సంకల్పానుబంధంబుగన్,
నరసింహాకృతితో గ్రహింపు; రఘుచంద్రా! రామచంద్రా! నమః.

3

వాహ్యాళిన్ సుమవాటికన్ నిలిచి వచ్చు స్వచ్ఛగంధంబునన్
బాహ్యాభ్యంతర మోదముం గనినరీతిన్, రామ! త్వత్కథా
దేహ్యంబుంగొనుచున్ బరామరణ పాత్రస్తోయఁగా మానవుల్
బాహ్యాభ్యంతరభేదహాస్యత, గ్రహింపన్ నారసింహాకృతిన్
సహార్థంబున రమ్యు; నీయుపదభక్తుంచిప్పు రాద్యార్థమై.

4

ఆయురారోగ్యదమై, యశేష మహనీయస్తుత్యమై శ్రీయశ
శ్శ్రేయోదాయకమై, చిరంతన తపఃక్షీరాబ్ధిపీయూషమై,
ప్రాయంగల్గిన త్వత్కథామధురకావ్యం బంకితంబిచ్చుచో
నాయానంద కృతజ్ఞతా ప్రణతి సంధానింపు దాంఛవ్యమున్;
ఓయా! రామ! నృసింహనామ! రఘుమార్గోత్సాహధామా! నమః.

5

నీ కథ సెప్పి భక్తిమెయి నీకె సమర్పణజేసె మున్ను వా
ల్మీకి మహర్షి, మర్త్యుఁడని నేను సగౌరవాత్మఁ జేరఁగా
నీక, పథంబులో నడచి నే నెటు భిన్నముగా గమింతు? నీ
శ్రీకర దివ్యతేజము వరింపుత: నీ కృతినారసింహుఁడై.

# అస్మత్పరమవాంఛ

౧

జననం బిచ్చుచు నిచ్చినట్టిది మహైశ్వర్యంబు నా కీవు స
జ్జన సంఘాత విశుద్ధ సంస్తవవిధా సంపాదనానంత కా
ల్పనిక ప్రస్ఫుటభావ మంజుల కవిత్వంబు; బట్టి నీ సేవకే
వినియోగించి యశంబు గాంచితి కృపాబ్ధీ! యాంజనేయ ప్రభూ!

౨

వచ్చిన కార్యమైనది, యపార మహా వివరంబు లోపలన్
జొచ్చినవాఁడు ఘోరతర శోకముతో నశియించునట్లుగన్
మచ్చరితంబుఁగాక, పవమానకుమారక! నీ కటాక్ష సం
పచ్చరితార్థమై యొసగె; భాస్కరవంశజు సత్కృపారతిన్.

౩

చాలుంజాలుధనంబు, సౌఖ్యవితతుల్ సాలున్, యశఃఖేదముల్
సాలుంజాలు, జరారుజా మరణముల్ సాలున్, సుహృత్సంగముల్
సాలుంజాలు, కళత్ర పుత్త్ర హిత సంసారాను బంధాపదల్
సాలుంజాలు, సమీరపుత్త్ర! యిఁక నీ సాన్నిధ్యముం జేర్పుమా.

౪

చేసినవేమొ చేసితిని, చేయుచు నాపినవాని కోసమై
యాసలఁ బెంచుకొంచు యమయాతనలం బడలేను, స్వామి! నా
చేసిన సేతలందున విశిష్టత గల్గిన నీ కటాక్ష వి
న్యాసమె, పెంపు సేయకిఁక నాయువు, నీకడ జేర్పు పావనీ!

౫

మరుజన్మంబిడవద్దు, తప్పనిమెడన్ మర్త్యుండగాఁ బుట్టి శ్రీ
కరమౌ తావక సుందరాబ్జపదయుగ్మంబందునన్ భక్తి సు
స్థిరతన్ నిల్ప ననుగ్రహింపు, మతిదీప్తి స్ఫూర్తి మేధా పదా
ధరణాలంకృత సత్కవిత్వ రచనా ప్రాగల్భ్య సంపాదిగన్;
చరితోద్భాస నామకా! నయనబంధూ! వాయుపుత్త్రా! నమః

భక్తభ్రమరము
కోట వీరాంజనేయశర్మ
శతావధాని.

# బాలకాండ

## భారతదేశము-ఔన్నత్యము

ఆకసమంటే పర్వత పంక్తులతో, అడుగడుగునా దేవాలయాలతో, అతి రమణీయమైన పుష్పవాటికలతో భయంకరంగా వుండే దట్టమైన అరణ్యాలతో, పవిత్రములగు జీవనదులతో, రకరకములైన ఖనిజాలతో, సస్యశ్యామలమైన కేదార ఖండాలతో అనేకములైన భాషా భేదాలతో, చిత్రవిచిత్రమైన పనితనంతో ఆకర్షవంతంగా తయారుచేసిన వాడుకొనే వస్తువులతో, వృత్తి విద్యలచే దారిద్ర్యం ఎరుగని గ్రామ నగర పట్టణాలతో, ప్రశాంత వాతావరణంలో నిర్మించిన మహర్షుల పర్ణశాలలతో, కొదువలేకుండా రేపుమాపులు పాలిచ్చే పశు సంపదలతో, వాస్తు శిల్పాలను మేళవించి నిర్మించిన హర్మ్యాలతో, నీటితో తడుపబడి చదునుచేసిన బాటలలో వచ్చిపోయే జన సందోహంతో, ప్రజలను దాహం తీర్చుకొనటానికీ, సేదదీర్చుకోటానికీ, దిగుడు బావులు, చేదనూతులు, సరోవరాలు కూర్పబడిన ప్రదేశాలతో, వెండి, బంగారం, ముత్యాలు కుప్పలుపోసి కావలసిన వస్తువులను కొనుటకు వీలుగా ఏర్పరచిన అంగళ్ళతో, రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బంటులు, సమృద్ధిగానుండి, పరస్పరం సహాయ సహకారంతో సౌహార్ద్రంతో పరిపాలించే న్యాయమూర్తులైన పాలకులతో సంగీతం, సాహిత్యం, నాట్యం, అభినయం, హరికథ, పురాణం, శాస్త్ర చర్చలతో వినోదించే ప్రజలతో, నాలుగు సముద్రాలు హద్దులుగా గల భూభాగాలతో, ధర్మ దేవత మూడు పాదాలతో సంచారం చేయగా త్రేతా యుగం ఆర్యావర్తనామాంతరంగల భారతదేశంలో ప్రవర్తింపసాగింది.

# వాల్మీకి ఆశ్రమ వర్ణనము

వరుసలువరుసలుగా తీర్చినాటినఫలవృక్షాలు ప్రసన్నులైనగృహస్థుల్లాగా అతిథుల్ని ఆహ్వానించినట్లు చిరుగాలిచే కదులుతున్నకొమ్మల చేతుల్తో ఒప్పారుతున్నవి. గుబురుగా నున్నలతలు పుష్పించి కమ్మని వాసనలు విరజిమ్ముతూ విందుభోజనం సమకూర్చితే తుమ్మెదలు సంగీతం పాడుకుంటూ ఆరగిస్తున్నవి. నదురూ బెదురూ లేకుండా ఆశ్రమంలోని వాళ్ళనేకాకుండా చూడవచ్చినవాళ్ళను సైతం లేళ్ళు అలరిస్తున్నవి. సెలయేళ్ళ నీటితో నింపిన దిగుడు బావుల్లో నీటి పక్షులు కొలకొల ధ్వనిచేస్తూ, శ్రవణానందం సమకూరుస్తున్నవి. ఆశ్రమ ప్రదేశంలో వెదురుబద్దలతో, రెల్లు గడ్డితో నిర్మించిన కుటీరం కన్నుల కరువు తీరుస్తున్నవి. ప్రవేశ ద్వారంముందు పసుపూ కుంకుమా పూలతో పూజింపబడ్డ ఆవూ దూడా నిల్చి నెమరువేస్తున్నాయి. గూళ్ళలో ఉన్న చిలుకలు వచ్చీరాని పల్కులతో వేదం వల్లెవేస్తున్నై. తెల్లవారకముందే లేచి కాలోచిత కార్యాలు ముగించి, సన్నగా నేసిన అరటినార గుడ్డలు ధరించి, లలాటంపైన విభూతిపూసి వెండి తీగల్లాగా మెరిసే జడలు కట్టిన శిరోజాలతో, పొడవైన గడ్డంతో, ఎడమభుజం నుంచి రొమ్ముమీదుగా దక్షిణంగా క్రిందికి వ్రేలాడే యజ్ఞోపవీతంతో, పులిచర్మంమీద ఆసీనుడై అర్థనిమీలిత నేత్రాల్తో వెలుగొందుతున్న ఒకమహామూర్తి వసారాలో దర్శనమిస్తున్నాడు. మునిపల్లెలో నివసిస్తున్న మునిపుంగవులు ఆ మహానుభావుని దర్శింపవచ్చి పాదాభివందనంచేసి, వారివారి స్థానాలలో వారు ఉపవిష్టులైనారు. అనంతరం అందరూ వేద మంత్రాలతో మంగళాశాసనం గావించి వాల్మీకి మహర్షికి అభిముఖులై నిల్చి అంజలిబంధంతో అనుజ్ఞ నిమిత్తం వేచి ఉన్నారు. అంతట మహర్షి వారిని కూర్చుండ నియమించి పరబ్రహ్మతత్వం, సార్థంగా, సాకల్యంగా, సప్రమాణంగా, సవివరంగా, సలక్షణంగా, వేదాలలోని సూక్ష్మమైన రహస్యాలు క్రమపద్ధతిలో వ్యాఖ్యానిస్తున్నాడు. ఆ సమయంలో...

## నారదుడు వాల్మీకిని చూడవచ్చుట

మహతీ రవంలో తన గాన మాధుర్యాన్ని మేళవిస్తూ పరమేశ్వర సంకీర్తనంలో పరవశించి ఆకాశపథంలో పోతున్న నారదుడు అకస్మికంగా

ఆగి మహర్షి ఆశ్రమప్రాంతాన్ని గుర్తించి కిందికి దిగి లోనికిప్రవేశిస్తూ ఒక ఆశ్చర్యకర సంఘటనాన్ని చూచి ఆగిపోయాడు. సడిచారు సర్పంఆశ్రమం కంచె వెలుపలగా పోతున్నది. ఆ పోతున్న పామును దూరంగా ఉన్న పొదలోనుంచి ముంగిస చూచింది. వెంటనే పరుగు పరుగున వెంబడించింది. దాని రాక గమనించిన పాము ప్రాణరక్షణకోసం కంచెలో దూరి ఆశ్రమం లోకి వచ్చింది. ముంగిస కూడా లోపలికి ఉరికింది. అదే సమయంలో ఆకాశంలోపోతున్న ఒక గరుడపక్షి చూచి శరవేగంతో వ్రాలింది. మబ్బులు దట్టంగాపట్టి చల్లగాలి వీస్తుంటే వర్షం వస్తున్నదని ఆనందంతో నాట్యం చేస్తున్న ఆశ్రమంలోని నెమలి కూడా అక్కడ చేరింది. ఆజన్మ విరోధం గల యీ మూడింటిలో ఏ ఒక్కటీ ఆ పామునుబాధించలేదు సరికదాదూర దూరంగ తప్పుకున్నై. ఈ దృశ్యం నారదుణ్ణి క్షణకాలం ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. "ఏమిటీ యద్భుతం! ఈ ఆశ్రమంలోని ప్రత్యక్షపూ మహర్షి తప శ్శక్తితో నిండి సత్త్వభావాన్ని సాధించింది. కాకపోతే బలమైన మూడు విరోధిప్రాణుల నడుమ అల్పప్రాణి జీవించుటా? అంతేకాక ఇక్కడ కాలు మోపిన దగ్గరనుంచీ కలహభోజనుడనైన నేను కూడా సాధుచింతన కలవా డ్నవుతున్నాను. ఋషిపుంగవా! నీవు ధన్యుడవు. ఈ సదవకాశం వ్యర్థం కానీయను" అని తనలోతాను తలపోసి పరమేశ్వరుణ్ణి స్తుతిస్తూ ఆశ్ర మంలో ప్రవేశించాడు.

ఆయన రావటం గమనించిన శిష్యవర్గం శాంతిపాఠం వల్లించి ఎదురుగా పోయి సగౌరవంగా లోనికి కొని వచ్చింది. మహర్షి వెంటనే లేచి నమస్కారం చేసి దర్భాసనంమీద కూర్చొబెట్టి అర్ఘ్యం పాద్యం సమ ర్పించి, "మీ వంటి పెద్దలు కారణం లేకుండా రారు. సెలవిస్తారా" అని ప్రశ్నించాడు. దానికి నారదుడు "నేను ప్రత్యేకంగా మిమ్మల్ని చూసిపోదా మని వచ్చాను" అని సమాధానం చెప్పాడు.

## వాల్మీకి నారదుని ప్రశ్నించుట

"స్వామీ! నా కొక కోరిక ఉన్నది. దయతో మీరు తీర్చాలి. తాము తపస్స్వాధ్యాయ నిరతులూ, ప్రియభాషులూ, త్రిలోకసంచారులూ, సర్వం తెలిసిన బ్రహ్మవిదులూ, మీకు సాధ్యంకానిదిలేదు. వర్తమానకాలంలో

ఎవడు గుణవంతుడు? సత్యపరాక్రముడు ఎవడు? ఎవడు సర్వంసహాతుడు? ఎవడు కృతజ్ఞతా ధర్మజ్ఞతలు కలవాడు? దృఢవ్రతుడూ, వీర్యవంతుడూ, శాంతుడూ, యుద్ధంలో వెనుకకు పోనివాడూ, వ్యర్థంగా బాణం ప్రయోగించనివాడూ, ప్రయోగించి ఉపసంహరించనివాడూ ఎవడు? ఎవని బాహ్య సౌందర్యం, అంతస్సౌందర్యం ప్రలోభం కలిగిస్తుంది? క్రోధాన్ని జయించిన వాడనీ, ఆర్యవంతుడనీ, అసూయలేనివాడనీ, సర్వలోకప్రియుడైనవాడనీ, పురుషోత్తముడనీ, నరసింహుడనీ పండితులూ, పామరులూ, ఎవణ్ణి పొగడు తారు. అట్టివాణ్ణి నాకు తెలుపవలసిందిగా మనవిచేస్తున్నాను." ఆ మాటలు విని ఆనందించి మౌని దివ్యదృష్టితో సర్వం దర్శించి--

## నారదుడు వాల్మీకికి సంగ్రహంగా రామాయణం చెప్పుట

"మహర్షి శ్రేష్ఠా! నీవడిగిన ప్రశ్న లోకోత్తరమైంది. నీవు త్రికాల వేదివి. బ్రహ్మనిష్ఠుడవు. సాంగవేద విదుడవు. నీకు తెలియనిదేముంది? నన్ను పెద్దవాణ్ణి చేయుటం కోసం అడిగావు. సంగ్రహంగా తెలుపుతాను. విను. నీవు కోరిన గుణాలు కలవాడు మానవుల్లో దుర్లభుడు. పరబ్రహ్మం ఒక్కడే తప్ప కనిపించే జీవకోటికి పరిపూర్ణత లేదు. అయినా కారణ జన్ముడిగా జన్మించిన రాజపుంగవుని చరిత్ర ఉంది. అదే ఇప్పుడు నీకు వినిపిస్తాను. భరతదేశంలో సూర్యుడు మూలపురుషుడుగా ఇక్ష్వాకువంశం ప్రసిద్ధికెక్కింది. ఆ వంశంలో దశరథమహారాజు జన్మించి, నాలుగు సముద్రాలు హద్దులుగా చేసి, సాటిలేని మేధావై అరవై వేల సంవత్సరాలు సకల జనానందకరంగా పాలించాడు. ఆయనకు ముగ్గురు పట్టపు దేవేరులు. పెద్ద భార్య కౌసల్య రామునీ, రెండో ఆవిడ కైకేయి భరతుణ్ణీ, మూడో ఆమె సుమిత్ర లక్ష్మణుణ్ణీ, శత్రుఘ్నుణ్ణీ కన్నారు. వారు శుక్లపక్షంలో చంద్రునిలా ప్రకాశిస్తూ ఎదుగుతున్నారు. వారిలో పెద్దవాడైన రామునికి యువరాజ పట్టం కట్టాలని ప్రభువు సంకల్పించాడు. కాని మంథర దుర్బోధతో కైకేయి వృద్ధభర్తను పూర్వం తనకిచ్చిన వరాల నెపంతో, రామునకు పద్నాలుగేండ్లు అరణ్యవాసం, భరతునికి రాజ్యాభిషేకం కోరింది. ఆ కోరిక విని రాజు నిశ్చేష్టుడైనాడు. ఆమె కోరిక మేరకు సీతా లక్ష్మణులతోకూడి అడవికి రాముడు వెళ్ళిన వార్త తెలిసిన దశరథుడు దేహత్యాగం చేశాడు. రాముడు

వెంట వస్తున్న ప్రజలను వెనుకకు పంపించి, శృంగిబేరపురం చేరి తనను రథంపై కొనివచ్చిన సుమంత్రుణ్ణి అయోధ్యకు మరలిపోవ ప్రార్థించి, గుహుని ఆతిథ్యం స్వీకరించి, గంగనుదాటి, పర్వతాలూ, అడవులూ, నదీ నదాలు ఉత్తరించి, భరద్వాజాశ్రమంలో సత్కృతులై ఆయన ఆదేశానుసారం చిత్రకూటం ప్రవేశించారు. పుత్ర వియోగం భరించలేని దశరథుడు ప్రాణాలు వదిలేశాడు. వృద్ధభూపతి మరణానంతరం వశిష్ఠుడూ, మంత్రులూ, పౌరులూ ఎంత చెప్పినా వినక భరతుడు అన్నపైగల భక్తితో, రాజ్యం త్యాగం చేసి, అయోధ్యలోనివారంతా తనవెంటరాగా తల్లులతో అన్నవద్దకు పోయి మరల రాజ్యాన్ని గ్రహించమని అర్థించి విఫలుడై, పాదుకలతో మరలి, అయోధ్యకు పోక జటావల్కలాలు దాల్చి భక్తితో నందిగ్రామంలో పాదుకలు ప్రతిష్ఠించి, తాను ప్రతినిధిగా పాలించసాగాడు. చిత్రకూటంలో ఉన్న రాముడు తనయందున్న ప్రేమకొద్దీ పౌరులూ, బంధువులూ, మాటిమాటికి చూడవస్తారని ఆలోచించి సోదర భార్యాసమేతంగా బయలుదేరి దారిలో విరాధుని చంపి, శరభంగునీ, సుతీక్ష్ణునీ, అగస్త్యునీ, ఆయన తమ్ముణ్ణీ సందర్శించి వారి అనుగ్రహంతో దివ్యాస్త్రాలు గ్రహించి, ఆసమీపంలో ఉండేవారితో కలిసి మెలిసి ప్రొద్దులు గడుపుతుండగా, కొందరు మునులు వచ్చి రాముని స్తుతించి, రాక్షసబాధలు తెలిపి, వారినుండి రక్షణ కోరారు. అలాగే చేస్తానని వారికి అభయ ప్రదానంచేశాడు. కాలం గడుస్తున్నది. ఒకరోజు సమీపారణ్యంలో తిరుగుతుండగా జనస్థానంలో ఉన్న శూర్పణఖ అనే రాక్షసి వారిని చూసి, అందులో శ్రీరాముని అందాన్ని మెచ్చి మోహించింది. అసలే రక్కసి. అందులో కామంతో కన్నులుమూసుకొన్నది. ఇంకేముంది? సరాసరి రాముని ఎదుటగా పోయి "నన్ను పెండ్లా"డమని నిర్బంధించింది. రాముడు శాంతంతో లక్ష్మణుని వద్దకు పంపాడు. రామాజ్ఞచే సౌమిత్రి చెవులూ, ముక్కూ కోసి విరూపను చేశాడు. దానితో ఆ దుష్టురాలు ఆక్రోశించి తనవారైన ఖరదూషణత్రిశిరాదులకడకేగి మానవులవల్ల తనకు జరిగిన అవమానం గోరంతలు కొండంతలుగా చెప్పి ఏడ్చింది. దాంతో అగ్గిలో గుగ్గిలంగా మండి ఖరుడు చతురంగ బలంతో రామునిమీదికి యుద్ధానికి నడిచాడు. రాముని బాణాగ్నిలో మిడుతల్లాగ సమూలంగా భస్మమైనారు. ఈ సంగతి మోసుకొని శూర్పణఖ

లంకలో ఉన్న అన్నదగ్గరకు పోయి, ఖండనాశనం తన అవమానం ఏకరువు పెట్టి మాటల్లో మాటలుగా సీతా సౌందర్యం వర్ణించి "ఆమెను ఎలాగైనా అపహరించి లంక చేర్చ"మని చెప్పింది. రావణుడు చెల్లెలి మాటలు విని, ఆమెను ఓదార్చి "సీతను తప్పక తెస్తాను. ఎంతవాడైనా, అనుకూలంగా ఉన్న భార్యపోలే బాధతో కుమిలి కుమిలి చస్తాడు. ప్రతిష్ఠకలవాడైతే అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడు. ఏ విధంగా చూసినా ఇది మంచి పనిగానే తోస్తూంది. నేను కార్యం సాధించి నిన్ను మళ్ళీ చూస్తాను. నీవు దుఃఖం వదలి అన్న ప్రతాప ప్రయోగ కౌశల ప్రదర్శనంకోసం వేచి ఉండు" అని చెప్పి పంపించి, మారీచునితో మంతనం సల్పి, వంచనా మార్గంతో సీతనుతెచ్చి అశోకవనంలోఉంచి మ్రుక్కడి రాక్షసాంగనల కాపు పెట్టాడు. మాయ లేడిని చంపి తమ్మునితో పర్ణశాలకు వచ్చిన రాముడు భార్య కనిపించకపోవటంతో దుఃఖించి సీతాన్వేషణ కోసం అడవుల వెంట తిరుగుతూ, రావణునిచే రెక్కలు నరకబడి కొనవూపిరితో వున్న జటాయువునకు అగ్నిసంస్కారంచేసి, దారిలో తారసిల్లిన కబంధుణ్ణి ఖండించి, శబరి సేవలు అందుకుని ఆమె చెప్పిన ప్రకారం పంపా సరోవర తీరం చేరాడు. ఆ ప్రాంతంలో తిరుగుతున్న హనుమంతుడనే పేరుగల వానరుడు, ఆ రాజ సోదరులను చూచి సభక్తికంగా పూజించి, వారి వృత్తాంతం తెలుసుకొని, తన యజమాని అయిన సుగ్రీవునితో అగ్నిసాక్షిగా స్నేహం చేకూర్చాడు. సుగ్రీవుడు తన కథంతా వివరించి, అన్నలో తనకు గల్గిన ఆపద నుంచి రక్షింపమని రాముణ్ణి వేడుకున్నాడు. సుగ్రీవుని అనుమానం పోగొట్టటానికి సప్తతాళభంజనం, దుందుభి కళేబరోత్పాటనం కావించి యుద్ధానికి రాముడు పంపాడు. వారి పోరాటంలో విషదిగ్ధమైన బాణంతో రాముడు వాలిని వధించి ప్రతిజ్ఞాపాలనం సల్పాడు. రాజ్యాభిషేకానంతరం సుగ్రీవుడు ప్రపంచంలోగల కోతులనెల్ల రావించి సీతాన్వేషణలో నియమించాడు. దక్షిణ దిశగా పోయిన కపుల్లో శ్రేష్ఠుడైన హనుమంతుడు లంకలో సీతవున్న సంగతి సంపాతివల్ల తెలుసుకొని నూరామడల సముద్రం లంఘించి, సీతమ్మను జూచి రామచంద్రుని ముద్రిక ఇచ్చి, ఆమె యిచ్చిన చూడామణి గ్రహించి, అశోకవనం పాడుచేసి, లంకకాల్చి, తిరిగివచ్చి రామునికి సీతమ్మ క్షేమవార్త వినిపించాడు. శ్రీరాముడు సర్వవానర సైన్యంతో కదలివచ్చి,

సముద్రం బంధించి, రావణుని సకుటుంబంగా నిర్మూలించి, విభీషణుని పట్టంగట్టి అగ్నిపూతయైన సీతతో భరద్వాజాశ్రమంచేరి, వాయుపుత్రునితో వార్తనంపి, పుష్పకారూఢుడై నందిగ్రామంలో దిగి, భరతుడితో కూడి, జటావల్కలాలు విడిచిపెట్టి, అయోధ్యకు వచ్చి రాజ్యపరిగ్రహణంచేసి, పదకొండువేల సంవత్సరాలు భారతదేశాన్ని పాలించి పరమపదమలంకరించనున్నాడు. ఈ పుణ్యచరిత్ర విన్నా, చదివినా, వర్ణభేదం లేకుండా సమస్త జనులూ ఇహంలో సుఖించి పరంలో భగవంతుని సాన్నిధ్యంలో ఆనందం అనుభవిస్తారు.

## సంగ్రహ రామాయణం సమాప్తం

అని వచించిన నారదునకు ఆతిథ్యం యిచ్చి, వాల్మీకి తనను ధన్యుడుగా భావించాడు. మహర్షి సత్కారానికి సంతోషించి వచ్చిన పని పూర్తి చేసిన ఆనందంతో నారదుడు సత్యలోకానికి వెళ్ళాడు. తర్వాత శిష్యులతో మహర్షి భరద్వాజాశ్రమ సమీపంలో వున్న తమసా నదీ స్నానార్థం వెళ్ళాడు. కొంతసేపు ఇష్టగోష్ఠితో కాలంగడిపి, భరద్వాజుడితో నదికి వెడుతున్నాడు. ఆయన అందుకు కావలసిన వస్త్రాలందీయగా, వనసౌందర్యం విలోకిస్తూపోతున్న సమయంలో బోయవాడొకడు కామమోహితమైన క్రౌంచమిథునంలో మగపక్షిని బాణంతో కొట్టాడు. వెంటనే ఆ పక్షి నేలపైబడి గిలగిల కొట్టుకుని ప్రాణం వదిలింది. ఆడపక్షి నెత్తురులో తడిసి పడియున్న మగపక్షిచుట్టూ తిరుగుతూ, కర్ణపుట భేదనంగా ఎలుగెత్తి కూస్తూన్నది. మాటిమాటికీ ముక్కుపుటాలతో భర్త దేహాన్ని తాకి కదిలిస్తూ దిక్కుతెలియని దీనావస్థలో మునిగిపోయింది. ఆ హఠాత్సంఘటన మహర్షిని కలవరపెట్టింది. ఎంత నిగ్రహించుకున్నా శోకం పొంగివస్తుంది. ధర్మక్రోధావేశితుడై, అనుకోకుండా, అప్రయత్నంగా బోయవాణ్ని చూచి

## వాల్మీకి బోయవాణ్ణి శపించుట

"మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్"

(ఇది వాల్మీకి రామాయణంలో ప్రథమ శ్లోకం. వేద సంబంధం లేకుండా ఇతరత్రా ప్రవర్తించిన సారస్వతంలో మొదటిశ్లోకం కూడా ఇదే. దీనికి రెండు అర్థాలున్నై. బోయవాడా! భార్యతో కలిసియున్న మగపక్షిని నీవు చంపటం చేత ఎక్కువ కాలం భూమిపైవుండజాలవు. సామాన్యమైన అర్థం యిది. క్రౌంచమిథునం అంటే మండోదరీ రావణులు. అందులో కామ పీడితుడైన రావణుని సంహరించటం చేత లోకంలో ప్రతిష్ఠ ఎక్కువ కాలం నీకే లభిస్తుంది. రామాయణ కథాపరమైన రెండో అర్థం ఇది.) అని శపించాడు. దాంతో దుఃఖములో వచ్చిన ఉద్వేగం తగ్గిపోయింది. కానీ ఏదో సంగీత లయ తాళబద్ధంగా, సమంగా వున్న పాదాలతో, నోటినుంచి వచ్చిన ఆ శ్లోకానికి మహర్షి విస్తుపోయాడు. శిష్యుణ్ని చూచి "భరద్వాజా! ప్రతిధ్వనిస్తున్నట్లు చెప్పలేని ఆనందం కలిగిస్తున్న ఇది శ్లోకమే అంటావా?"

భరద్వాజుడు : గురుదేవా! మీ నోటివెంట వచ్చిన వెంటనే ఆ వాక్యాలు నేను ధారణ చేశాను. మళ్ళీ మళ్ళీ మననం చేశాను. ఇందులో నాకు తెలిసిన అర్థమే కాకుండా ఎరియందేదో వున్నట్లు స్ఫురిస్తూ వుంది. ఇది మాత్రం తప్పక శ్లోకమే అని నా విశ్వాసం.

వాల్మీకి: నేను బాధలో ఏమో అన్నాను. కాని బోయను శపించలేదుగా? ఆ సంకల్పం కూడా లేదే! అతనెందుకు ప్రాణాలు వదిలాడు?

భరద్వా: మీ వాక్కు తిరుగులేనిది. మీ సాధుచింతనం సాటిలేనిది. మీరు శపించకపోయినా ఆ మాటల్లో శాపం లేకపోలేదు.

వాల్మీకి: ఉద్దేశం లేకుండానే ఫలితం వస్తుందంటావా?

భరద్వా: చూడండి స్వామీ! మనం జాగ్రత్తగా చూచే నడుస్తాం. మన కంటికి కానరాని సూక్ష్మజీవులెన్నో నలిగి నశించిపోతున్నై. అవి అలా చచ్చిపోవాలనే సంకల్పం మనకు లేదుగా. అలాగే మీరు ఉద్దేశించకపోయినా మీ కోపతీవ్రతలో వచ్చిన మాటలకు ఆ అర్థం వుంది. "మానిషాద అగమః—శాశ్వతీస్సమాః" అన్నప్పుడు ఓరి నిషాదుడా! నీవు బహుకాలం బ్రతకలేవు. అనేగా. అంటే "వెంటనే చచ్చిపో" అని ధ్వనిస్తూంది.

వాల్మీకి: ఎంతపని జరిగిందీ? ఇలా జరగటానికి హేతువు కూడా గోచరించటం లేదు. అనుకోకుండా నారదముని వచ్చాడు. ఆయనను

ఎందుకో కథ చెప్పుతున్నారు. ఆయన చెప్పి వెళ్ళారు. తమసా నదిలో స్నానం చేయాలనే కోరిక కలిగింది వచ్చాం. ఈ విషాద దృశ్యం చూచాము. నిష్కారణంగా బోయవాడు ప్రాణాలు వదిలాడు. ఇంతవరకు ఎప్పుడూ సంకల్ప విరుద్ధంగా జరుగలేదు. మనస్సు మనసులో లేదు. త్వరగా స్నానం ముగించి ఆశ్రమానికి పోదాం పదండి.

భరద్వా: అలాగే స్వామీ!

ఈవిధంగా గురు శిష్యులు జరిగినదాన్ని పదేపదే విచారిస్తూ స్నానం చేసి ఆశ్రమానికి చేరారు. శిష్యులు సిద్ధంగా వుంచిన కందమూల ఫలాలు ఆరగించారు. అయినా వాల్మీకి మహర్షి స్వస్థుడు కాలేకపోయాడు. ఆలో చనలో మునిగివుండగా,

## బ్రహ్మ వాల్మీకి వద్దకు వచ్చుట

ఒకప్రక్క మహర్షులూ, యోగులూ, మునులూ సేవించగా ఇంకో ప్రక్క దేవతలు కీర్తింప, హంసవాహనంమీద వాణీ సమేతంగా బ్రహ్మ సత్యలోకం నుండి నరాసరి వాల్మీకి ఆశ్రమానికి వచ్చాడు. వచ్చిన బ్రహ్మ దేవుణ్ణి, పరివారాన్ని ఎంతో భక్తిప్రపత్తులతో మహర్షి పూజించాడు. కుశల ప్రశ్నల అనంతరం మహర్షి చతుర్ముఖుణ్ణి విజయంచేసినపనికార్ని వినయంగా అడిగాడు. కాని మనస్సుమాత్రం ఏదో చేయరానిపనిచేసినట్లూ, పొందవలసినదేదో పోగొట్టుకున్నట్లూ కలవరపడుతూనే వున్నది. అది గుర్తించిన బ్రహ్మ వాల్మీకిని ఈవిధంగా అడిగాడు.

బ్రహ్మ: మహర్షి శ్రేష్ఠా! ఎందుకు అంతగా బాధపడుతున్నావు?

వాల్మీకి: స్వామీ! ఏమని చెప్పను నా స్థితి! క్రౌంచపక్షిని బోయ చంపి నందుకే హృదయం క్షోభపడుతుంటే, నా మాటలకు వాడు చని పోవటం మరింత క్షోభ కలిగిస్తూంది. నా నోటిలో వెడలిన మాట లకు వాడు చనిపోవటం మరింత క్షోభ కలిగిస్తూంది. నా నోటిలో వెడలిన మాటలు, పాదాలు సమానంగా వున్న అక్షరాలతో, నాలుగు సంఖ్యలో వున్నై. మా భరద్వాజుడేమో లౌకిక రూపంగా వున్న శ్లోకమే ఇది అంటాడు. ఈ విచిత్ర సంఘటనం నాకు పూర్తిగా బోధపడటం లేదు.

బ్రహ్మ: మహర్షీ, నీవు మహాతపస్వివి. రాగవిరాగాలు, సుఖదుఃఖాలూ, ప్రేమవిద్వేషాలూ, కామక్రోధాలూ నీవు జయించటమే కాకుండా ఆశ్రమప్రదేశమంతా అణువణువునా సాత్త్వికగుణాన్ని నింపేశావు. నేటి మహర్షుల్లో అన్ని విధాల నీవే శ్రేష్ఠుడవు. నీచేత మహాకార్యం ఒకటి చేయించాలని సంకల్పించాను. దానికి పూర్వప్రాయంగా నా పుత్రుణ్ణి నీ కడకు ముందుగా పంపించాను. వాడు వర్తమానంలో వున్న రాజచరిత్ర చెప్పాడు. దేనికైనా కార్యకారణ సంబంధం వుండాలి కదా? ప్రేరణగా ఆ విషాద సంఘటన కల్పించాను. ఆ పరితాపంలో నీకు శోకం కలిగింది. ఆ రెండింటి సమ్మేళనం హేతువుగా ఛందోబద్ధమైన శ్లోకం వచ్చేట్లు చేయమని నా భార్యను ఆదేశించాను. ఆమె ఇదివరకే పరా పశ్యంతి మధ్యమా వాక్కుల్లో నీలోనే వుంది. ఇప్పుడు వైఖరీ వాక్కుల్లో శ్లోకరూపంలో సాక్షాత్కరించింది. ఇది ఆది శ్లోకం. దీనికి సారస్వత లోకంలో ప్రథమ స్థానం, ప్రమాణార్హత లభిస్తుంది.

వాల్మీకి: స్వామీ! కారణం ఏదైనా నాయెడ యింత కారుణ్యం కలిగినందుకు నిజంగా నేను ధన్యుణ్ణి. తాము ఎందుకోసం ఈ శ్లోకాన్ని ప్రసాదించారో తెలుసుకోవచ్చా?

బ్రహ్మ: ఆ విషయం నీకు చెప్పటంకోసమే నేను వచ్చాను. నీవు ఇంక ఏ మాత్రం విచారపడకు.

## బ్రహ్మ వాల్మీకిని రామాయణం వ్రాయమని చెప్పుట

వాల్మీకి: స్వామీ! అనుగ్రహించండి.

బ్రహ్మ: మహాతపస్వీ! విను. ఇంతకు పూర్వం నా కుమారుడు చెప్పిన కథ చాలా సంగ్రహంగా వుంది. ఆ కథ ఇంతవరకు ఎలా జరిగిందో, ఇకముందు ఎలా జరుగుతుందో యథాతథంగా నీకు గోచరమయ్యేలా దివ్యదృష్టి ప్రసాదిస్తున్నాను. దాన్ని నీవు లోక సంగ్రహార్థం రాయాలి. అది మర్త్యలోకంలో ఆదికావ్యంగా ప్రసిద్ధికెక్కుతుంది. అంతేకాకుండా మళ్ళీ కృతయుగం వచ్చేంతవరకూ నీ రామా

యణమే ప్రమాణంగానూ, లక్షణయుక్తంగానూ, సర్వాభిమత ప్రసాదంగానూ వుండి, నడిమింటి సూర్యునిలాగా ప్రకాశిస్తుంది. ఆ రామాయణం ఏ శ్లోకమైతే నీ నోటివెంట వచ్చిందో ఆ శ్లోక లక్షణంలోనే రచించు. ఈ యుగంలోనేకాకుండా ముందుయుగాల్లో కూడా మానవులు ఇహపరాలు రెండూ దీనితోనే సాధించి తరిస్తూ వుంటారు. నీవు కోరకపోయినా నీ మహాతపస్సుకు సంతోషించిన నేను ఇంతకంటే మించిన ఫలం నీకేమీ ఈయలేను. నీవు సత్యం దర్శించి చెపుతున్నావు గనుక నీ వాక్కు అసృతదోషం పొందదు. అధిక్షేపాలూ, అపహాస్యాలూ చేసేవాళ్ళు, వాళ్ళకుతెలియకుండానే చెడిపోతారు. నీ హృదయంలో వేదరూపంగా నేనూ, వాగ్రూపంగా సరస్వతీ వుంటాము, ఇక నేను పోయివస్తా" అని చెప్పి స్వస్థానానికి వెళ్ళాడు.

అంతవరకూ కొయ్యబొమ్మల్లాగా వున్న శిష్యులూ, మునులూ తిరిగి ప్రాణం కలవారై బ్రహ్మదేవునిఅమోఘవాక్కులకూ, మహర్షి తపశ్శక్తికీ పరమానందం పొందారు. అనంతరం మహర్షి వచ్చిన మునులను ఆశీర్వదించి పంపించి, శుచియై, వార్చి తూర్పుముఖంగా పరిచిన దర్భలపై ఆసీనుండై మహాయోగ సమాధినిష్ఠలోవున్నాడు. నారదుడు గ్రహించి చెప్పిన రామకథ ఎలా జరుగుతూ వచ్చిందో అదంతా పూసగ్రుచ్చినట్లు కనబడుతూంటే అందున్న మరుగులూ, మర్మాలూ, ధర్మాలూ, కర్మాలూ, కోపాలూ, తాపాలూ, క్రమక్రమంగా హృదయం అనే అద్దంలో ప్రతిఫలింపసాగినై. అటు దర్శనం చేస్తూ, ఇటు రామాయణం పూర్తి చేశాడు.

## గ్రంథనిర్మాణంలో వున్న గొప్పతనం

అది, శ్రీరాముడు పుట్టిం దగ్గర నుంచీ, సీత అగ్నిప్రవేశం చేసేక మళ్ళీ పరిగ్రహించి, రాజ్యాభిషేకం చేసుకొని, సుఖంగా ప్రజలనుపాలిస్తూ మళ్ళీ సీతను పరిత్యాగంచేసి, అశ్వమేధయాగం పూర్తి చేస్తున్నవరకూ, ఏడు కాండలుగానున్నూ, ఇరవై నాలుగు వేల శ్లోకాలున్నూ, అయిదుందల

సలపై ఏడు సర్గలుగానూ విభజించి, నాల్గువేదాల్లో వుండే సర్వమంత్రార్థా లనూ గాయత్రీ మంత్రంలో సముద్ధరించి, లోకశ్రేయస్సుకోసం మహా కావ్యంగా రచింపబడింది. "తానైతే భగవదనుగ్రహంతో పూర్తి చేశాడు. మరి ఇది లోకానికెలా తెలుస్తుంది" అన్న ఆలోచనలో మహర్షి మునిగి తేలుతూ వుండగా, రూపవంతులూ, యశోవంతులూ, ప్రజ్ఞావంతులూ, బుద్ధిమంతులూ, మధురస్వరంతో కూడిన స్నిగ్ధకంఠులూ, విద్యలో, వినయంలో, జయంలో అందెవేసినవారూ, సామగానంలో విశారదులూ, పుంభావ సరస్వతులు అయిన కుశలవులు వచ్చి సాష్టాంగ దండప్రణామం చేశారు.

నమస్కారం చేసి నిల్చున్న అన్నదమ్ముల్ని చూసి పరమానందం పొంది, వేదోపబృంహణంగా తాను పల్కిన రామాయణం, స్వరతాళలయ యుక్తంగా, నవరసాలతో, నానార్థాలతో, అద్భుత కథాకథనంలో, చదివిన మాత్రం చేత సర్వపాపాలూ హరించే శక్తితో, ప్రతి అక్షరం పవిత్రంగా భావించి, స్ఫుటంగా పలికేలాగా మొదటినుంచీ చివరిదాకా ఆ బాలకులకు క్రమంగా బోధించాడు. వారు ఎంతో శ్రద్ధతో, భక్తితో, నేర్చిన ఆ విద్యను సార్థకం చేయటానికి మహర్షి వద్ద అనుజ్ఞ కోరారు. తన్ను చరితార్థుడుగా భావించుకొని దీవించి అనుమతి నిచ్చాడు. అన్నతమ్ములు ప్రచార నిమిత్తం ధరించే నార గుడ్డలు ధరించి, తంబురాలూ, చిడతలూ, గజ్జెలూ, తాళాలూ సంగ్రహించి తిరిగి మహర్షి పాదాలకు అభివాదంచేసి—"గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుర్దేవోమహేశ్వరః, గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః" (గురుదేవుని త్రిమూర్తులుగా భావించుటయే కాక అపరబ్రహ్మగా కూడా ధ్యానించి నమస్కరించారు) అని పఠించి సెలవు తీసుకొని, తల్లిచెంతకు పోయి ఆమె ఆశీస్సులుకూడా పొందారు. అనంతరం--

## రామాజ్ఞ చే కుశలవులు అయోధ్యలో రామాయణం గానంచేయుట

మంచి ముహూర్తంలో ఆశ్రమం వదలి, సమీపంగా వున్న ముని పల్లెల్లోనూ, చర్చావేదికల వద్దా గానంచేస్తూ తిరిగి ఆశ్రమానికి వస్తూండే వారు. క్రమంగా, జనపదాలూ, ప్రజలు సమ్మర్దంగా వుండేలంగడివీథులూ

ఇంకా ముఖ్యమైన చోట్లూ ఎన్నుకొని అక్కడ పాడుతూ విశ్రాంతికి దేవా
లయాలను వుపయోగించుకుంటూ సంచారం చేశారు. ప్రతిఫలాపేక్ష
లేకుండా, ఎవరినీ ఏమీ అడగకుండా పాడుకుంటూ తిరుగుతున్న పిల్లలను
చూచి మొదట్లో ఆశ్చర్యం, తర్వాత ఆనందం, ఆపైన సానుభూతి, అనం
తరం కుశలప్రశ్నలూ, ఆతిథ్యాలూ, అనురాగాలూ కలిసిమెలిసి పామరులనే
కాకుండా పండితులను కూడా పరవశుల్ని చేయటంతో ఆ బాలురకీర్తి
హెచ్చసాగింది. ఊరూరా, వాడవాడా, పల్లె పల్లె ఉత్సాహంతో ఉరకలు
వేస్తూ ఆ జంటను వెంటబెట్టుకొని పోయి తనివితీర పాడించుకొని, తోచి
నట్లు, యథాశక్తిగా, సత్కారాలూ, సన్మానాలుచేయసాగినై. ఆ కుమారుల
గానకళావైదుష్యానికీ, కావ్యంలోని మహార్థాలకూ, రచనాశైలీసంకేతపదా
ర్థాలకూ ఆనందించనివారూ, కథా ఘట్టాలలో వున్న విపరీత సంఘటనకు
చలించి దుఃఖించనివారూ, ఆ బిడ్డలప్రశంసించనివారూ, మహర్షికిజోహారు
లర్పించనివారూ, ఆ పరిసరప్రాంతాలలో లేరంటే ఏమీ అతిశయోక్తి
కాదు. వాల్మీకులవారి అమానుషసృష్టి, ఆముద్దుబిడ్డలఅపూర్వగానం, అత్య
ద్భుతమైన కథానిర్మాణం నాల్గుదిక్కులూ వ్యాపించి ఆ నోటా, ఆ నోటా
బడి పల్లెలనీ,పట్టణాలనీ, రాజధానులనీ, పండితపరిషత్తులనీ భేదంలేకుండా
చిత్ర విచిత్ర వార్తలతో నిండిపోతున్నై. ఆ మునికుమారులకు కౌపీనం,
ముంజి, దండం, అక్షసరం, జందెం, కమండలం, నారవస్త్రాలూ ముని
పుంగవులిస్తే, ఆవుపాలూ, ఫల పుష్పాలూ, పెరుగూ, నేయీ పౌరు లర్పిం
చారు. గృహిణులు పాదపూజల్తో నివాళుల సమర్పిస్తే, బాల బాలికలు
చుట్టూమూగి, ఒక్కొక్క చరణం అందుకొని పాడి భక్తితో భజనలు
చేశారు. పండిత పరిషత్తులు పెద్దలు ఆశీర్వాదం చేస్తూంటే యువకులు అభి
నందించి బిరుదులు రచింపుతుంటే గౌరవించినై. అంతకంతకూ పెద్దల్లో
పిన్నల్లో పెరుగుతున్న ఆనందోత్సాహాలకు ముగ్ధులై మురిసిపోయి బాలక
ద్వయం కంఠమెత్తి తంత్రీస్వన మిళితంగా గానం చేస్తూంటే, సము
ద్రాలు పొంగి తరంగ హస్తాలతో ఆ బిడ్డల నాలింగనం చేయటానికి ఉవ్వి
ళ్ళూరినై. పర్వతాలు ప్రతిధ్వనిరూపంగా పాటాలు వల్లెవేస్తున్నై. నదీ
నదాలు తమ గమనవేగం సవరించుకొంటూ పరవశించీ, ప్రవహించీ, సుళ్ళు
సుళ్ళు తిరిగి, అగాధాలు కల్పించీఆదికావ్యంలాగే పరవళ్ళుతొక్కుతున్నై.

పశువులూ, పక్షులూ, మృగాలూ,కీటకాలూ,సరీసృపాలూతమకుసహజమైన ధ్వనివిశేషాలూ సంకేతాలూమాని నిశ్చేతనాలైనై. కుశలవులు ప్రయాణం చేసినంతమేరా ప్రతీ అణువు పులకించిపవిత్రమవుతూంది. ఎవరినోటవిన్నా రామకథే. ఎవడు ఉదహరించినా రామాయణంలోని శ్లోకమే. ఎవడిని పలకరించినా కుశలవుల పొగడ్తే. ఏకాంత గృహాలలో కూడా సీతారాములధర్మ దాంపత్య ప్రసక్తే. "అహో! అద్భుతం. ఇంత అల్ప కాలంలో ఇంత లోకవ్యాప్తమైన కావ్యం ప్రచురులు తప్ప ఇంకొకటి లేదు. ఆ బిడ్డలెంత అదృష్టవంతులో, వాళ్ళను కన్నతల్లి ఎంత ధన్యజీవియో, ఆ మహర్షిఎంత తపస్సంపన్నుడో" అని ఆబాల వృద్ధం ప్రశంసింపసాగింది. అన్నింటి కంటె విచిత్రం ఏమంటే, పశ్యతోహరుడే (చూస్తుండగానే దోచేవాడు) వార్తాహరుడైనాడు. ఈ విధంగా అడుగడుగునాసంస్తుతులూ, సన్మానాలూ, సత్కారాలూ, గ్రహిస్తూ నిలిచినచోట నిలువకుండా, పండినచోట పండకుండా, తిన్నచోట తినకుండా, కుమార సోదరయుగళం అచిరకాలంలోనే అయోధ్యకుచేరింది. పరమర్ధిరీక్ష్యంగా, శత్రుమర్ద్యేద్యంగా, అస్వర్ణంగా వున్న అయోధ్య ప్రాకార ప్రవేశద్వారదేశం వద్ద నిల్చి పరిసరాలన్నీ పరికించి, ఆ నియమాలనూ, నిబంధనలనూ, చీమకూడా ప్రవేశించడానికివీలు లేకుండా కట్టుదిట్టాలతో కాపాడే రాజసేవకుల క్రమశిక్షణనూ లోలోపల సంతోషించిన ఆ బాలకులు ముహూర్తకాలం ప్రవేశానికి ఎదురు చూశారు. ఆహ్వానంగానీ, విసర్జనం గాని లేదు. ఎవరి పనిలో వారున్నారు. ఇంక లాభం లేదని అన్న తమ్ముడితో "ఏం చేద్దాం? మనకేమో మహానగరాలలో వున్న మర్యాదలు తెలియవు. లోనికిపోయే మార్గం తోచటంలేదు."

తమ్ముడు: అన్నా! ఎందుకు సందేహిస్తున్నావు? ఇంతవరకూ ఏ తాతగారి ఆశీర్వాదం తోడుపడిందో, ఇప్పుడూ అదే తోడుపడుతుంది. వెనుకటిలాగేపాడుకుంటూ పోదాం. ఆపితే అప్పుడు చూద్దాం. మనమేమీ శత్రువులం కాము. పైగా చిన్నవాళ్ళం.

అన్న : చిన్నవాళ్ళం కనుకనే అనుమానిస్తున్నాను. పెద్దవాళ్ళమయితే భయమే లేదు. ఎందుకు వచ్చారంటే ఏం చెపుతాం?

తమ్ముడు: తాతగారి అనుమతితో సంచారం చేస్తూ ఈ మహానగరం వచ్చాము అని చెపుదాం.

అన్న : సరే. ముందు తంబురా శ్రుతులు సరిచేద్దామా?

తమ్ముడు: (మ్రోగించి) సరిగానే వున్నై. కాళ్ళకు గజ్జెలు కట్టుకుందాం.
అని ధరించి, మధురాతి మధుర మోహన కంఠాలు ఏకంగా తంబురా శ్రుతిలీనంచేసి, తాతగారికి నమస్కారంచేసి, ఉచ్ఛ స్వరంతో-

శ్లో॥ "చరితం రఘునాథ శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనం
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయవేధసే
రఘునాథాయ నాథాయ, సీతాయాఃపతయేనమః"

అని పాడుకుంటూ లోపల ప్రవేశించారు. ఆ మధుర గానానికి ఎండిన మోళ్ళు చిగురిస్తూంటే, పశువులు ఆహారంమాని ఆలిస్తుంటే, పాములు పడగలువిప్పి ఆనందముతో ఆడుతుంటే, కాపలావారు మంత్రముగ్ధుల్లాగా, సమ్మోహనాస్త్ర మూర్ఛితుల్లాగా అయినారని వేరే చెప్పట మెందుకు? బాలకులు లోనికి వెళ్ళారు. గానం పూరం అయింది. కావలి వారికి తెలివి వచ్చింది. వారిలో వారు ఇలా ప్రసంగించుకున్నారు.

ఒకడు: ఏం గానం, ఏం గానం! మన ప్రభువుల సభలో ఎంతోమంది పాడితే విన్నాం. ఏదీ ఈ మాధుర్యం? ఆ పిల్లలు రాకపోకలు గుర్తించలేనంత తన్మయత్వం చెందామంటే ఆ పాటకు సాటిగానీ, వెలగానీ, చెప్పటం నావల్ల కాదప్పా. సాక్షాత్తూ ఆ దేవలోకంనుంచి దిగివచ్చారనిపించింది.

ఇంకొకడు: నీవన్నది ముమ్మాటికి నిజం. ఆ అందం మాత్రం ఎవరికుంది? వాళ్ళిద్దరి రూపం ఒకే ఒక అచ్చులో పోసి బ్రహ్మ తయారుచేసి వుంటాడు. చిన్నా పెద్ద తెలియటం చాలా కష్టం. ఆ యమ్మకు వీళ్ళ కవలపిల్లలేమో. మన ప్రభువులు చూస్తే ఎంత సంతోషిస్తారో.

మరొకడు: ఇదీ నిజమే. మరి దీనికేమంటావు? బాలలు చదివిన శ్లోకం విన్నాంగదా. ఇంతకుపూర్వం ఎప్పుడైనా విన్నామా? గొప్పగొప్ప వారంతా ప్రభువులను దీవించారు, పొగిడారు. అంతా మంత్రాలతోనూ, వాక్యాలతోనూ ఉన్నై కాని, ఇలా కమ్మగా తాళంవేస్తూ పాడటం ఉందా?

ఒకడు: లేదు. ఆ గానప్రవాహం నన్ను ముంచింది. పాటలోవున్న అర్థం తెలియనిస్తేగా? ఒడ్డుకు రాలేక ఉక్కిరిబిక్కిరై పోయానంటేనమ్మూ.

ఇంకొకడు: నా సంగతి చెపుతా వినండి. పాడుతుంటే తలెత్తి చూశాను. ఇంకేముందీ? వాళ్ళ అందచందాలు ఆలోచనా లోకంలోకి లాక్కు పోయినై. నేను అయ్యవారి కొలువులో ప్రవేశించాక వచ్చిపోయే వార్ని ఎందరినో చూశాను. కానీ, ఈ అపురూప సౌందర్యం వారిలో లేదు. బ్రహ్మదేవుడికి ఇంక గుడికట్టి పూజించవచ్చు. ఆ పాటలో ఆ రూపంలో, ఆలోచనలో పడ్డానేకాని, పాటలో ఏముందో పరిశీలించలేదు.

మరొకడు: అయితే నేను మీ ఇద్దరికంటే ధన్యుణ్ణి. గానానికి పరవశిస్తూ రూపానికి సంతోషిస్తూ, అర్థానికి ఆనందం పొందాను.

ఒకడు:<br>ఇంకొకడు: } అయితే నీవు పొందిన ఆనందాన్ని మాకు పంచిపెట్టవా?

మరొకడు: తప్పకుండా. మన ప్రభువులవారి చరిత్ర శతకోటి సంఖ్యతో విస్తరించిందట. ఒక్కొక్క అక్షరంకూడా ప్రస్పష్టంగా, ప్రమాణంగా, పవిత్రంగా చెప్పబడిందట. ఆ విధంగా చెప్పిన కథ మహాపాతకాలు పోగొట్టుతుందట. మన ప్రభువులను రాముడనీ, రామభద్రుడనీ, సీతాపతి అనీ పిలుస్తారట. అటువంటి ప్రభువులకు నమస్కారాలు అని గానం చేశారు. ఈ ఒక్క పాటకే ఇంత ఆనందం పొందితే ఇంక శతకోటి పరిమితమైన ఆ పాటలన్నీ వింటే. చెప్పేదేముందీ? ఆ అదృష్టం పట్టవద్దూ?

ఈ సంభాషణ ఇలా సాగుతూనే వున్నది. లోపలికిపోయిన బాల గాయకులు స్వేచ్ఛగా తిరుగుతూ, వీథి వీథినీ, ఇంటింటివద్దా నిలిచి రామాయణం గానం చేస్తూన్నారు. నిజం చెప్పాలంటే అయోధ్యలో ఒక ప్రాణి కూడా ఇంటిలో లేదు. తేనెకు ఈగల్లాగ బాలకుల అనుసరించి ఒళ్ళు మరచి పోతున్నారు. క్షణ క్షణం ప్రమాదసూచి అతిక్రమించే ప్రవాహం పొంగులాగా వార్తాహరులు రాజప్రాసాదానికి వృత్తాంతం చేరవేస్తున్నారు. క్రమంగా రామప్రభువు చెవుల్లోకూడా ఈ వార్త ప్రవేశించింది. అంతటితో ఆగక మాటిమాటికి క్రొత్త విషయాలు కుతూహలం రేకెత్తిస్తున్నాయి.

గంభీరానికి పేరుపడ్డ రాముడు కలవరపడసాగాడు. నవ్వుల వెన్నెల్లో ప్రసన్నంగా కనిపించే ముఖంలో ఆలోచనా రేఖలు కొట్టవచ్చినట్లు గోచరిస్తున్నై. తల్పం దిగి అటూ ఇటూ నడుస్తూన్న మూర్తిలో "ఎవరీ ముని బాలకులు? ఎక్కడినుంచి వచ్చారు? పాడేది రామాయణమా? ఈ రాముడెవ్వడు? దీనిని రచించినది మహర్షి వాల్మీకులవారా? అపర బ్రహ్మగా పేరందిన ఆ మహర్షుల వారిచే ఉద్ధరించబడిన ఆ రాముడు ఎంత అదృష్టశాలి? ఈ చిరుతల గానంతో గ్రాస వాసాలు (తిండీ, ఉనికీ) పౌరులు మరచిపోతున్నారట! ఆ పూజ్యుడు ఏమి వాంఛించాడు? ఏమి ఆపేక్షించి ఈ బాలకులు ఇంత ప్రచారం సాగిస్తున్నారు? అశేషప్రజానీకాన్ని ఆనందపరుస్తున్న కుమారుల చూడాలనీ, వారి గాన విద్యా కౌశలంతో తృప్తి చెందాలనీ కన్నులూ, హృదయం నన్ను తొందరపెట్టుతున్నై" అన్న భావాలు ఒకటివెంట ఒకటి వచ్చి పోతున్నై. చివరకు దీర్ఘ నిశ్వాసం విడిచి ప్రక్కనున్న గంట మ్రోగించాడు. వెంటనే ద్వారపాలకుడు నమస్కారం చేస్తూ వినయంగా లోపలికి వెళ్ళి నిల్చున్నాడు.

రాముడు: "భద్రా! సుమంత్రులవారిని తీసుకొనిరా."

భద్రుడు: "చిత్తం."

ఆజ్ఞ ఇచ్చాడేకాని మనస్సు స్వస్థత పడలేదు.

"ఇందులోని రాముడు తానే ఏమో! అలా ఎందుకు జరుగుతుంది? ఎక్కడి అయోధ్య? ఎక్కడి గంగా తీరం? పరమ తపస్సంపన్నులైన వాల్మీకులవారు సామాన్య రాజచరిత్ర వ్రాస్తారా? వ్రాయమని నేను ప్రార్థించలేదుకదా?" ఇంతలో సుమంత్రుడు రానే వచ్చాడు. తన ఆలోచనా పరంపర ఆపి, చిఱుగద్దెపై ఆయన్ను కూర్చోమని తాను తల్పంమీద కూర్చుండి-

రాము: మహామంత్రీ! మీరుకూడా విని ఉంటారనుకుంటాను.

సుమం: ప్రభూ! వినకేమి? విన్నాను. విని విస్తుపోతూనూ వున్నాను.

రాము: ఔనా! కర్తవ్యం?

సుమం: మీరు పిలుస్తారని ముందే ఆలోచించి వుంచాను.

రాము: అయితే ఆలస్యం ఎందుకూ?

సుమం: తమ అనతికోసమే.

రాము: మీ నిర్ణయంలో లోకం అపార్థం కల్పించదు కదా?

సుమం: లోకం! అపార్థకల్పన! ప్రభూ! ఏ లోకం సంగతి సెలవిస్తున్నారు?
ఈ లోకం ఆనంద సముద్రం మధ్యలోనుంచి ఒడ్డుకు ఇంకా చేరందే అపార్థ కల్పనకు తావెక్కడిస్తుంది?

రాము: అపునుగానీ——ఎందుకో ఇది స్వవిషయంగా తోస్తున్నది.

సుమం: అయితే అంతకంటే కోరతగినదేమున్నది ప్రభూ! తమ కీర్తి అజరామరంగా నిల్చిపోతుంది. లోకం ఆదర్శకంగా ఆరాధిస్తుంది. కాదా? ఒక పురుషోత్తముని దివ్య చరిత్రం సాంగోపాంగంగా సర్వులూ వినేట్లుచేసిన ఖ్యాతి ప్రథమంగా మీకే దక్కుతుంది.

రాము: మీ నిర్వచనం బాగున్నది. తమ అభిప్రాయానుసారం జరిగించండి. ఈ రాత్రికి ఆ కుమారులకు కావలసిన——

సుమం: ప్రభూ! అన్నీ సిద్ధంచేయబడినై. మీరు నూత్నానుభవంతో, నూత్నానందంతో సుఖంగా శయనించండి. సెలవు.

సంభాషణ పూర్తి అయింది. సుమంత్రుడు కార్యవాదిగా వెళ్ళాడు. రామచంద్రుడు కూడా ఉచిత కృత్యాలు తీర్చుకుని దేవతామందిరంలో ప్రవేశించి, పూజాదికములు పూర్తిచేసి భోజనానంతరం శయన మందిరానికి వెళ్ళాడు. రాత్రి అంతా మధుర స్వప్నాలతో, తీయని భావాలతో వేగించాడు. వందిమాగధులు శ్రద్ధా భక్తులతో——

"ఉత్తిష్ఠోత్తిష్ఠ శ్రీరామ, ఉత్తిష్ఠ రఘునందన, ఉత్తిష్ఠ నరశార్దూల, కర్తవ్యం దైవమాహ్నికం" (శ్రీరామచంద్రా! రఘునందనా! నరసింహా! నిద్రలేచి ఆహ్నిక విధులు నిర్వర్తించండి) అని స్తోత్రరూపంగా మేల్కొలుపులు వినిపిస్తుంటే లేచి తొందరగా పనులు ముగించి, రాజోచితంగా అలంకారం స్వీకరించి సిద్ధంగావున్న రథంమీద ఆసీనుడైనాడు. అప్పటికే సభామందిరం యథాక్రమంగా కూర్చున్న పిన్న పెద్దలతో క్రిక్కిరిసి పోతున్నది. జయజయ శబ్దాలతో, మంగళ వాద్యాలతో రామప్రభువు రథావతరణంచేసి, అభివందన, అభినందన, ఆశీఃపురస్కృతంగా సింహాసనం అధిష్ఠించాడు. భూసురోత్తముల స్వస్తివచనంతో సగౌరవంగా ఆహ్వానింపబడిన కుమారగాయకులు వేదికపై నిలిచి, దోసిళ్ళనిండా పూలు ధరించి అరమోడ్చిన నేత్రాలతో

"సభాకల్పతరుంవన్దే, వేదశాఖోప జీవితం,
శాస్త్రపుష్ప సమాయుక్తం, విద్వద్భ్రమరశోభితమ్"

(వేదములే శాఖలుగా కలిగినట్టి, శాస్త్రములే పూలుగా కూడినట్టి, మనీషులే తుమ్మెదలుగా శోభించునట్టి సభ అనే కల్పవృక్షాన్నిగూర్చి నమస్కరిస్తున్నాము) అని పూలు జల్లి సభావందనం గావించి, సదస్యుల అనుజ్ఞ అందుకొని, తంబురాశ్రుతులు సవరించి, కాళ్ళకు గజ్జెలుకట్టుకొని, కాషాయం రంగుతో వున్న సన్నని నారగుడ్డలు ఎడమ భుజంమీద నుంచి కుడివైపుకు జందెంలాగా ముడివేసి, నడుములకు పట్టు రంగుతోవున్న చిన్న వస్త్రములు చుట్టి బిగించి ప్రణవోచ్చారణంచేసి-
శ్లోకం: "కూజన్తం రామ రామేతి మధురం మధురాక్షరం,
ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకి కోకిలమ్."

(కవిత్వమనే కొమ్మపై నిల్చి మధురాతిమధురములైన అక్షరాలతో కూడిన "రామ, రామ" అనే 'కూ' ధ్వనితో కూస్తున్న వాల్మీకి అనే కోకిలకు నమస్కరిస్తున్నాం.)
శ్లోకం: "గోష్పదీ కృతవారాశిం, మశకీకృత రాక్షసాం,
రామాయణ మహామాలా రత్నం వన్దే౽నిలాత్మజమ్."

(సముద్రాన్ని ఆవు పాదంగా, రాక్షసులను దోమల్లాగాచేసి, రామాయణమనే ముత్యాల హారానికి కొలికి పూస రత్నంలాగా వెలుగొందే వాయుపుత్రుడైన హనుమంతునికి నమస్కరిస్తున్నాం) అని ప్రార్థనా శ్లోకాలు చదివి, ఒకటి రెండు ఘట్టాలు మంత్ర మధ్యమ తారా స్థాయిల్లో రసానుకూలంగా, అభినయించి, ఆడి పాడారు. రఘువంశ దీపకుడైన రామచంద్రుడు సింహాసనం దిగాడు. సభలో కలకలం బయలుదేరింది. నడుస్తున్నాడు. సభ సద్దుమణిగింది. సమీపిస్తున్నాడు. ఆ దివ్య మంగళ మూర్తిలో కంపనం, అంతఃక్షోభం కలుగుతున్నై. నిబ్బరించుకొంటూ వేదికను వచ్చాడు. సభ ప్రసన్నమైంది. రామకుమారులు వేదిక దిగి పాదాభి వందనం చేశారు. తడి కన్నులతో, స్నిగ్ధమైన గొంతుకతో, బిడ్డలవేవనె త్తి చల్లని మాటల్తో మెల్లగా "వత్సలారా! మీ ప్రదర్శనానికి ముగ్ధుడనైనాను. మహర్షులవారిచే శిక్షింపబడి, భరతనాట్యచ్ఛేదం గావింపబడి, పండిత పామ

రులచేత కొనియాడబడి మంజుల పదభావార్థములచే కూర్చబడి, మనో మోహనంగా, శివ జటాజూటంనుండి భూమిమీదికి గమనిస్తున్న గంగవలె మీ వదనములనుండి వెల్వడి కర్ణహృదయక్షేత్రాలలో ఆనంద సస్యాలు పండిస్తున్న గానానికి ధన్యవాదాలర్పిస్తున్నాను.ఖండికలుగాకాక, ప్రారంభ పరి సమాప్తి పర్యంతం విన కుతూహలంగావుంది. అభ్యంతరంగానీ, అనవకాశంగానీ వుంటే మా అదృష్ట హీనతకు చింతిస్తాం," అని పల్కుతూ చేలాంచలంతో కన్నులు తుడుచుకున్నాడు. ఆ సన్నివేశం సదస్యుల హృదయంలో చెరగని ముద్రవేసింది. ఆ జానకీ పుత్రులు ప్రభువు మాటలకు మురిసిపోయి "మాధ్యేయం కూడా అదే ప్రభూ!" అంటూ మంద్ర స్థాయిలో తమ ఇష్టం వెలిబుచ్చారు. మధ్యాహ్న విరామం సూచించే గంటలు పన్నెండు కొట్టబడినై. సుమంత్రునితో రథా రోహణం చేశాడు ప్రభువు. అభినందనాలుచేస్తూ ప్రేక్షకులు గృహోన్ముఖులైనారు. విమానంలో పోతున్న గంధర్వ మిథునం ఇంతవరకూ ఆగి, మళ్ళీ ప్రయాణం ప్రారంభంలో ఇలా సంభాషణ సాగించింది.

భార్య: "స్వామీ! గానంలో గంధర్వులు శ్రేష్ఠులని చెప్పుకుంటారు కదా? ఇపుడు తమరేమంటారో?

భర్త: ఏమంటానూ, అందుకు అపకర్ష వచ్చిందంటాను.

భార్య: ఆ మాట సభలో మీరంటే ఎంతో బాగుండేది.

భర్త: నిజమే, నేనూ అదే అనుకున్నాను. కానీ, మనం విమానం దిగటం, వాళ్ళు మనల్ని చూసి మూగటం జరుగుతుందికదా, నిశ్చలంగావున్న స రోవరంలో రాయివేసినట్లు అవుతుందేమోనని ఆగిపోయాను. నా ప్రశంసకంటే అందరి ఆనందంలో కలిసిపోవటమే నా అభిమతం. అదీగాక వారికి నా ప్రశంసలేపాటి?

భార్య: ఇంతకూ ఈ ముని బాలకులను ప్రభువు గుర్తించలేదంటారా?

భర్త: గుర్తించకేం, గుర్తించే వారి యెడదాటు సహించలేక మొదటినుంచీ చివరిదాకా గానం చేయమన్నాడు.

భార్య: ఒప్పుకున్నాను. కానీ, ప్రభువు తన బిడ్డలు కుశ లవులుగా వ్యవహరించటం చూస్తూ హర్షించటం మానవ నైజానికి విరుద్ధంగా వుంది కదూ?

భర్త: ఓసిపిచ్చిదానా! ఎంతమాటన్నావు.రఘువంశంలోపుట్టిన వారెవ్వరూ ప్రజాభిమతానికి విరుద్ధంగా ప్రవర్తించరు. భార్యా పరిత్యక్తుడైన రామచంద్రుడు వారిని పుత్రులుగా గ్రహిస్తే పౌరులు నిమ్మకు నీరెత్తినట్లు ఊరుకుంటారా? ఎన్ని అపోహలు కల్పిస్తారు? ఎన్ని అపనిందలువేస్తారు? సామాన్యంగా వీరిని అనంతర వారసులుగా అంగీకరిస్తారా? ఏం జరుగుతుందో మనం రోజూ ఈవేళకి వచ్చి పరికిద్దాం." ఇంతలో విమానం ధ్వనివేస్తూ కదిలిపోయింది.

ప్రభాతం వచ్చింది.ఆదిసూర్యభగవానునికి పట్టినతెల్లనిగొడుగులాగా వుండే మంచుబొట్లు అంచులకు కుట్టి వ్రేలాడదీసిన ముత్యాల కుచ్చెల్లాగా వున్నై.రాత్రంతాచంద్రసమాగమంతోసుఖానుభూతితో సొక్కిపోయిన కలువకాంతలు అరుణకిరణంతో స్నానార్థం వేచి వున్నై. పగలంతా తిరిగి తిరిగి సంపాదించిన ఆహారంతో,వాళ్ళకు చేరి, ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలకు కడుపార తినిపించి, రెక్కల చేతులతో నిద్ర బుచ్చి, వాటి అవ్యక్తసుఖానికి ఆనందిస్తున్నవాఅన్నట్లు పులుగులు రొదచేస్తున్నై.కోపనమైన యిల్లాలు మగని రాకకోసం వేచి వేచి, విసిగి ముడుచుకొని, ముసుగుబెట్టి, తలుపు చప్పుడు విని సంభ్రమంతో లోటుపాట్లు సరిచేసుకొంటున్నట్లు కదులుతున్న రేకలతో కమలాలు కనిపిస్తున్నై. తమకీ రోజుతో శిక్ష సమాప్తం అవుతుందని తెలిసిన దొంగలు తాళం తీసిన చప్పళ్ళకు చంకలు ఎగురవేస్తూ, దుమ్ము దులుపుకొని వస్తున్నట్లు విచ్చిన పద్మాలల్లో నుండి తుమ్మెదలు రొదచేస్తూ బయటకు వస్తున్నై. పెరుగుచిలికేటప్పుడు కదులుతున్న చేతుల గాజులు కవ్వం చేసే ధ్వనులను కప్పేస్తున్నై. మోకాళ్ళతోఅదిమి పట్టిన కుండల్లోకి సవ్యాపసవ్యంగా పిండుతున్న పాలచప్పుళ్ళతో, పొలానికిపోబోతున్న ఎద్దుల మెడలోవున్న గజ్జెల పట్టెళ్ళ ఘణాఘణలతో కలహిస్తున్నై. కొత్త కాపురం నవదంపతులు మదన విజయంలో పాల్గొని మైమరచి నిద్రిస్తుంటే కాలవిభాగంచేసే గడియారాలైన కుకుటాలు సమయంగుర్తుచేస్తుంటే "లేవండీ! తెల్లవారవస్తూం"డనే కలకంఠులకంఠరవాలు కాలుదువ్వుతున్నై. ముంగిళ్ళ

చిమ్ముతున్న ముడితల అందెలు సమ్మార్జన చేసేటప్పుడు కలిగే నీళ్ళచప్పుళ్ళకు నిరసన తెల్పుతున్నై. దించిన తెర ఎత్తగానే రంగస్థల దృశ్యం మారినట్లు ఆ రోజు జరిగే సభాప్రదేశం మారిపోయింది. ఈనాటి సభ దర్బారుచేసే హాల్లో కాదు. ఇక్ష్వాకు ప్రభువులు పట్టాభిషేకం జరిగిన తర్వాత సమస్తమైనవారికి దర్శనమిచ్చి సందేశం వినిపించే పెద్దమైదానంలో. అర్ధయోజన విస్తీర్ణం కల ఆ ప్రదేశంలో ప్రభువులు అధివసించే ఎత్తైన మంచెపై వేదిక నిర్మించబడింది. దానికిఇరుప్రక్కల ప్రభువులూ, మంత్రులూ, సేనాపతులూ, రాణివాసం కూర్చుండటానికి ఆసనాలు అమర్చబడినై. వాటికి ముందు భాగంలో మహర్షిపుంగవులకూ, వేదవిదులకూ, మహా విద్వాంసులకూ, ఏర్పాటుచేయబడింది. ఆ వేదిక చుట్టూ వలయాకారంగా సోపాన పరంపర రెండు తాడిచెట్ల ప్రమాణంలో కూర్చడం జరిగింది. అందులో మహాజనం హాయిగా తిలకించే అవకాశం కల్పించబడింది. ఆ సుమంత్రుని మేధ ఎటువంటిదోకాని సామంతరాజ లోకం స్వతంత్ర ప్రభులోకం ఆ సదస్సునకు ఆహూతం అయినదంటే ఏం చెప్పాలి. నిర్ణయించిన సమయానికి ముందే ప్రేక్షకులతో ప్రదేశం అంతా నిండిపోయింది. వచ్చినవారు కాలం మందగమనాన్ని కళ్ళారచేసి చూస్తున్నారు. ప్రభువుల రాకకు చిహ్నంగా నగారా శబ్దించింది. మొగసాలలో తొమ్మిది గంటలు మ్రోగినై. వేత్రహస్తులు సభస్యుల్ని లేవవద్దని సైగలు చేస్తున్నారు. రఘుపుంగవుడు రథావతరణం చేశాడు. బాలగాయకులు పల్లకిలోనుంచి దిగారు. దిక్కులు పిక్కటిల్లేలాగా మంగళవాద్యాలు మారుమ్రోగినై. అనుజులతో రామచంద్రుడు వేదికప్రక్క రెండవ వరుసలో సుఖాసీనుడైనాడు. రామచంద్రుని పార్శ్వ రక్షకులు సూర్యవంశ పద్మసూర్యులైన చిరుతలను ఎత్తుకొనివచ్చి వేదిక మధ్యలో కూర్చుండబెట్టారు. కాని, బాలురు వెంటనే లేచి సభా నమస్కారం కావించి, గురుస్తుతిచేసి, పెద్దల అనుజ్ఞ తీసుకొని, మాతృదేవిని మనసారా ధ్యానించి—"మహాజనులారా! వినండి.

# శ్రీ రామాయణ కథా ప్రారంభం

కడచిన యుగంలో అన్య దుర్లభమైన పరాక్రమంతో, సత్యసంధతతో, అకల్మష జీవనంతో, అసాధ్యమైన దైవీ శక్తులతో, అతిలోక ప్రతిభతో, అఖండంగా విశ్వాన్ని పాలిస్తూ, ధర్మదేవత నాల్గు పాదాలతో నడిచేలాగా, మర్త్యలోకం దేవ సత్య లోకాలను మురిపించేట్లు చేసిన మనువూ, అరవై వేలమంది పుత్రకులతో అగాధమైన మహాసముద్రాలు త్రవ్వించి, సాగరా లనే ప్రఖ్యాత నామం కలిగించి, భూమి నిరంతరం జలసమృద్ధంగా వుండేట్లు సల్పిన సగరుడూ మొదలైన భూ భుజులు జన్మించి ఏ వంశానికి తరగని కీర్తి సంపద సంపాదించారో, ఆ ఇక్ష్వాకు వంశానికి మకుటాయమానంగా శ్రీరాముడు పాలవెల్లిలో జాబిల్లి లాగా పుట్టాడు. ఆయన కథను రామాయణమనే పేరుతో వాల్మీకి అనే తాపసి మహాకావ్యంగా రచించాడు. "ఇది బ్రహ్మ సృష్టించిందా?" అని అసూయతో నిరసింపవద్దు. యథార్థంగా ఇది బ్రహ్మ నిర్మించిందే. మీరు ప్రమాణబుద్ధితో ఆలింపవలె, ఆచరించి ఆనందింపవలె. అలా చేయని పక్షంలో ప్రత్యవాయం కలుగుతుంది. ఈ పవిత్రమైన చరిత్ర భూలోకవాసులకు భవ సంతరణ కారణంగా ప్రవర్తింపచేయుటకు మాత్రమే అధికారం పొందిన ఆతడు దీనిని విశ్వశ్రేయఃకామిగా విస్తరింపజేస్తున్నాడు. సావధానులుకండు. శుభంఎల్లప్పుడూ పొందుడు."

ఉపోద్ఘాతం ముగిసిందో లేదో, సభాసదులు ఆనందం ఆపుకోలేక "ఓహో! ఎంత వినయ సంపద! బ్రహ్మచే అనుజ్ఞాతుడై ప్రవర్తింపజేయు మాత్ర అధికారియట. ఆ శ్లోక రచన ఏమి? శైలీ మనోహరత ఏమి? ప్రత్యక్షర సార్థకత ఏమి? అదృష్టపూర్వం, అనితర దుర్లభం. అసలే అచ్చమైన బంగారం. పైగా పరిమళం కూడా అబ్బిందన్నట్లు, ఈ కుమారులు రామాయణానికి అమృతత్వం చేకూర్చటానికి ఆ బ్రహ్మ సంకల్పంచేతనే పుట్టారు. అందుకే శిష్యులైనారుకూడా. ఈ వయస్సేమిటి? ఈ సౌందర్యమేమిటి? ఈ తాపసోచిత వేషాలేమిటి? ఈ గంధర్వగానం ఏమిటి? ఈ బ్రహ్మతేజంలో క్షాత్రతేజం ఏమిటి? ఇంత అద్భుత సృష్టి ఇంతకుపూర్వం

కనలేదు, వినలేదు. ఇంక ముందు కనటం, వినటం వుండదేమో కూడా. ప్రారంభంలోనే పరమానందం పరచిన కావ్యానికి "వేదానికి ప్రమాణం వేదమే" అన్నట్లు కావ్యమే ప్రమాణం అన్న ప్రశంసావాక్య సందోహం ప్రేక్షక హృదయాంతరాళాలల్లో ప్రతిధ్వనిస్తున్నది. "ఇక్ష్వాకువంశం, రామ చరితం" అనే విషయం రామచంద్రుని నేత్రాలను చెమ్మగిల్లచేసింది. కుమారుల దర్శనంచేతనే దుఃఖానందాలు పొందిన మానసం మరీ ఉద్విగ్నం కాసాగింది. నాటికి సభ చాలించబడింది. పెద్దదేవి కౌసల్య మందిరానికి, కోడలు ఊర్మిళలో కలసి సుమిత్ర వెళ్ళింది. పరిచారికలు వచ్చిన వార్త చేరవేశారు. ఎదురుగా వచ్చి కౌసల్య "రండమ్మా రండి. అలా కూర్చోండి శాంతీ!"

**శాంతి:** అమ్మా! వస్తున్నాను.

కౌస: చూడూ. నా కోడలు సీతమ్మ (దుఃఖంతో ఆగి) క్షేమంకోసం శ్రీరంగనాథుని సన్నిధానంలో వుంచిన పూజాపుష్పాలూ, ప్రసాదం తెచ్చి చెల్లెలికీ, కోడలికీ పెట్టమ్మా.

శాంతి: అలాగేనమ్మా (లోపలికి పోయింది)

సుమిత్ర: అక్కా! చూశావుకదా. ఏమి సభ? ఎంత జనం! పెద్దప్రభువుల కాలంలో కూడా ఇంత గొప్ప సభ జరగలేదు.

కౌస: నిజమమ్మా! నిజం అబ్బాయి హృదయం అటువంటిది. తన ఆనందం అందరూ పంచుకోవాలనే వాడి తాపత్రయం. అయితే ఏం? అందరికీ ఉన్న సౌఖ్యం తనకు లేదుగా?

సుమిత్ర: అక్కా విచారపడకు, అసలే ఇక్ష్వాకు వంశం. అందులో అబ్బాయి దాశరథి అధిష్టించింది మహాపురుషుల ధర్మాసనం. ప్రజాహితంకోసం ప్రాణాలను తృణంగా పరిగణించడం పరిపాటే కదా.

ఊర్మిళ: అత్తయ్యా! అగ్నిప్రవేశం చేసింది కదా అక్కయ్య, ఇంకా అపనింద ఏమిటమ్మా?

సుమిత్ర: విషయం అందరికీ తెలిసినా చూచినవాళ్ళు కొంతమందేగా.

ఊర్మిళ: కొందరైనా చూశారుగా.

సుమిత్ర: వారంతా అబ్బాయి అభిమానులూ, అనుచరులూ. తక్కినలోకం నమ్మొద్దూ? ప్రజా సమక్షంలో జరిగితే బాగుండేది.

ఊర్మిళ: వాళ్ళు మాత్రం ప్రజ కాదంటారా? బావగారు సరిగానే చేశారు. పరిగ్రహించేముందే పరీక్షించారు. ఎవరో ఒక్కరన్నమాట ప్రజా వాణి అవుతుందా?

కౌసల్య: అదేనమ్మా ధర్మసూక్ష్మం. అన్నది ఒక్కరైనా, అది అజ్ఞానానికి ప్రతీక. ఉపేక్షిస్తే ఊరంతా ప్రాకుతుంది. వంశగౌరవం, రాజ ధర్మం తెలిసిన రామయ్య అంతపనీ మొదటనే చేశాడు. సరేకానీ, చెల్లెలు వచ్చిన పని చెప్పనే లేదు. ఏదో అవాంతర గాథలో పడ్డాం.

సుమిత్ర: ఔనక్కా! వచ్చిన పని నేనూ మరచాను. ఆ చిన్నవాళ్ళను చూశావుగా. వాళ్ళల్లో పెద్దకోడలి పోలికలూ, పెద్దబ్బాయి పోలి కలూ కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి. దైవం చల్లగా చూస్తే మనుమలు సరిగా ఇప్పటికి ఇంత వాళ్ళయ్యేవారు. ఏమంటావు?

కౌసల్య: సుమిత్రమ్మా! ఆ సంగతి ఎందుకు గుర్తుచేశావమ్మా? మనకీ వార్ధక్యంలో, వైధవ్యంలో ఆ అదృష్టం కూడానా? తక్కిన వాళ్ళ కన్నా నాలుగు కాయలు కాయకూడదూ.

ఊర్మిళ: అత్తయ్యగారూ! రఘువంశం ఇంతటితో ఆగిపోదు. ఆ బిడ్డలు తప్పకుండా అక్కగారి బిడ్డలే. నా అంతరాత్మ ఆ విధంగా పలుకుతున్నది. అవిడ క్షేమంగా వున్నదనికూడా చెపుతున్నది.

కౌసల్య: చిన్నదానివైనా ఊర్మిళమ్మా నీ నోటిమెంట పొల్లురాదు. నాకూ అలాగే అనిపిస్తున్నది. అబ్బాయిలో కూడా కొంత మార్పు కని స్తున్నది. వాడు ఎక్కువగా తన పూర్వపు ఏకాంత మందిరంలోనే కాలం గడుపుతున్నాడు.

సుమిత్ర: నా సందేహం తీర్చుకోటానికే వచ్చానక్కా. అమ్మాయి అన్న మాటలు అక్షరాలా నిజమే అవుతాయి.

ఇంతలో శాంతి ప్రవేశించి స్వామివారి నిర్మాల్యం, ప్రసాదం ఇద్దరికీ ఇచ్చింది. కన్నులకద్దుకొని సుమిత్ర పూలు కోడలికిచ్చి ప్రసాదం స్వీకరించింది. ఊర్మిళ పూలు సిగలో ముడిచి, ప్రసాదం ఆరగించింది. రాజప్రాసాదంలో మూడుగంటలు కొట్టబడినాయ్. "తొందరగా అవశిష్టాలు తీర్చుకొని సభకు పోదాం" అంటూ సెలవు తీసుకుని ఊర్మిళా సుమిత్రలు

తమ ఆవాసానికి చేరుకున్నారు. స్నానాదికాలు ముగించి రామప్రభువు ఉచిత వస్త్రాలంకారధారణంచేసి సభకు వెళ్ళాడు.

## అయోధ్యా పురవర్ణనం

ప్రారంభసమయ ఘంటిక మ్రోగింది. బాలకులు యథాప్రకారం సభావందనంతో మొదలుపెట్టారు. "వినయంలో వింధ్యపర్వతంలాగ, పలుకుల నేర్పులో సత్యలోకంవలె, జననమరణ రుజలు లేకుండా స్వర్గం మాదిరిగా, హిమవత్పర్వతం మోస్తరుగా అన్ని ఓషధులకూ నిలయమై, కైలాసంపోల్కి, విభూతులకు నెలవై, సర్వమంగళవలె సర్వమంగళములతో నిండారి, మధ్యమలోకంలో కోసలము మణిపూసవలె ఒప్పారుతున్నది. సమీపంలో సరయూనది ప్రవహిస్తూ, ఎన్నో సస్య విశేషాలను పండిస్తూ సంపత్సమృద్ధం కావిస్తున్నది. ఆ కోసలమునకు, పన్నెండు యోజనముల పొడవూ, మూడు యోజనాల వెడల్పూ కలిగి అయోధ్యరాజధాని ప్రకాశిస్తున్నది. పరిమళంతోనూ, పండ్లతోనూ నిండిన లతావృక్షములు బాటల కిరువైపులా ఒప్పుతున్నాయ్. వంపుటొంపులు లేకుండా బాణం వేసినట్లు రాజమార్గాలు రాణిస్తున్నాయ్. వెండి, బంగారు కాంతులను పరిహాసం చేస్తూ "మేమెంత ఉన్నతంగా ఉన్నామో చూడండీ" అన్నట్లు ఆకాశాన్ని అందుకునే హర్మ్యాలు అటూ ఇటూ అలరారుతున్నాయ్. చూచిన చోటనే ఆగిపోబుద్ధి పుట్టించే ఆరామాలు శిల్పవాస్తు చిత్రకళా మర్మజ్ఞులచే నిర్మింపబడిన నడబావులూ, సరోవరాలూ, జలయంత్రాలూ, కలిగి అందలి నీటిధారలచే ఎల్లప్పుడూ పుష్పించి వసంతఋతువు వొక్కటే అన్నట్లు శోభిస్తున్నాయ్. కన్నులు కలిగిన ఫలితం, మనస్సు కలిగిన ప్రయోజనం, హృదయం కలిగిన రససిద్ధీ ఆ రాజధానిని చూడనివారికి అందుబాటులో వుండవు. తలఎత్తి చివరగాంచలేని ప్రాకారకుడ్యాలపై నలుమూలలా భయంకరమైన శతఘ్నులు అమర్చబడియున్నై. కోట చుట్టూ "సముద్రుడు ఈ రూపంతాల్చి వచ్చాడా?" అన్నట్లు పరిఖ (నీటితో నిండిన కందకం) పరిక్రమిస్తున్నది. ఆయుధాగారాలూ, హయ గజ శాలలూ, తీర్చి దిద్దబడి బహుసంఖ్యలో భాసిస్తున్నై. ఆకారభేదం, గమన వైచిత్రీగల రథసముదాయం అపారంగా అలరిస్తూన్నది. వర్ణాశ్రమ ధర్మాలను అతిక్రమించక చాతు

ర్వర్ణ్యం పరస్పరం సహకారం, సహాయం, సమరసభావం చిందిస్తూ వెలుగుతున్నది.

మాలతీమందారాలూ, జాజీ మాలతీ కుంద మదనాస్త్రాలూ, పొన్నలూ, పున్నాగాలూ మొదలైన లతా వృక్ష గుల్మాదుల (పొదరిండ్లు) తో ఘ్రాణ తర్పణంచేసే పుష్పవాటికలూ, పనసలూ, రేగులు, నారికేళాలు, ఖర్జూరాలు, మామిళ్ళు, నిమ్మలు, నారింజలు మొదలైన ఫలవృక్షాలతో నిండిన తోటలూ, బెగ్గురుపక్షులు, నీటి బాతులు, వానకోయిలలు, రాజహంసలు, తిరుగుతూ నేత్రపర్వం కలిగించే సరోవరాలూ, కలిగి సత్పురుషుల హృదయంవలె అలరించే ఆ పట్టణంలో, వేదవిహిత కర్మల ఆచరించని విప్రులూ, యుద్ధంలో వెనుకంజవేసే వీరులూ, శత్రువ్యూహాలను ఛేదించలేని సేనాపతులూ, దబ్బర మాటల్తో, వంచనలో, తప్పుడు తూకాలతో, సరిలేని కొలతల్తో, నిలకడలేని ధరలతో ప్రజల బాధించుట వృత్తిగా గల వైశ్యులూ, విహిత కర్మలు వదలి ఇతర కర్మల్లో ప్రవర్తించు శూద్రులూ, వ్యభిచారదోషంగల స్త్రీ పురుషులూ కనుపించరు. అయితే శరీరధారణం చేసినవారికి కొన్ని అవగుణాలుంటై. అవికూడా అక్కడవున్నై. కానీ, ఉండవలసినచోట్లు మార్చుకున్నై. కుటిలత సుందరీమణుల ముంగురుల లోనూ, నాస్తి వారి నడుములలోనూ, కాఠిన్యం వారి వక్షోజాలలోనూ, మందం వారి నడకలలోనూ, చంచల వారి చూపుల్లోనూ చేరినై. ఇంత విలక్షణంగా వుండటానికీ, పేరు ప్రఖ్యాతులు ఆర్జించటానికీ కారణం మహామంత్రులు. వారు చార చక్షువులు. దండనీతి కోవిదులు. సమయజ్ఞులు, సత్యవాదులు. సర్వసమ్మతపథానుసారులు. స్వ పర తారతమ్య గ్రహణ దక్షులు. పౌరజనక్షేమంకరులు, వైరిరాజ భయంకరులు. కదనఫాలనేత్రులు, మేధాబృహస్పతులు, దానశిబి బలి చక్రవర్తులు, నిరంతర రాజసేవా సక్తచిత్తులు. వారు ఎనమండుగురు. అర్థసాధకుడూ, విజయుడూ, సిద్ధార్థుడూ, దృష్టుడూ, జయంతుడూ, మంత్రపాలకుడూ, అశోకుడూ, సుమంత్రుడూ.

అష్టదిగ్గజాలు భూ భారం వహించినట్లు, అన్వర్థనాములైన మంత్రులు రాజ్యతంత్ర నిర్వహణానికి తోడ్పడుతుండే, రవి వంశానికి

పురోహితులై, మంత్రులలో మంత్రులై, వసిష్ఠుడూ, వామదేవుడూ సంభావింపగా దశరథమహారాజు పాలిస్తున్నాడు. ఆయన పరిపాలనలో ధర్మదేవతకు నాల్గవ పాదం వచ్చినట్లున్నది. అతివృష్టీ, అనావృష్టీ, కరువులూ, కాటకాలు లేవు. పెద్దవారుండగా చిన్నలు మరణించటంలేదు. మూడు వానలు నెలతప్పక వర్షిస్తున్నై. సస్యసమృద్ధితోపాటు పశుగణాభివృద్ధి పెంపొంది కృతయుగాన్ని తలపింపచేస్తున్నది. మహర్షులు రాక్షస బాధ లేకుండా, లోకకళ్యాణార్థం యజ్ఞయాగాలు చేస్తున్నారు. కౌసల్యా, కైకేయీ, సుమిత్రలు అను ముగ్గురు భార్యలు సాపత్న్య దోషం లేకుండా సహకరించి ఇహపరసాధకం అయిన గార్హస్థ్య ధర్మం వెలితిలేకుండా సేవిస్తున్నారు. ఈ రీతిగా ఆ మహారాజు అరవై వేల సంవత్సరాలు అప్రతిహతంగా పాలించాడు. కానీ—

## పుత్రులకోసం దశరథుడు విచారించుట

కాలం గడిచినకొద్దీ, వృద్ధాప్యం హెచ్చినకొద్దీ రాజభోగాలపై లాలసత్వం తగ్గింది. పరిపాలనపైకూడా వ్యామోహం నశించింది. ఆయన కున్న చింతల్లా బిడ్డలులేరనీ, ఎలా కలుగుతారనీ. ఒకనాడు విశ్రాంతి మందిరంలో వుండగా దాసి బిడ్డ నెత్తుకొని పోతున్న దృశ్యం కనిపించింది. బిడ్డలపైగల మమకారం కట్టలు త్రెంచుకొని పరుగెత్తసాగింది. లోలోపల విచారించటం సాగించాడు. 'నా పూర్వులు ఎవ్వరూ సంతానహీనులు కాలేదు. పుత్రులు లేనివాడు పున్నామ నరకం ఎలా తరిస్తాడు? సూక్ష్మదృష్టికికూడా లోపం కనిపించదు. భార్యలా? అనుకూలవతులు. మంత్రులా? నవయుగ నిర్మాణ స్వతంత్రులు—కల్పవృక్షాన్నీ, కామధేనువునూ కాదనే మహత్తుగల వసిష్ఠ వామదేవులు గురువులూ, పురోహితులూ. బహుకాల రాజ్యపాలనం వెగటు పుట్టిస్తున్నది. లౌకిక సుఖాలపై రోత కల్గుతున్నది. ముసలితనం శరీరమంతా అలముకున్నది. అడవిలో కాచిన వెన్నెలలాగా ఈ యైశ్వర్య సంపద వారసుడు లేక వ్యర్థం అవుతున్నది. నా సంతానంకోసం వర్షాగమానికి చాతకాల్లాగా ప్రజలు నిరీక్షిస్తున్నారు. ఇప్పటికే కాలం మిక్కిలిగా గడిచిపోయింది. ఇప్పుడైనా నా కర్తవ్యం నిర్ణయించుకోవాను.' ఆలోచన ముగిసింది. అంతరాంతరాల్లో నిలిచిన

ఉత్సాహం ఉరకలు వేయటమేమి, దిగ్గున లేచాడు. వెంటనే కొలువుకూటానికి వెళ్ళి ఆంతరంగిక సచివులతో మంత్రాంగం సలిపాడు. యజ్ఞశక్తిచే సంతానం పొందటానికి నిశ్చయించాడు. మరునాడు అసాధారణ సమావేశం ఏర్పాటు చేయించాడు.

## సభలో దశరథుడు అశ్వమేధాన్ని గూర్చి చర్చించుట

మంత్రుల సమావేశంలో క్రిందటి దినం జైకొన్న నిర్ణయానుసారంగా సుమంత్రుడు వామదేవ వసిష్ఠ సుయజ్ఞకాశ్యపాదిబ్రహ్మర్షులనసగౌరవంగా ఆహ్వానించాడు. అర్థసాధకుడూ, విజయుడూ యజ్ఞసంచారగ్రహణం కోసం యుక్తమైన అధికారుల నియోగించారు. దృష్టుడూ, సిద్ధార్థుడూ యజ్ఞశాలా ప్రదేశంలో నిర్వహించవలసిన బాధ్యతలు స్వీకరించారు. దేశంలోనేకాక, విదేశాలలో వుండే రాజులూ, పండితులూ, గాయకులూ, నర్తకులూ వచ్చి తిలకించే యేర్పాటు జయంతుడూ, ఆహార పానీయాలూ, విశ్రాంతిగృహాలూ, పట్టణసందర్శనకు పనికివచ్చే వస్తువాహనాలూ సమకూర్చే పని మంత్రపాలకుడూ, యజ్ఞ సమయంలో అవసరమైన అన్ని పరికరాలూ, సమిధలూ, వస్త్రాలూ, తేనే, పెరుగూ, నేయి మొదలైన హవిస్సులకు కొరతలేకుండా చూసే భారం అశోకుడూ పైన వేసుకున్నారు. అందుకు కావలసిన కట్టుదిట్టాలన్నీ పూర్తిచేసి మంత్రులు సకాలంలో సభకు వచ్చారు. ముసలి సింహంవలె మహారాజులేచి సభ నాల్గువైపులా చూచి, గురుదేవులకు అభివాదంచేసి, మంత్రుల్ని తిలకించి, సేనాపతుల కటాక్షించి, సామంతుల ఉపలక్షించి మహాజనాభిముఖుడై "పౌరముఖ్యులారా! మీకు కొత్త విషయం తెలుపవలెనని ఈ సమావేశం యేర్పాటు చేయించాను. పూర్వం మా పెద్దలు విఖ్యాత ధర్మపరాయణులై, సత్యవాక్యపాలకులై, ధర్మం, దానం, దయా, వినయం మొదలైన సద్గుణాలతో, శత్రుదుర్నిరీక్ష్యంగా పాలనం నిర్వహించి, ప్రజాదరణానికీ, చిరకీర్తికీ పాత్రులయినారు. నేనూ నా కొలది మేరకు వారి మార్గంలోనే నడచి మీ యాదరాభిమాన గౌరవాలను గ్రహించాను. పూర్వజన్మలో చేసిన కర్మ పరిపాకంవల్ల నేను సంతానహీనుడనైనాను. ఇంత నిడుపు కల్గి సింహాసనానికి వారసుడైతే, నా పాలనలో బహుకాలం తెల్లవార్చిన మీ కరుణలూ, మనస్సులకూ

ఎంతో ఆనందం కలిగేది. ఆ శుభానికి నా దౌర్భాగ్యం నోచుకోలేదు. శరీర పాటవం తగ్గనంతవరకూ విషయేంద్రియాల తృప్తికే కాలం వెచ్చించాను. ఇప్పుడు లోక ధర్మానుసారంగా నాకు బిడ్డలు కలుగరు. అందుకే అన్ని కోర్కెలు ఇచ్చే అశ్వమేధం చేయ సంకల్పించాను. సాధక బాధకాలు సాకల్యంగా చర్చించి విచారించవలసిందిగా మిమ్మల్ని వేడుకుంటున్నాను."

వర్షం కురిసి వెలిసింది. మబ్బులు మెల్లమెల్లగా దృష్టిపథంలో నుంచి దూరమైనాయి. ఆకాశం నిర్మలంగా వుంది. బాటసారికి అడవిలో మార్గం చూపేందుకు కరదీపికల్లాగా చుక్కలు వెలుగునిస్తున్నై. ఆ సమయంలో పాంథుడికి కలిగే సంతోషం ప్రభువులోనూ, ప్రజల్లోనూ కలిగించింది. 'ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు ప్రభువునోట ఇంత మంచిమాటలు వచ్చినై. ఇంతవరకూ నిస్తబ్ధంగావున్న నగరం నిత్యం ఒక నూతనత్వాన్ని సంతరించుకుంటుంది. యాంత్రికంగా సాగిపోయే నిత్య జీవితాలలో ఒక మహోత్సాహం, ఒక భావ సంచలనం ప్రాదుర్భవిస్తుంది' అని లోపల సంతోషించి, తమ అంగీకారం ప్రజలు ఐక్యకంఠంతో పలికారు. వసిష్ఠాది మహర్షులు జనపాలుని సంకల్పం స్తుతించి "అచిరకాలంలోనే మీ కోరిక నెరవేరుతుంది" అని ఆశీర్వాదాలుకూడా చేశారు. "ఇంక ఏ మాత్రం ఆలస్యంకాకుండా ఉత్తమమైన అశ్వాన్ని పూజించి వదలండి. కావలసిన వాటికి తగినవారిని నియోగించండి. సత్య ధర్మపాలుడవైన నీ కోర్కెకు అన్యథాత్వం లేనేలేదు" అని తమ సమయజ్ఞత్వంకూడా వెల్లడించారు. ప్రభువు ఆ పలుకులు విని వినకముందే తనకు సంతానం కలిగినట్లూ, వారితో తాను ఆడుకొంటున్నట్లూ భావించి పొంగిపోయాడు. మంత్రుల ఉద్దేశించి "పెద్దల ఆజ్ఞానుసారం ప్రవర్తించండి. సరయూనది ఉత్తర భాగంలో యజ్ఞశాలలు నిర్మించండి. 'శ్రేయాంసి బహు విఘ్నాని' (మంచి పనులకు చెడ్డ చేరువగా వుంటుంది) అని పెద్దలు చెప్పారు. కార్యాలలో రంధ్రాన్వేషణం చేస్తూ రాక్షసులు విఘ్నం కలిగిస్తూంటారు. అట్టిది జరిగితే యజ్ఞభంగం కావటమేకాక యజమాని కూడా వాడై పోతాడు. కడు జాగరూకులై ఉండండి. 'ఆలస్యాదమృతం విషమ్' (ఆలస్యంచేత అమృతమే విషం అవుతుంది) త్వరపడండి. ఇది మీకూర్పు

లకూ, తీర్పులకూ, నేర్పులకూ పరీక్షా సమయం సుమా" అని హెచ్చరికతో ఆదేశించి ప్రస్థానం చేశాడు. ఇక్ష్వాకు వంశ నందనుడూ, అజపుత్రుడూ అయిన దశరథమహారాజు, రాజప్రాసాదానికి వెళ్ళి క్షణంలో వేషాదికాలు మార్చి, దేవేరులరావించి, తనకోరికా, సభ నిర్ణయం వినిపించి, నేటినుంచీ సవన పరిపూర్తి పర్యంతం, నియమవ్రతులై, జాగరూకలై, శ్రద్ధాళువులై మసలండని ప్రబోధించి, ఇంతకాలానికి తన మనశ్శల్యం పెకలించబడిందని తృప్తిగా నిశ్వసించి శయనాగారానికి చేరుకున్నాడు. పరిచారకులు ఉప్పరిగపై ఉచితంగా, ఉపయుక్తంగా, వుండేట్లు తల్పం అమర్చగా ఆసీనుడైనాడు.

## సుమంత్రుడు రాజునకు సనత్కుమారుని పల్కులు తెల్పుట

ఒకరాజు ఆకాశంపై వున్నాడు, వొకరాజు తల్పంపై వున్నాడు. ఆయన ముఖంలో వెన్నెల విరుస్తూంటే, ఈయన ముఖంలో ఆనందరేఖలు ఆవిర్భవిస్తున్నై. ఇద్దరూ కువలయాధిపతులే. ఆయన క్షీణించి పుంజుకున్నాడు. ఈయన వార్థక్యంలో యౌవనం చవిచూస్తున్నాడు. ఆయన గమనం అంతరిక్షంలో అవ్యాహతంగా సాగుతున్నది. ఈయన ఆలోచన అప్రతిహతంగా హృదయంలో గమిస్తున్నది. సూర్యచంద్ర వంశాలకు బంధుత్వం వున్నట్లే సూర్యచంద్రులకు కూడా వున్నది. ఆ వంశానికి అంకురం ఏర్పడితే తన వంశానికి తరతరాలుగా వచ్చే చుట్టరికం హెచ్చుతుంది, అనుకూలత అలుముకొంటుంది అని అనుకొంటూ పైనున్నరాజు ఇంకా పైకి వచ్చాడు. తనకోసం వచ్చి, చిట్టిచేతులు చాచి యెత్తుకోమని మారాం చేస్తున్న కొడుకును అందుకుందామన్న భావంతో శయనించిన రాజు అదిరిపడిలేచి చూస్తున్నాడు. ఎదురుగా సుమంత్రుడు నమస్కారం చేస్తూ కనబడ్డాడు, ఆనందావేశాలు ఆపుకుంటూ.

రాజు: అవసరంలేకుండా మంత్రులు అర్ధరాత్రి వస్తారా? అలా ఆసీనులు కండు.

మంత్రి: తమ సంకల్పాన్ని, ఆనందాన్ని ఇనుమడింపచేయాలనే వచ్చాను. ఇది రహస్యం. తగిన సమయం.

రాజు: ఇదివరకెప్పుడూ ఇంత చల్లనిమాట చెప్పలేదేం?

మంత్రి: తమరు మాత్రం ఈ సంకల్పం పూర్వం చేశారా? అయినా, వదునూ, కలిస్తేగదా బీజావాపనం? (ధాన్యం విత్తటం)

రాజు: మంత్రీ, నా నిర్ణయానికి ప్రజలేమనుకుంటున్నారు?

మంత్రి: తమ పాలనలో రెండు నాల్కలు సర్పాలకే వున్నై. పౌరులకు లేవు.

రాజు: మంచిమాట. నిద్రరాకుండా కొంచెం ద్రాక్షరసం పుచ్చుకో.

మంత్రి: నేను కథ చెప్పేవాణ్ణిగా. ఎలాగూ రాదు. వింటూతన్మయత్వంలో మీరే ఆ పనిచేస్తారు.

రాజు: (నవ్వుతూ) సుమంత్రా! నిజం చెపుతున్నాను. మంత్రులందరిపైనా మక్కువ సమానంగానే వున్నా ఎందుకో నీవంటే మరీ ఇష్టం.

మంత్రి: వారు అన్ని విధాలా పెద్దలు, నేను కొంచెం చిన్నవాణ్ణి కదా. మరి వినండి దివాణంలో పదకొండు గంటలు కొట్టారు.

రాజు: విన్నావుగా గంటలు? అంతగా పొద్దుపోలేదులే. పైగా ఇది శుభ సూచకంగా వుంది.

మంత్రి: ఒకసారి నేను ఋష్యాశ్రమాలుచూద్దామని వెళ్ళాను. వాలఖిల్యాశ్రమంలో మహర్షులు సమావేశమై, భావి కాల చర్చలు చేస్తున్నారు. ఆ సమయంలో బ్రహ్మమానసపుత్రుడైన సనత్కుమారుడు అంతర్వీక్షణంలో రాబోయే కాలాన్ని దర్శించి వారితో యిలా అన్నాడు! "మనలో కాశ్యపమహర్షిపుత్రుడు విభండకుడు శ్రేష్ఠుడు గదా. ఆయనకు కారణాంతరాలచే లేడియందు ఋశ్యశృంగుడనే కొడుకు పుడతాడు. ఆ బాలుడు ఆజన్మ బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడై పెద్ద పక్షంలో చంద్రునిలా వృద్ధి చెందుతుంటాడు. తండ్రినీ, ఆయన్ను సేవించవచ్చే మునులనూ తప్ప అన్యం ఏమాత్రం ఎరుగడు. ఆ బాలుని తేజస్సుకు మా తండ్రియే సాక్షి. కాని, దేవ రహస్య ప్రవర్తనార్థం అతడు గృహస్థ ధర్మం స్వీకరిస్తాడు. అంగదేశాధిపతియైన రోమపాదుని స్వయంకృత దోషంతో దేశమంతా అనావృష్టి సంభవిస్తుంది. బ్రాహ్మణుల ఆదేశానుసారం రాజు వెలయాండ్రను పంపుతాడు. వారు అతణ్ణి వంచించి, మాయోపాయాలతో స్వదేశానికి కొని వస్తారు. ఆ యువతపస్వి అంగదేశం

పొలిమేరలలో కాలు పెట్టగానే పుష్కలావర్త మేఘాలు గర్జిస్తూ వర్షిస్తాయి. ఆయనను ముందూ, వెనక వర్షంగా రాజ సన్నిధికి భోగకాంతలు కొనివస్తారు. భక్తితాత్పర్యాలతో భూపతి తన కూతురు శాంతను ఇచ్చి పరిణయం చేస్తాడు. ఆ బ్రాహ్మణ్యుని ఆ ఋత్విజమున అయోధ్యాపతి దశరథుడు యజ్ఞంచేసి సంతానలాభం పొందుతాడు. ఇదే ఆయన గృహస్థ స్వీకారానికి కారణం" అని ముగిస్తాడు. నేనా రహస్యం యెంతకాలంనుంచో మీకు తెలుపుదామని యత్నించితే కాలం కలిసి రాలేదు. వారు దర్శించిన కాలం ఇప్పుడు చేరువైనదన్నమాట. మాకూ, మీకూ చిరకాలంగా వున్న కోరిక అచిరకాలంలో అనుభవానికి రానున్నది. మరి సెలవు.

రాజు: నేలప్రాకే తీగకు పందిరివేశావు. ఆ మహర్షి కథ వివరంగా చెప్పు. వినాలని కుతూహలంగా వుంది.

## ఋశ్యశృంగ చరిత్ర

మంత్రి: రాజు చేసిన తప్పు దేశారిష్టకమైన అనావృష్టిగా రూపొందింది. దానితో అంగదేశం అట్టుడికినట్టయిపోయింది. అడవులలో సంచరించే మృగాల కంకాళాలూ, పక్షుల ఎముకలూ, కుప్పలు కుప్పలుగా ఎక్కడ చూసినా కానవస్తున్నై. కాలుమోపటానికి సందు లేకుండా జనపదాలలో, పట్టణాలలో మానవ కళేబరాలూ, పశువుల అస్థిపంజరాలూ నిండిపోయినై. ప్రజల హాహాకారాలు, ఆర్తనాదాలూ ప్రభువు చెవుల్లో గింగురుమంటున్నవి. నిప్పుమీద ప్రేలు తెలిసి పెట్టినా, తెలియక పెట్టినా కాలుతుంది కదా. పశ్చాత్తాపం పొందిన రాజు భూసురులను పిల్చి కర్తవ్యం తెలుపమని వేడుకున్నాడు. వారు దీర్ఘంగా ఆలోచించి ఆ పాప పరిహారార్థం ఋశ్యశృంగుణ్ణి ఆహ్వానించి కుమార్తెనిచ్చి పెండ్లి చేయమన్నారు. "స్త్రీ పురుష వివక్షత తెలియని ఆ తేజం దర్శించడం, ఇక్కడకి కొనిరావటం సాధ్యపడుతుందా?" అన్న మీమాంస అందరినీ కలతపెట్టింది. చివరకు తెలివిగల మంత్రులు రూపాజీవులను పిలిపించి ప్రభువునకు కలిగిన విపత్తూ, దేశానికి పట్టిన దుర్గతీ చెప్పి కార్యం

సాధించుకురమ్మన్నారు. అనుజ్ఞాతలైన వారకాంతలు పలసిన వస్తు సంచయంతో, గుండెబెదురుతో ఋష్యాశ్రమ ప్రదేశానికి చేరారు. తిరిగి తిరిగి వేసారారు. అతడుకానీ, చివరకు ఆశ్రమం గానీ గుర్తించలేకపోయారు. ఎంతో దుఃఖించారు. వచ్చినపని సానుకూలం కాకపోతే వచ్చే అనర్థాలకుభీతిల్లారు. కాలంగడుస్తున్న కొద్దీ కంపరం వారిని కలచివేస్తున్నది. సూర్యోదయమైంది. గడచిన రోజుల్లాగే ఆ దినం అన్వేషార్థం బయలుదేరారు. "అదృష్టం కలసి వచ్చిందా?" అన్నట్లు దూరంగా ఒక తేజస్సు కనిపించింది. క్రమంగా వస్తున్నట్లు గోచరించింది. ఆ రూపం సన్నిహితమైన కొద్దీ కన్నులుమూతపడుతున్నై.ఎలాగో తెప్పరిల్లి ఆ మూర్తిని నిదానించి చూశారు. తలపై కొమ్మున్నది.శరీరమంతా బ్రహ్మ తేజంవుట్టిపడుతున్నది.పోల్చుకున్నారు.కష్టాలుగట్టెక్కినవి అని ఊపిరి పీల్చుకున్నారు. సంతోషించారు. గంతులు వేశారు. ఆడారు, పాడారు. తండ్రి దేవతార్చన నిమిత్తం పూలూ పండ్లూ, అగ్నిహోత్రం నిమిత్తం సమిధలూ తీసుకొనిఆశ్రమానికిపోతున్న మునిబాలకుణ్ణి ఇచ్చటి దృశ్యం ఆకర్షించింది. వెనక్కు తిరిగి తదేకంగా చూస్తున్న బ్రహ్మచారి విచిత్రంగా వున్నవారిఆకారాలకు విస్తుపోయాడు. తనకుతానై సమీపించాడు.

## వేశ్యలు ఋశ్యశృంగుని వంచించి కొనివచ్చుట

మౌని రాక గమనించిన భోగ స్త్రీలు మధురంగా గానంచేస్తూ వయ్యారం వలకబోస్తూ, ఎదురేగి, సముచిత మర్యాదలతో అర్చించి, "స్వామీ! మీ నామధేయం ఏమిటి? ఒంటరిగా వనసంచారం ఎందుకు చేస్తున్నారు? తమ ఆశ్రమ ప్రదేశం ఎక్కడ? ఈ సమిధలూ, పూలూ, పండ్లూ, ఎందు నిమిత్తం కొని పోతున్నారు? మా మీద దయవుంటే సెలవీయండి" అని నమ్రతతో వేడుకున్నారు. తాపసి వారి కంఠ మాధుర్యానికి, వినయసంపదకూ అచ్చెరువుపడి, "మునులారా! నా తండ్రి విభండక మహర్షి. నాపేరు ఋశ్యశృంగుడు. మా ఆశ్రమం ఈ సమీపారణ్యంలో వుంది. మీకు అభ్యంతరం లేకపోతే నా వెంట రండి. నా

ఆతిథ్యం కూడా మీరు స్వీకరించవచ్చు" అని ప్రత్యుత్తరం ఈయగా, వారకాంతలు ఎనలేని ఆనందంతో, "వెదకబోయిన తీగ కాలికే తగిలింది" అన్నట్లు మునివెంట పర్ణశాలకు వెళ్ళారు. వారికి కందమూల ఫలాలు భుజింపపెట్టి, దాహశాంతికి నీరం ఇచ్చి, "అప్పుడప్పుడూ మీరు మాఆశ్రమానికి దయచేయండి" అని చెప్పగా, వారకాంతలు లో లోపల నవ్వుకుంటూ, "మీరు కూడా మా సత్కారం గ్రహించటానికి దయచేయండి" అంటూ ఆలింగనంచేసి విడిదికి కొనిపోయారు. తాపసి విడిదిలో ప్రవేశించగానే ఘ్రాణతర్పణంగా సుగంధద్రవ్యాల పరిమళం గుప్పుమన్నది. ఒకతె పాదాలు కడిగింది. వేరొకతె వలిపెంతో తడి అద్దింది. ఇంకొకతె ఎత్తైన హేమపీఠం వేసింది. మఱొక్కతె మధుర పదార్థాలు వెండి పాత్రలలో వుంచింది. చెలికత్తెలు వట్టి వేళ్ళ విసనకర్రలతో విసురుతున్నారు. పుట్టింది మొదలు ఇంతవరకూ ప్రకృతిమాత ప్రసాదించే సహజ సంపద అనుభవించిన బ్రహ్మచారిని ఈకృత్రిమవాతావరణం, ఈకృతికభూషణం, ఈ పక్వపదార్థం, ఈతెచ్చుకోలు పరిచర్య, ఈవస్త్రాలంకరణధారణ, ఈ అవయవ నిర్మాణ సౌందర్యం, ఈ ఆలింగన చుంబన కిలికించితం కొంతసేపు అప్రతిభుణ్ణి చేసినై. ఎట్టకేలకు తెప్పరింపుకొని "తండ్రిగారు వచ్చే వేళ అయింది. రేపు మళ్ళీ వస్తాను" అని సెలవు తీసుకుని ఆశ్రమానికి వెళ్ళాడు. రేపు చేయవలసిన కార్యక్రమం నిర్దుష్టంగానూ, నిర్దిష్టంగానూ, నిర్ణయంచేసుకొని, అందరూ కలిసి విహారం వెళ్లారు. విభండకుడు ఆహ్నికాలు పూర్తికావించి హవన సమయానికి ఆశ్రమానికి వచ్చాడు. పుత్రుని శరీరంపైనుంచే అననుభూతమైన వాసనరావడం గమనించి, దివ్యదృష్టితో సర్వం గ్రహించి తనపనిలో తాను నిమగ్నుడైనాడు. తండ్రికి చేయవలసిన పరిచర్య పూర్తిగావించి సమాధి నిష్ఠుడైనబాలతాపసి క్షణక్షణం ధ్యాన భంగం కావటంతో కంగారుపడి తండ్రిని సమీపించి తన స్థితి తెలిపాడు. అంతరాంతరాల్లో తెలియని ఏదో అనుభవం మనస్సును ఆక్రాంతం చేస్తున్నదని వివరించాడు. పరిహారం తెలుపమని ప్రార్థించాడు. పాదాలపై పడ్డాడు. కొడుకును లేవనెత్తి ఓదార్చి "విధి విధానం వేరుగావుంది. నీవేమీ కలతపడవద్దు. త్వరలోనే యథాస్థితి, యథాశక్తి కలుగుతుంది. ఇంక శయనించు" మని విభండకుడు ఆదేశించాడు. ముని

బాలుడు స్థిమితతలేని చిత్తంతో వేగించాడు. తెల్లవారక పూర్వమే స్నానాదికాలు ముగించి, అగ్నిహోత్రారాధనకు వలసిన వస్తువులు సమకూర్చి, క్రొత్త మునికుమారులతో గోష్ఠి నిమిత్తం వేగంగా వెళ్ళాడు. వల సమీపిస్తున్న మృగాన్ని చూసి వేటగాడు పొందే సంతోషం పొందినరో వెలందులు ఎదురుగాపోయి కరచాలనంచేసి నిన్నటివలెనే ఆడీ, పాడీ, అభినయించీ, గంధంపూసీ, పూలదండలువేసీ, రుచ్యమైనమోదకాలుభుజింపపెట్టి, సరస సంభాషణలతో నవ్వించి, కడగంటి చూపుతూపులతో కవ్వించి "ఆ విప్రోత్తము వజ్రపంజర నిభంబై, నిశ్చలంబైన సద్భావం బంగన సాహచర్యగుణసంబంధంబునన్ లోహమై, గ్రావంబై, దృఢదారువై, తరుణ వృక్షంబై ఫలప్రాయమై, పూవై, తన్మకరందమై కరగిపో" అన్నట్లుగా చేశారు. కానీ వారిలో కామభావం లేనందున, మునిలో ప్రేరణ శక్తి ప్రబుద్ధం కాలేదు. వారు కార్యార్థినులుగా ఈ పని చేశారు కనుక, ఈతనిలో అవ్యాజమైన స్నేహభావం కలిగింది.

వేశ్యలు: స్వామీ! మేం వచ్చి చాలా రోజులైంది. మా నివాసాలకు మరలిపోతాం. అనుజ్ఞ నిప్పిస్తారా? మహానుభావులైన మీ యెడబాటు మాకు కష్టంగా వున్నా పనుల తొందరలవల్ల పోక తప్పటం లేదు.

ఋశ్య: తాపసులారా! మీ రెంత మంచివారు! మీ సాహచర్యం మరువలేకుండా వున్నాను. కాలం అల్పమైనా మీ సేవ ఎంతో తృప్తి నిచ్చింది.

వేశ్యలు: స్వామీ! మేం నిజంగా ధన్యతకలవాళ్ళం అయ్యాము. మీరు మాతో వస్తే, మా నివాసాలూ, ఆహార విహార వ్యవహారాలూ చూడవచ్చు. అక్కడి వాతావరణం చాలా ఉల్లాసం కల్గిస్తుంది.

ఋశ్య: మీ కోరిక కాదనలేను. తిరిగి త్వరగా నన్ను పంపుతారు కదా!

వేశ్యలు: తమకు ఏమాత్రం సందేహం కలగేలాగ ప్రవర్తించం. అలివేణీ! ప్రయాణానికి సిద్ధపరచమని చెప్పు. శ్యామా! అయ్యవారికి తగినట్లు అందులో ఒక ప్రదేశం అలంకరించు. మంజూ! పల్లకి తెమ్మను. ఈ విధంగా ఆదేశించి మునిపుంగవుని తోడ్కొని, హయవేగంతో

అంగదేశం పొలిమేరలు చేరనరిగి, ప్రభువునకు వార్త పంపించి, వార వనితలు ప్రభువు రాక నిరీక్షిస్తున్నారు. ప్రభువు వెంటనే బ్రాహ్మణులతో, మంత్రులూ, పౌరులు వెంటరాగా ఎదుర్కొని పూజించి, మంగళవాద్యాలతో సరిహద్దులోనికి కొనివచ్చాడు. భూపతి శరీరంనుంచి పొగలాగా ఒక నీడ నిర్గమించింది. ఆకాశం మేఘావృతమైంది. ఫెళఫెళమంటూ ఉరుములూ, తళతళమంటూ మెరుపులూ, కుండపోతగా వర్షం ఒక్కసారిగా ఉద్భవించి, దేశాన్ని జలమయం చేశాయి. ప్రజల్లో ఆనందోత్సాహాలు మిన్నుముట్టినై. ఆ మహా తపస్వి ఉన్న చోట ఈతిబాధ కలుగదని ఎరింగిన భూమీశుడు, దత్తపుత్రిక శాంతనిచ్చి వైభవోపేతంగా వివాహం చేశాడు. తదాది అంగదేశం సర్వసుభిక్షంగా వుంది. పుత్ర వాంఛారతుడైన దశరథుడు రోమపాదు జామాతను యజ్ఞార్థం వరింపవచ్చాడు. మిత్రుని రాకకు ముదమందిన అంగపతి అల్లుని పిలిపించి వచ్చిన పని వినిపించాడు. గృహస్థుడూ, సంతానవంతుడూ, స్వస్థుడూ అయిన ఋశ్యశృంగుడు అంగీకరించాడు. ఆయన ఆధ్వర్యంలో యజ్ఞపరిసమాప్తి కావించి, నాల్గు సముద్రములవలె, నాల్గు దిక్కులవలె, బ్రహ్మ నాల్గుముఖములవలె నల్గురు బిడ్డల్ని పొందనున్నాడు అని సనత్కుమారుడు మునులకు తెల్పిన రహస్యంవివరంగా మంత్రి మహారాజునకు విన్నవించాడు. ఆ రాత్రి ఆనంద రాత్రి అయింది.

## దశరథుడు ఋశ్యశృంగుని కొనివచ్చుట

వసిష్ఠ వామదేవులతో రాత్రి విన్న విషయం వివరించి, వారి అంగీకారంపై సకుటుంబంగా, ససైన్య బంధు పరివారంగా అంగదేశానికి యాత్రచేశాడు. స్నేహితుని రాకకు ప్రియమందిన అంగపతి ప్రత్యుత్థానం చేసి, సకలోపచారాలు సలిపాడు. రాకరాక వచ్చిన మిత్రుని కుశల ప్రశ్నానంతరం వచ్చిన కార్యం గూర్చి ప్రశ్నించాడు. దశరథుడు ముందు కొంత సంశయించాడు.

అంగరాజు: మిత్రమా! ఎందుకు సందేహిస్తున్నావు? నేను పరాయివాడనా?

దశరథుడు: నేను నీ వద్దకు కార్యార్థిగా వచ్చాను.

అంగ: నీవు అర్థించటం ఏమిటి? ఆదేశించాలి కాని.

దశ: ఇది ఆదేశించే పనికాదు. అర్థించేదే.

అంగ: అది ఏదైనా ఆదేశంగా భావిస్తాను.

దశ: అంతవరకు అక్కర్లేదు. నేను అశ్వమేధయాగం తలపెట్టాను.

అంగ: ఇది ఇక్ష్వాకులకు వంశాచారమేకదా. నా సర్వస్వం నీదే. ఏమి కావాలో అది ఇస్తాను.

దశ: నాకు అర్థబలం, అంగబలం వున్న సంగతి నీవెరిగిందే. నాకు లేనిదీ నీకు కలదీ ఒకటి వున్నది. అందుకై వచ్చాను. అది మహర్షి నీకు అల్లుడు కావటం. ఆయనగారి కోసం అర్థించటానికి-

అంగ: చెలికాడా! ఆ తపస్వి నిజంగా నీ అల్లుడు. శాంత నీ బిడ్డే గదా.

దశ: ఇది బహుకాలం మాట. ఇప్పుడు వంశాంకురంకోరి, వారిని ఆహ్వానించటానికై రావడం జరిగింది.

అంగ: అంతా అర్థమైంది. నీ కోరిక సిద్ధిస్తుంది. అల్లుణ్ణి ఇప్పుడే పిలిపించుతాను.

దశ: అది మర్యాదకాదు. వారి సన్నిధానానికి పాదచారిగాపోయి ప్రార్థించుతాను.

అంగ: ఆలస్యమెందుకూ? ఇప్పుడే వెళ్ళదాం పద.'

మిత్రులు ఇద్దరూ తాపసి దర్శనంకోసం వెళ్ళారు. భార్యతో గృహస్థధర్మంలోని అసాధారణ సంఘటనల గూర్చి చర్చిస్తున్న ఋషి పుంగవుడు వారిని ఆహ్వానించి ఆసనములు చూపాడు. శాంత కాలం గమనించి ఇద్దరికీ గోక్షీరము అందించింది. అలునితో అంగరాజు, దశరథుని చూపించి 'ఈయన అయోధ్యాపతి. పేరు దశరథుడు. శాంత ఇతని బిడ్డయే. ఇప్పుడు సంతతి లేనందుకు మిక్కిలి సంతాపించి మీ ఆధిపత్యంతో అశ్వమేధం చేయాలని అర్థింపవచ్చాడు. మీ అంగీకారం నాపట్ల చూపిన అనుగ్రహంగా భావిస్తాను' అన్నాడు. విని తల పంకించి శాంతవైపు చూచిన భర్త భావం గ్రహించినట్లు దంద్రితో ఇలా అన్నది. 'వారు ఒప్పుకున్నారు. కానీ, నన్నుకూడా వెంట రమ్మన్నారు.'

దశ: అమ్మా! నా అభిమతం అదియూ కార్యం ముగిసేవరకూ అక్కడనే వుండాలని.

అంగ: ఇంకేం అమ్మాయితోపాటు అందరం ఇప్పుడే బయలుదేరుతాం.

దశ: అయితే తర్వాత తమరు దయచేద్దామనుకున్నారా?

అంగ: ఇంత పెద్దలు ఇంటికి వస్తే అలా ఎందుకు జరుగుతుందీ?' మిత్రుల ముచ్చట్లు ముగియగానే సమంత్రకంగా ఋశ్యశృంగ మహర్షిని అర్చించి యజ్ఞమూర్తిగా సంభావించి వరించాడు దశరథుడు. నిర్విఘ్నంగా ముగిస్తానని మంత్రసహితంగా మహర్షి తాంబూలం స్వీకరించాడు.

## అందరూ అయోధ్యలో ప్రవేశించుట

ప్రభువు మహర్షులతో తిరిగి వస్తున్నాడని వార్తాహరులు మంత్రుల కెరింగించారు. చిత్రవిచిత్రాలైన పనితనంతో గృహాలు అలంకరింపబడ్డయ్. మామిడి ఆకులతో, అరటిచెట్లతో, పూలగుత్తులతో వీథులు శోభాయమానంగా వెలుగుతున్నై. పురజనులతో మంత్రులు ఎదుర్కొని రాజమర్యాదలతో అతిథులను ఆహ్వానించారు. రకరకాలైన వాద్యవిశేషాలు, వందిమాగధ స్తోత్రాలు, పురోహితుల వేదఘోషలు, వెలయాండ్ర గేయాలు, గజబృంహితాలు, హయహేషాలు, మహర్షుల ఆశీర్వచనాలు ఒక్కమాటుగా సాగి భూనభోంతరాలు నిండిపోయినై. ఆ కోలాహలంలో కలుగుతున్న జనసమ్మర్దాన్ని తొలగించుకుంటూ వారందరూ రాజమందిరము చేరవచ్చారు. అవనీపతి ఆజ్ఞానుసారం ఋశ్యశృంగ మహర్షి వసిష్ఠుని ఆశ్రమానికి కొనిపోబడినాడు. శాంత అంతఃపురానికి వెళ్ళింది. రాజద్వయం రాజప్రసాదంలోకి నడిచారు. తక్కినవారు విడిదులలోకి వేంచేశారు. మహర్షి యుగళం యజ్ఞానికి సంబంధించిన అన్ని విషయాలూ కూలంకషంగా చర్చించారు. అంతఃపురాల్లో శాంతకు పుట్టింటి గౌరవం అంతులేకుండా జరిగింది. చిత్రరథుడూ, దశరథుడూ కలిసే కార్యక్రమాలు నిశ్చయించారు. ఋత్విక్కులు రావింపబడినారు. వారంతా ఋశ్యశృంగుణ్ణి అధికారిగా అంగీకరించి, ఎవరెవరు ఎంత అధికారులో, ఎవరెంతవరకు విధి నిర్వహించాలో ఏ ఏ దీక్షలతో ఉండాలో, వారివల్ల గ్రహించారు. ఆరు నెలలూ అహోరాత్రాలు దీక్షాపరులై, దేహశుద్ధీ, అంతఃశుద్ధీ కలిగి తమ మంత్రోచ్చారణచే దేవతాగణము హవిస్సుల గ్రహింప స్వరూపములతో సాక్షాత్కరించునట్లు చేయంగల శక్తిని సంపాదించారు. కాలచక్రం గిర్రున తిరిగింది. శిశిరం ముసలి రాజులోని అసంతృప్తిలాగా గడిచిపోయింది. కాలపురుషుడు నూతనోత్సాహం పొంగులారగా విశ్వవర్ధనకు సన్నాహం చేస్తున్నాడు.

## అశ్వమేధయాగ ప్రయత్నం చేయుట

వసంతం వచ్చింది. ఎండిన చెట్లూ, లతలూ, అయోధ్యావాసుల హృదయాల్లాగా చిగురులు తొడిగినై. వారి వాంఛల్లాగా తీగలుసాగినై. వారి సంభాషణల్లాగా పులుగులు కలకలారవాలు చేస్తున్నై. వారి ఆటపాటల్లాగా నెమళ్ళూ, కోకిలలూ ఆడిపాడుతున్నై. వారి ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లాగా చల్లనిపిల్లతెమ్మెరలు వీస్తున్నై. వారి సంపత్సమృద్ధిలాగా పూలువిచ్చి తావులు వెదజల్లుతున్నై. వారి భావాల్లాగా లేళ్ళూ, దుప్పులూ గంతులు వేస్తూన్నై. వారి కార్య వ్యగ్రతలాగా భానుడు దీర్ఘయాత్రకు ఉపక్రమించాడు. అన్ని ఋతువు గణాలూ అంతో ఇంతో సంతరించుకున్న వసంతం, ఋతురాజుగా, ఆనందప్రదాతగా విశ్వం పాలిస్తున్నాడు. కాముకీ కాములకు కావలసినంత కమ్మని వాతావరణం. విరహులకూ, విప్రలంబులకూ తెంపులేని భావపరంపరా, కవులకు గంటంవిడని పనీ, ప్రకృతిమాతకు నవ నవానందం సంతరించి, మళ్ళీ తన రాకకోసం ప్రాణులు తహతహపడేలాగా ప్రకాశిస్తున్నది.

ఆనాడు నిండుపున్నమి, చల్లని చేతుల్తో శశాంకుడు ప్రకృతిదేవిని ఆలింగనార్థం ఆశ్రయిస్తున్నాడు— మగని స్వేచ్ఛను అంగీకరించని భామవలె కలువకన్నె అసూయతో 'నాకంటే ప్రేమించతగిన వారున్నారా?' అన్నట్లు అందమంతా ఒలకబోస్తున్నది. జ్యోత్స్నాభిసారికలు తెల్లని వలిపెములు ధరించి, మల్లెపూలు తలనిండా పొదిగి, వెండిపాత్రలతో పాలు తీసుకొని పతులను సేవించటానికి పయనిస్తున్నారు. ముగ్గుబుట్టలైన తలలతో, ముడిసిన వదనంలో ఒక క్రొత్త శోభ గోచరింపగా, ముగ్గురు భార్యలు కలసి సేవిస్తుండగా ముసలిరాజు మందహాసంచేస్తూ, "అర్ధాంగులారా! ఈ సమయం మంచిదే. నేనూ సుమంత్రుడూ వసిష్ఠులవారి దర్శనార్థం వెళ్ళుతున్నాము. వర్జంలేదు, లగ్నం బాగుంది. వారిని కార్యారంభం చేయవలసినదిగా అర్థిస్తాను. మీరు దీక్షలో ఏమరుపాటు చూపవద్దు. ఋశ్యశృంగులు సాక్షాత్ వేదమాత స్వరూపమేనట. వారి ఆధిపత్యంలో పొందనికోర్కెలు ఉండవని మన గురువులు వసిష్ఠ వామదేవులు సెలవిచ్చారు." అనగానే ముద్దుల భార్య కైకేయి "స్వామీ! మన పురోహితు

లైన వసిష్ఠ వామదేవులు, అపర బ్రహ్మలు కదా. సృష్టికి ప్రతిసృష్టిచేసిన విశ్వామిత్రులవారినే పాదాక్రాంతం చేసుకొన్న గురువులు వసిష్ఠులవారేల ఈ క్రతు భారం వహించరేమో?" అని ప్రశ్నించింది.

"అందరూ సమానాధికారం కలవారైనా, చేయవలసిన పనికి ఒక్కరే అర్హతగలవారుగా ఉన్నప్పుడూ, ఆ ఒక్కడూ ఇంకొకని సూచించినప్పుడూ, ఏం జరుగుతుందో అదే ఇప్పుడూ జరిగింది. వారేవీరిని వరించమన్నారు. నీ సందేహం తీరిందా? ఇక నేను వెళ్ళివస్తా" అంటూ శిరఃకంపనతో వోసినవ్వులు వెదజల్లుతూ క్రిందికిదిగివెళ్ళాడు.

ప్రభువూ, మంత్రి కలిసివెళ్ళి వసిష్ఠుల వెంటపెట్టుకుని, వామదేవ, సుయజ్ఞ,జాబాలి,కాశ్యపుల దర్శించి వారితోకూడిఋశ్యశృంగుల సన్నిధానం చేరుకున్నారు. అందరూ ఉపవిష్టులైన పిమ్మట రాజు వచ్చిన పని నివేదించి క్రతుప్రారంభం కావించమని కోరాడు. అందుకు ఆయన సమ్మతించి "ఇంతవరకూ నీ రాకకోసమే చూస్తున్నాను. జరగవలసిన విధి విధానంలో పూర్వరంగం పూర్తి అయింది. ఇంక ఉత్తమాశ్వాన్ని తెప్పించు. దానిని పూజించి పురోహిత సంరక్షక సమేతంగా విడిచి పుచ్చుతాను" అనుట యేమి, ఆ విధంగా జరగటమేమి క్షణంలో పూర్తి అయింది. దర్భల మంత్రించి పురోహిత శ్రేష్ఠులైన భూసురులచేతి కొసంగి 'ఇవి అధర్వ మంత్రశక్తి పూరితాలు. సంరక్షకుల శక్తి పూర్తిగా శత్రులచే హరింప బడ్డప్పుడు మాత్రమే ఉపయోగించాలి. సామాన్య బాణమునకు ఒక దర్భముక్క జోడించి ప్రయోగిస్తే చాలు. యుద్ధప్రసక్తి లేకుండా శత్రు క్షయం జరుగుతుంది. దుర్వినియోగపరిస్తే భూపతే నశిస్తాడు. జాగ్రత్త, జాగ్రత్త, జాగ్రత్త" అని ముమ్మారు హెచ్చరించి ఋశ్యశృంగులవారు అనుమతి ఇచ్చారు. సైన్యరక్షణలో గుఱ్ఱం కదిలిపోయింది.

## వసిష్ఠుడు యజ్ఞ వస్తువులు సిద్ధము చేయించుట

వచ్చింది మళ్ళీ వసంతం. అరవైవేల వసంతాలు చూచిన రఘువంశ తిలకుడు, పండుపండిన ముసలిరాజు ఈ వసంతాగమనంలో పొందిన ఆనందం తన యౌవనంలో కూడా పొందివుండడు. అన్నిట్లో తాను శ్రద్ధ వహించటమే అందుకు సాక్ష్యం. మానవుని మేధ గుర్తించిన పంచాంగంలో

సంవత్సరం గడిచింది. ప్రభువు తిరిగి వసిష్ఠుని కడకు వెళ్ళాడు. యథావిధి పూజించి, అంజలి బంధంతో యజ్ఞం ఉపక్రమించవలసిందని అర్థించాడు. రఘువంశ పురోహితత్వం తానెందుకు అంగీకరించాడో ఆ శుభ సమయం ఆసన్నమయిందని అమందానందం పొంది 'ప్రభూ! ప్రారంభంముందు చేయవలసిన పనులన్నీ పూర్తి గావింపబడినై. ఇక చేయవలసిన కార్యం గురించి చెపుతాను ఆలకించండి. సరయూనదీ తీరాన ఉత్తర భాగంలో ఒకటిన్నర యోజనముల నిడివీ, అంత పరిమాణంకల వెడల్పూ ఉండేట్లు యజ్ఞప్రదేశం సమతలంగా చేయించి, నాలుగు వర్ణాల వారికి నాల్గుదిక్కుల విశ్రాంతి గృహాల నిర్మాణం చేయించాలి. సవనం ముగిసేవరకూ ఆహార లోపం రాకుండా పదార్థాలు సేకరించాలి. వెండి, బంగారం, నవరత్నాలూ నవధాన్యాలు, దర్భలూ, ఆరె, జమ్మి, మోదుగ, రావిచెట్లనుంచి చక్కగా ఎండిన సమిధలు నూరు బండ్లు తెప్పించాలి. నూర్గురు వేదవిదులైన ధరణీ సురశ్రేష్ఠుల రప్పించాలి. శిల్పవాస్తు శాస్త్రాలల్లో ఆరితేరిన పెద్దలను పిలిపించాలి. ఖనకులనూ (త్రవ్వువారు), కర్మకారులనూ, నర్తకులనూ,గాయకులనూ, చిత్రకారులనూ, పౌరాణికులనూ, తోలుబొమ్మలవారినీ, వీథి భాగవతులనూ, వర్ధకులనూ (వడ్రంగులు) దేశదేశములనుంచి అసంఖ్యాకంగా ఆహ్వానించాలి. ఋత్విక్కులనూ, హోతలనూ,అధ్వర్యునకూ, బ్రహ్మకూ, ఉద్గాత (బిగ్గరగా వేదమంత్రాలు పఠించేవాడు)కూ పీఠములూ, వాటిపై కుశ హరిణ వ్యాఘ్రాసనాలుచేకూర్చాలి. ప్రేక్షకులు తొడతొక్కిడిలేకుండా కూర్చుండి వీక్షించే అవకాశాలు కల్పించాలి. అహోరాత్రాలూ భూత ప్రేత పిశాచ రాక్షస గణాలవల్లవచ్చే విఘ్నాలను ఎదుర్కొనే శౌర్యవంతులైన వారిని నియమించాలి. ధరణీపతులెందరున్నారో వారినందరినీ పత్రికా ముఖమున పిలిపించాలి. ఆశ్రితులుగానీ, అర్థులుగానీ, పేదలుగానీ, సాధులుగానీ, అంగహీనులుగానీ, అర్థించినప్పుడు అపహేళనచేసిననూ, అసంతృప్తిగా ఇచ్చిననూ, యజ్ఞఫలం లభించకపోగా,యజమాని సకుటుంబంగా నశించిపోతాడు. కనుక ఆ పనులను సర్వాత్మనా తగినవారినే నిలపాలి.

రాజ బంధువులలో మిథిలాపతి మిక్కిలి గణింపతగినవాడు. నీ మామ కాశీపతి కేకయుడు అతి ముఖ్యుడు. అట్లే నీ ప్రథమ భార్య కౌసల్య తండ్రి భానుమంతుడూ, సుమిత్రాజనకుడు మగధపతి వీరిని

సబహుమానముగ కొనివచ్చుటకు సుమంత్రుణ్ణి పంపాలి. తూర్పున సౌవీర సింధురాజులనూ, దక్షిణమున సౌరాష్ట్రియులనూ ప్రత్యేకముగా పిలుచుటకు సిద్ధార్థుని పంపవలెను. అర్థ సంపాదనమునగానీ, వ్యయమునగానీ, భయ సంకోచములు మనస్సులోనికి రానీయవద్దు. అఘటన ఘటనా సామర్థ్యముల ఋశ్యశృంగుల సంకల్పము మోఘము. ఇంక నీవేగి కార్యోన్ముఖుడవుకమ్ము" అని అనతి ఇచ్చేలోపల, సుమంత్రుడు మంత్రి సప్తకంతో వచ్చి "స్వామీ తమరు సెలవిచ్చిన పనులు ముగించాము. రాజబంధువుల తోడ్కొని వచ్చుటకు నేను పోవుచున్నాను. ఒక్కసారి యజ్ఞ వాటికకు విజయంచేసి లోపాలోపములు చక్కదిద్ద గోరెదము" అనుట తడవుగా, మహర్షియు, భూపతియూ, ఆశ్చర్యంతో మంత్రి సత్తముల జాగరూకతనూ, సమయోచితబుద్ధికీ, సర్వశాస్త్ర పారంగతనూ ప్రశంసా వాక్యాలుపలుకలేకుండరైరి. వెంటనే వారి వెంట సవన క్షేత్రానికి తరలివెళ్ళారు.

## యజ్ఞం చూచుటకు నాలుగు దిక్కులవారు వచ్చుట

క్రమంగా అయోధ్యాపురం జన సముద్రం కాజొచ్చింది. ఆహూతులైన రాజవరేణ్యులు, తమ తమ గౌరవశక్తి బిరుదావళులకు తగినట్లు రజత కాంచన రత్నాలూ, హయగజగోగణాలూ, దధి ఘృత తక్రాలూ(పెరుగూ, నేయి, మజ్జిగ) వెంటతీసుకొని వచ్చారు. సామంతులు, సకల పరివార సమేతంగా ధన కనక వస్తు వాహనాదులతో విధినిర్వహణంలో పాల్గొన వచ్చారు. అనాహూతుల సంఖ్య అర్బుదం, న్యర్బుదం. విడిసిన ప్రభువుల విడిదులపై ఎగురుతున్న కేతనాలు (జండాలు) కోటాను కోటి ఇంద్ర ధనస్సులూ, మయూర పింఛాలు (నెమలి తోకలు) సృష్టిస్తున్నై. డేరాల ముందూ, వెనుకా, కట్టివేసిన గుర్రాల సకలింపులూ, ఏనుగుల ఘీంకారాలూ, వృషభముల మెడలోని మువ్వల ఝణఝణ శబ్దాలూ భూమీ అంతరిక్షాలూ నింపిస్తున్నై. వచ్చిపోయే శకటాల రాపిడికి రేగిన ధూళి మన్నూ మిన్నూ గుర్తించలేకుండాచేస్తున్నది. గోముఖ, పటహ, కాహళ, భేరీ, శంఖారావాలు దిగ్గజాల చెవులకు లెక్క సంకల్పిస్తున్నాయి. నర్తకీ నర్తక గాయక వైణికులూ, నాగస్వర వేణు కిన్నర వాదనా నిపుణులూ సలుపుతున్న

సాధనా ప్రక్రియకు దోహదంగా, కంజరీ మృదంగ ఘంటాదివాద్య విశేషాల నినాదం చెలరేగి, జైత్రయాత్ర వెడలిన మయూర కేకీభృంగ సంకుల ధ్వనులకు సిగ్గు కల్పిస్తున్నది. అచ్చట ఉదయాస్తమానాలకు భేదంలేదు. దివారాత్రాలకు తారతమ్యంలేదు. సూర్యచంద్రులకు విలువలేదు. గాడిప్రోయులనుంచి వచ్చే ధూమం, పగలు రాత్రి చేస్తుంటే, గృహ శిఖరాల మీది రత్నాలు, రాత్రిని పగలుచేస్తున్నై. సోమరులులేరు. దుష్టులు కనిపించరు. దొంగలు కానరారు. వ్యర్థభాషణులూ, అధికప్రసంగులూ, నిర్నిమిత్త కలహ ప్రియులూ, కొండెగాండ్రూ మచ్చుకైనలేరు. నీరసం నీరసించిపోయింది. దుఃఖం దుఃఖించింది. ఆనందం సహస్ర మూర్తులుగా సంచారం చేసింది.

## అశ్వమేధం ప్రారంభం

వత్సరకాలం దేశదేశాలు తిరిగి వచ్చిన గుఱ్ఱాన్ని 'పిప్పలవ్రజ' అనే చోట కట్టివేసి, విప్రులతో ఋశ్యశృంగుడు వాద్యమి మొదలుగా ప్రతి దినం వైశ్వదేవాలు మూడూ, ఏడురోజులు చేసి, అనుబంధంగా ప్రవర్గ, ఉపసదములూ, ఇంద్ర సంబంధమైన ప్రాతస్సవమూ, సోమవల్లి మధ్యం దినమూ, తృతీయమూ తీర్చినాడు. ఆబాలగోపాలం, ఆకటికీ దప్పికీ అలమటించినట్లులేదు. మధ్యాహ్న సమయంలో జారుదీర్చివడ్డించిన విస్తళ్ళలో కనిపించే పదార్థాలు ఆనకొలది మెక్కి త్రేన్చుచు మాపుపో, మాసూపో, మా పరమాన్నం ఘృతంచ, మాదధి దుగ్ధే, మాపరితుష్టాస్స్మ (భక్షాలు చాలు, పప్పు పాయసం వద్దు. పెరుగూవద్దు, పాలూవద్దు. నెయ్యీ వద్దు. కడుపు నిండింది. తృప్తులమైనాం) అనేమాటలు ఎక్కడబడితే అక్కడ బ్రాహ్మణుల నోళ్ళల్లోనుంచి మాటిమాటికి వినబడుతున్నై. వడ్డించేవారికి వత్తిడి అంతకంతకూ హెచ్చుతున్నది. పర్యవేక్షకుల కనుసైగలు వారికి ఇంకా ఉల్లాసం కల్పిస్తున్నై. అన్నంరాసులు వెండి కొండల్లాగా, శాకపాకాలు చిత్రకూటంలాగా, రంగుల మిశ్రమంతో వండి గుట్టలుపోసిన మధుర పదార్థాలు బంగారు పర్వతాల్లాగా, కన్నులకు విందు కల్పిస్తున్నై. ఆ పెట్టిపోతలలో సమయాసమయాలులేవు. ధార్ష్ట్యంలేదు.

దండనలేదు. విదిలింపులు, చీదరింపులు, సణుగులు, గొణుగులు, వెటకారాలు, వెక్కిరింతలు అసలే లేవు. అందుకు నియమించిన అధికారులు అర్థులరాక క్షణం ఆలశ్యమయితే విచారం వెలిబుచ్చుతున్నారు. ఈ హవనంతో రఘువంశ ప్రతిష్ఠ ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది. ఆయుధధారులై అంతరిక్షంలో అష్టదిక్పాలకులు మంత్రబద్ధులై రక్షిస్తున్నారు. ఎవరినిఆహ్వానిస్తే వారువచ్చి స్వరూపంతో హవిర్భాగంగ్రహిస్తున్నారు. ఒకలోటుగానీ, ఒకచోటుగానీ, ఒకపాటుగానీ, ఆ మహాకార్యంలో కనుపించదు. ఎంత భక్తి? ఏమి వినయం? ఎంత కరుణ? ఎంత ఆదరణ? ఎంతదానం? ఎంత శీలం? ఎంత శుచి? ఎంత నిష్ఠ- త్రేతలో జరిగిన మహాక్రతువుల్లో దీనికి ఇదేసాటి" అన్న ప్రేక్షకులప్రశంసలు నియుక్తుల సంతోషపెట్టినై. హయమేధం ముగిసింది. యజ్ఞం మొదలైంది.

## యూప స్తంభ ప్రతిష్ఠ చేయుట

మహర్షులు నిర్ణయించిన ముహూర్తం చేరువయింది. సృష్టి ప్రారంభం నుంచీ అవిచ్ఛిన్నంగా సాగిపోతున్న కాలపురుషుని రథం లగ్నంలో ప్రవేశించగానే, మారేడుతో, చంద్రతో నిర్మాణం చేసినయూపములు ఆరూ ఒకదాని ప్రక్కన ఒకటిగా స్థాపించారు. మోదుగులతోచేసిన ఆరుయూపాలూ, అభిముఖంగా నాటబడినై. ఒక స్తూపం వేదికముందుగా నిల్పారు. దానికి ఇరుప్రక్కలా దేవదారు స్తంభాలు రెండునుంచారు. వాటి శోభకోసం బంగారు వికారంతో, పసుపూ, కుంకుమా, చిత్ర వస్త్రాలతో అలంకరించారు. ఇవికాక ఇరవై ఒక్క మూరలు చిటికెనవ్రేలు హద్దుగా కొలిచిన, ఇరవై ఒక్కయూపాలుయెడంయెడంగానిల్పి, దీక్షావస్త్రాలువాటికి కట్టారు. ఆ యూపాలు చిరకాలానుభవం గల శిల్పులు ఎనిమిది పలకలుగా తయారుచేశారు. ఆ చేయటం అందర్నీ ఆకర్షిస్తున్నది. ఆ విధంగా వేద శాస్త్ర సమ్మతంతో ప్రతిష్ఠింపబడిన యూపాలు గంధాక్షతలతో, పూలతో అర్చింపబడి ఆకాశంలో సప్తర్షుల్లాగ వెలిగిపోతున్నై. ఆగమవిధి అనుసరించి ఇటుకలతో విప్రులు మంత్రయుక్తంగా "శల్యం" తయారు చేశారు. అది బంగారు రెక్కలుగల గరుడపక్షి ఆకృతిలోపద్దెనిమిదికరాత్మకాలుగా ప్రకాశిస్తున్నది. కల్పోక్త ప్రకారం పశువులనూ, పాములనూ, పక్షులనూ

బంధించి ఆ వాహనాలుగల అధిష్ఠాన దేవతలను ఆహ్వానించారు. జలచరాలనూ మూడువందల పశుపులనూ యూపాలకు కట్టి, మధ్యలో హయ రత్నాన్ని నిలిపారు. ప్రభువు పెద్ద భార్య కౌసల్యచేత గుర్రాన్ని పూజింప చేసి, మూడు కత్తులతో దానిగర్భాన్ని చీల్పించారు. ఆరాత్రంతా ఆ మృత హయ సన్నిధానంలో ధర్మబుద్ధితో నిద్రింప ఆదేశం ఇచ్చారు. మరునాడు రాజుతో అధ్వర్యులైన బ్రహ్మకూ, హోతకూ, అధ్వర్యునకూ, ఉద్గాతకూ బ్రాహ్మణి (విప్రకన్య)నీ మహిషి (రాజకన్య)నీ పాలాకలీ (వేశ్య)నీ పరివృత్తి (శూద్రకన్య)నీ స్పర్శనిమిత్తం సమర్పించారు. తర్వాత గుర్రం వపను అగ్నిలో హుతం చేశారు. సంపన్నులైన ఋత్విక్కు ఆ వపాగంధాన్ని ప్రభువుచేత ఆఘ్రాణింపచేశాడు. పిమ్మట ఆ గుర్రం ప్రతి అంగాన్నీ పదహారుగురుభూసురులు వహ్నిలోమంత్రపూతంగా వ్రేల్చారు. తక్కిన అధ్వరాల్లో ప్లక్ష శాఖా సంప్రదాయంగా హవిస్సును ఇస్తారు. కానీ దీనిలో వైతసం అనే శాఖాపద్ధతి ప్రకారంబుఙశృంగుబు హవిర్భాగాలు అర్పించారు.

యజ్ఞకాలంలో మూడురోజులు బ్రాహ్మణులు పఠించారు. హయమేధంలో, మొదటిరోజు చతుష్టోమం, రెండోరోజు ఉక్థ్యం, మూడోరోజు అతిరాత్రం అనబడే ఇతర కర్మలు చేయించారు. జ్యోతిష్టోమం, ఆయువు, అతిరాత్రం అనే యజ్ఞాలు అదనంగా సలిపించారు.

## దశరథుని దాన విలక్షణం

సంకల్పించినదానికంటే శతగుణితంగా క్రతువుపూర్తిచేయబడింది. యాగాన్ని నిర్వహించిన ధరణీదేవులరావించి, దశరథుడు నమస్కార పూర్వకంగా ఈ విధంగా ప్రార్థించాడు. "వేదస్వరూపులైన విప్రోత్తములారా! మీ అఖండ తపశ్శక్తికే హయమేధం నిర్విఘ్నంగా పరిసమాప్తం అయింది. నేను కృతార్థుడనయ్యాను. మీరు చేసిన ఈ మహాకృషికిఏమిచ్చి సంతోషపరచగలను? ఈ నాటికి నా అనుభవమునందున్న సమస్త భూభాగంలోపూర్వదిశ హోతకూ, దక్షిణదిశ బ్రహ్మకూ, పడమరదిశ అధ్వర్యునకూ, ఉత్తరదిశ ఉద్గాతకూ, మిగిలిన స్థిర చర రూపక పదార్థ

సంచయం అంతా సహకారవేత్తలకూ సూర్యచంద్రుల సాక్షిగా దత్తం చేస్తున్నాను. అనుగ్రహంతో గ్రహించి ఆశీర్వదించండి" అని.

దుందుభులు మ్రోగినై, దేవతలు పూలవాన కురిపించారు. పూర్వ వంశవర్ధనులైన మనువూ, సగరుడూ, హరిశ్చంద్రుడూ, మొదలైనరాజులు ఆకాశంలో నిల్చి అభినందించారు. కల్పవృక్షం, కామధేనువూ, పరస్పరం చూచుకొని తమ చలనానికీ, అచలనానికీ, తెల్లబోయినై. మూడులోకాల్లో వ్యాపించుతున్న కీర్తిగజాన్ని నాల్గుదంతాలతో కుమ్మి లాభం లేక ఐరావతం వెల్లనై వెనక్కు తగ్గింది. చూడవచ్చిన రాజలోకం చేతనా రహితమైంది. నిర్వికారంగా, నిశ్చలంగా, నిరాడంబరంగా నిల్చివున్న వృద్ధ రాజును విలోకించి పరిగ్రహీతలు చేరవచ్చి...

"భద్రంతే నృపలోక పాలవర! తృప్తాస్మ ప్రభో తృప్తాస్మ!" (నీ దానానికి మేం తృప్తిపడ్డాం. ఓ రాజా! నీకుభద్రమగుగాక) అని ఆశీర్వాద వర్షం కురిపించి "ఈరాజ్యం మేం ఏం చేసుకుంటాం? సర్వ సంగ పరిత్యాగం చేసినవాళ్ళం. కర్మిష్ఠులం, నైష్ఠికులం. మేంపరిగ్రహించి నట్లేనీవు భావించాలి. లోక కళ్యాణార్థమైన సత్కర్మకు తోడుపడటం మాకు కనీసధర్మం. ప్రతిఫలాపేక్ష ఏమాత్రం లేదు. మీ ధర్మపాలనంలో ఏవిధమైన అవాంతరాలులేకుండా మా విధులు మేం నెరవేర్చుకుంటున్నాం. మీరు సత్సంతానవంతులై కలకాలం రఘుకుల దీపకులుగా వుండటమే మేం కోరుకుంటున్న కోరిక" అని అన్నారు. ప్రభువుదానం, పరిగ్రహీతలప్రతి వచనం కాటాలో సమంగా తూగినై. బ్రహ్మర్షుల సమాధానానికి పరితుష్టుడైన రాజు సహస్రాధికంగా గోవులనూ, ధన కనకవస్త్రాలనూ, సమర్పించాడు. నాటికి సభ చాలించబడింది. అశ్వమేధం విఘ్నం చేయటంకోసం వచ్చిన కుంభీనసుడూ, కరాళదంష్ట్రుడూ పారిపోతుంటే మాయావి ఎదురైనాడు. వాళ్ళను ఆపి...

మాయావి: ఏమిటీ పరిగెత్తడం? ఏం ప్రాణం మీదికి వచ్చిందీ?
ఇద్దరు: పోతే నీకే తెలుస్తుంది.
మాయావి: ఎక్కడికి?
ఇద్దరు: ఎక్కడికా? అయోధ్యకు.

మాయావి: ఏం విశేషం?
ఇద్దరు: కావలసినంత వుంది.
మాయావి: చెప్పగూడదూ? అదేదో వింటాను.
ఇద్దరు: అయితే విను. అక్కడ అశ్వమేధమనే యజ్ఞం జరుగుతున్నది, నిప్పుల్లోపోసే నెయ్యి వాసనకు ఏదో తంతు జరుగుతున్నదని పోతుంటే ఒక గుర్రం, దాని సైన్యం కనబడింది. విచారిస్తే సంగతి తెలిసింది. వెంటనే గుర్రాన్ని మాయం చేశాము. వచ్చిన వాళ్ళకుఇదేమీ తెలియకనాలుపక్కలాదివ్యాస్త్రాలుప్రయోగించారు, అవి మమ్మల్నేం చేస్తయ్? అపహరించాం. తర్వాత మాయాజాలం కల్పించి వాళ్ళనందర్నీ మూర్ఛపోగొట్టాం. ఒక బక్కచిక్కిన పాదుడుబాణానికిదర్భపుల్లకట్టి కళ్ళుమూసుకొని చేతితో విసిరాడు. బాబోయ్! సరిగ్గా అది మా పైకే దూసుకువస్తూంది. ఆగుర్రాన్ని అక్కడ వదిలిపారిపోయి వస్తున్నాం. మరి నీ సంగతేమిటి?
మాయావి: నేను మన రావణ ప్రభువుల ఆదేశంతో బ్రాహ్మణ రూపంతో అయోధ్యకే వెళ్ళాను. మనం చేసే పనులకూ, మానవులు చేసే పనులకీ ఎప్పుడూ విరోధమేగా. వాళ్ళు యజ్ఞాలనీ, యాగాలనీ, సత్రాలనీ ఏమేమో చేస్తారు. అవి మనకి నచ్చవు కదా. అవిసాగితే మనపని వట్టిదే. అందుకే ప్రభువు వాటిని పాడుచేయమంటాడు. సరే. వెళ్ళిం తర్వాత ఒక కుందనాల శాస్త్రుల్లను కదిలించాను. అంతా గీరావణమే.
ఇద్దరు: ఏమన్నాదేం?
మాయావి: ఏమన్నాడా? ఇవి విశ్వశ్రేయస్సుకోసమేనట. ఇవి చేస్తుంటేనే వర్షాలు కురిసి భూమి సుభిక్షంగా ఉంటుందట.
ఇద్దరు: మరి నీవేమన్నావూ?
మాయావి: ఎవరో అన్నట్లుగా "చూడండి. ఇంత నెయ్యీ ఇంత పెరుగూ ఇన్ని పాలూ నిప్పుల్లో పోస్తున్నారు. మీరుతిన్నట్టా? ఎవరికయినా పెట్టినట్టా? ఇదంతా దండుగమారి పని" అన్నాను. ఆయన నవ్వి, "నాయనా! ఎవరైనా దండగ పనిచేస్తారా? పదవీకాంక్షగలరాజులు అనేక మారణాస్త్రాలు తయారు చేయిస్తారు. లక్షల వ్యయంతో

సైన్యాన్ని పోషిస్తారు. ఎవరిని ఉద్ధరించటానికి? లోకువగా వున్న వాళ్ళనుచంపటానికేగా. మానవతా వాదానికి అది దండుగ పనేగా? ఇది అలా కాదే. అగ్నిలో పోసిన ఈ పదార్థాలు పొగను సృష్టి స్తాయి. ఆ పొగ వాయుమండలందాటి వేడెక్కుతుంది. ఆ వేడికి సముద్రాలు ఆవిరిగామారి మేఘాలుగా తయారై వాయుమండలం క్రిందికి వచ్చి చల్లదనంపొంది వర్షంగా కురుస్తాయి. ఇది వేదం చెప్పిన విజ్ఞానం. మీరెవరయ్యా! నాయనా! ఈ దేశవాసివి కానట్లున్నావే" అన్నాడు. అంతటితో నోరు మూసుకొని ఇక గుర్తించడం జరిగితే మొదలుకే ముప్పొస్తుందని తిరిగి వస్తున్నాను. మనం ప్రభువులతో ఈ విషయం చెపుదాం పదండి.

ఇద్దరు: నిజమేనేమో. మనకేం తెలుస్తుంది పాడు చేయమని రాజందే పాడు చేయటమే మనపని అని అనుకుంటూ లంకామార్గం పట్టారు.

## దశరథుడు పుత్రకామేష్టి చేయుట

ఆ రాత్రి గడిచింది. అరుణోదయం అయింది. వృద్ధరాజు సుమంత్రునితో కలిసి ఋశ్యశృంగులవారిని దర్శించాడు. నిర్విఘ్నంగా హయ సవనం ముగించినందుకు కృతజ్ఞతలు తెలిపాడు. పుత్రుల కటాక్షించండని ప్రాధేయపడ్డాడు. అనుగ్రహించండని అంజలించాడు. మౌని క్షణకాలం కన్నులు మూసి ఏదో గుర్తుకు రాగా "ప్రభూ! విచారించవలసిన పనిలేదు. నీకు సంతానం తప్పక కల్గుతుంది. సందేహంలేదు. నీచేత ఇష్టిచేయిస్తాను. అధర్వమంత్రాలతో అగ్నిని ఆరాధింపచేస్తాను. ఆయన ప్రసన్నుడై కుమారుల ప్రసాదించేట్లు చేస్తాను. ఇది పుత్రకామేష్టి. ఇంతవరకుముందెప్పుడూ చేయలేదు. దీనికి నీ వొక్కడివే దీక్షితుడవు. నేను స్వయంగా అధిష్టాన దేవతల మంత్రాలతో ఆహ్వానిస్తాను. దశరాత్ర దీక్షతోముగిస్తాను" అంటూ అభయం ఇచ్చి, ప్రత్యేకంఅగ్నికుండం ఏర్పాటుచేసి, విఘ్నేశ్వరపూజా, పుణ్యాహవాచనం ముగించి, ఒక్కొక్క అథర్వమంత్రంచదివి స్రుహ్కు, స్రువం (కొయ్య గరిటెలు, నేయి హుతం చేసేవి)తో, ఆజ్యం వ్రేలుస్తూ "స్వాహా" అనగానే ఆ దేవతకై నియమించిన ఆసనంమీద ఆ దేవత వచ్చి కూర్చుంటున్నాడు. ఈనూతన క్రతువు చూట్టానికి బ్రహ్మాదిదేవతలు

వచ్చారు. అనుకోకుండా ఈ అవకాశం వచ్చినందుకు సంతోషిస్తూ సురలు బ్రహ్మతో-

## రావణుడు పెట్టే బాధలు విన్నవించుట

"దేవా! మీ వరబలంతో గర్వించిన రావణుడు పెట్టే బాధలు ఏమని విన్నవించం? ఇంద్రుణ్ణి పదభ్రష్టుణ్ణిచేసి ప్రవాసం పంపటానికి ఆలోచిస్తున్నాడు. అష్టదిక్పాలకులను సింహాసనానికి సోపానాలే చేశాడు. దేవతలకు హవిస్సులు అందకుండా చేస్తున్నాడు. అప్సరసలను అవమానం చేస్తున్నాడు. యజ్ఞాలు సాగనీయడు. తపస్సు చేయనీయడు. మాశక్తులు మీరిచ్చిన వరశక్తి ముందు ఎందుకూ కొఱగాకుండాపోయినవి. అతడికి ఎవరిష్టమో, ఎవరు అనిష్టమో తెలియదు. ఏ సమయంలో ఎవరిని ఏంచేస్తాడో కూడా బోధపడదు. ఆడింది ఆటగా, పాడింది పాటగా సంచరిస్తున్నాడు. ఎన్నాళ్ళీ కష్టాలు భరించటం? ఈ లోకకంటకుణ్ణి తుదముట్టించటం ఎలాగో సెలవివ్వండి" అని దైన్యంగానే వేడుకున్నారు.

చతుర్ముఖుడు వారి దీనాలాపాలు విని, హృదయం కరిగి, "మీరు పడే బాధలు నాకు తెలుసు. సూర్యచంద్రవాయువులుతమస్వేచ్ఛకు మాటిమాటికీ భంగం కలుగుతున్నదని గోలపెట్టినారు. కాలంకలిసి రావాలికదా? మానవునిచే తప్ప, తక్కిన ఏప్రాణీ అతనిని చంపకుండా వరమిచ్చాను. ప్రాణికోటిలో మానవుడు, కోతులు మాత్రమే వానిని చంపగలవు. ఆ మానవుడైనా దైవాంశసంభూతుడు కావలె. తొందరపడితే ప్రయోజనం లేదు." ఇంతలో-

## శ్రీ విష్ణువు ప్రత్యక్ష మగుట

"శ్రీ మహావిష్ణవే స్వాహా" అన్న వెంటనే, చతుర్భుజుడూ, పీతాంబరధారీ, వనమాలీ, శ్రీ వత్సాంకితవక్షుడూ, శార్ఙ్గపాణీ, గరుడవాహనారూఢుడై విజయం చేశాడు. బ్రహ్మాదులెల్లరూ పోయిన ధనం పొందినట్లు ఆయనను చేరి అనేక విధాలుగా స్తుతించి, తమ తమ కష్టగాథలు ఏకరువు పెట్టారు. "అన్యథాశరణంనాస్తి" అన్నారు. "రక్షమాం రక్ష. పాహిమాం పాహి, నీవే తప్ప నితఃపరం బెఱుగను, మన్నింపదగున్ దీనులన్" అని

వాపోయారు. బ్రహ్మదేవుడు ముందుకువచ్చి, తను ముందరయక ఇచ్చిన వరాలు తెలిపి "అవజ్ఞతను క్షమించి కర్తవ్యంతెలుపవలసింది" అనికాళ్ళపై బడ్డాడు.

సర్వాంతర్యామియై, జనన వృద్ధి క్షయాలకు కారకుడై, దుష్టశిక్షణ, శిష్టరక్షణలకు కంకణంకట్టుకొన్న శ్రీమన్నారాయణుడు వారలదుఃఖాన్ని ఉపశమింపచేసి, భవితవ్యాన్ని ఆలోచించి—ఇచ్చిన వరాలలోని పూర్వాపరాలు గుర్తించి, రంధ్రాన్వేషణంచేసి, ప్రుత్రుడైన బ్రహ్మతో యిలా అన్నాడు. "నీవు చింతపడవద్దు. ఆతడుచేసిన ఉగ్రతపస్సు సామాన్యమైనదికాదు. ఆ సమయంలో శాంతపరచి, తపస్సులో నుంచి మరలించటం ఎవరికైనా దుస్సాధ్యమే. కోరలేదుకానీ, హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల కంటే అధికమైన కోరిక అయినా, అప్పటికి ఈయక తప్పదు. "గతం న సోచామి, కృతంస్మరామి" (జరిగినదానికి చింతపడక జరుగవలసినదానిని ఆలోచించు) మార్గం అన్వేషించాను. ఈ యుగధర్మాలైన యజ్ఞాలనూ, తపస్సునూ, వేదమంత్రశక్తినీ రక్షించటానికి నేనే మళ్ళీ అవతరిస్తాను. దశకంఠుని మంత్రి బాంధవ పుత్ర మిత్ర కళత్రపరివారంతో సంహరిస్తాను. విశ్వశాంతి సాధిస్తాను. మీరిక భయపడవద్దు" అని ఎప్పుడైతే భగవంతుడైన శ్రీ మహావిష్ణువు యీ విధంగా అభయం యిచ్చాడో, అప్పుడే తమ కష్టాలు గట్టెక్కినట్లుగా సంతసించి—

## దేవతలు శ్రీ విష్ణువును మానవుడుగా పుట్టమని కోరుట

"ఓ జగత్ప్రభూ! ధన్యోస్మి, ధన్యోస్మి. నేటితో మాకష్టాలు తుదముట్టినై. నీఅవ్యాజ కరుణాకటాక్షంచేతనే మేం మా పనులు ఇంతవరకూ నిర్వర్తించగలిగాం. నీకు మేం చెప్పవలసిందికానీ, చెప్పదగిందికానీ ఏమీ లేదు. అయినా ఒక విన్నపం చేస్తున్నాం. ఆదరంతో వినిఅనుగ్రహించాలి. సృష్టిప్రారంభం నుంచీ ఇక్ష్వాకువంశం మహాత్ముల జన్మానికి స్థానం. అందులో దశరథ మహారాజు దీర్ఘకాలం పాలించి ధర్మసత్య రక్షణచేసి విశ్రాంతికై వారసులులేక యజ్ఞంచేసి,పుత్రకామేష్టి ఇప్పుడు చేస్తున్నాడు. అందులో ఆజన్మ బ్రహ్మచర్యంలో సాధించిన అనంతశక్తికంటే, గృహస్థధర్మంలో బ్రహ్మచర్యం సాధిస్తూ లౌకిక కామ్యాల ప్రసాదించే అధర్వ

మంత్రాలతో, అతిదీక్షలో, నిష్ఠలో జగత్తునే శాసించుతున్న ఋశ్యశృంగుల వారిని, కొద్దిపాటి కోర్కెలు తీర్చి సంతోషపెట్టటం సాధ్యంకాదు. అదీకాక, అశ్వమేధ యజ్ఞంచేసి పరిశుద్ధులైన వృద్ధరాజ దంపతులకు పుత్రులుగా ఉదయించి 'ఏకక్రియాత్ ద్వ్యర్థ కరీబభూవ' (ఒకపనితో రెండు పనులు చక్కబెట్టడం) అన్నట్లు రెండు మహాకార్యాలు చక్కదిద్దాలి. ఇటు మాన వావతారం, అటు మహర్షి లక్ష్యం సిద్ధించి లోకకల్యాణం కలుగుతుంది. అవిగో, హవిర్భాగాల మంత్రాలు పఠించి ఆహ్వానిస్తున్నారు. హవిస్సుల అందుకొనటానికి వెళ్లాలికదా" అని ముగించారు. వెంటనే లక్ష్మీపతి "మీ అభ్యర్థనం సముచితంగానూ, సకారణంగానూవుంది. మీరు పాయసం ధన్వం తరిచేత చేయించి, ప్రజాపతితో పంపండి. ఆ క్షీరాన్నంలో నా తేజస్సు నిక్షిప్తంచేసి నాల్గురూపములతో రాజునూ, మహర్షినీ ఆనందపరుస్తాను" అని పల్కి అంతర్హితుడైనాడు.

## ప్రాజాపత్య పురుషుడు రాజుకు పాయసం ఇచ్చుట

దేవతలు తమ తమ భాగాలు తీసుకొని స్వస్థానాలకు పోయారు. ఋశ్యశృంగులవారు, స్రుక్స్రువాలలో ఆజ్యం పూరించి 'ఓం అగ్నయే స్వాహా' అని పఠించి హుతం చేశారు. వెంటనే మంటలు ఆకసం అంటే లాగా పైకి లేచినై. అందులోనుంచి ఏదో కళ్ళు మిరుమిట్లు కొలిపే తేజం భాసించి, తత్‌క్షణం ఒక దివ్యాకారంగా మారిపోయింది. అగ్నికుండం మధ్యంలో నుంచి క్రమంగా పైకివచ్చి, ఎఱుపూ, నలుపూ రంగులు కలిసిన వస్త్రాలతో- అగ్నివలె ప్రకాశించే ముఖంతో, దుందుభి నాదాన్ని ధిక్కరించే కంఠస్వరంతో, సింహం మెడనిండా వ్యాపించిన జూలుకంటే బిరుసైన, పొడువైన వెంట్రుకలతో, మీసాలతో, గడ్డంతో, దేవతలకుండే అన్ని రకాల శుభ లక్షణాలూ, అలంకారాలూ ఉండి, పర్వతం వంటి ఆకారం ధరించి, అనుకూలవతియైన అర్ధాంగివలె ప్రియమైన పాయసం వున్న భాండం రెండుచేతుల నడుమనిల్పి ఒక ఘూతం అవతరించింది. ఆ దివ్యా కృతి ఆవిర్భావానికి కొందరు భయపడ్డారు. కొందరు కొయ్యబారినారు. కొందరు కళ్ళు మూసుకున్నారు. కొందరు కళవళ పడ్డారు. కొందరు ఉలుకూ, పలుకూ లేక రెండుకళ్ళు అప్పగించి కూరుకున్నారు. ఆ సంచలన

సంక్షోభంలో నూరు కొబ్బరికాయలు కొట్టి, ఆ నీరంతా బంగారు పాత్రలో పోసి, పంచామృతాలు అందులో కలిపి 'ప్రజాపతయే స్వాహా, ప్రజాపతి ఇదం నమః, ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః' అని బిగ్గరగా పఠించి మహర్షి స్రుక్స్రువాలు రెండూ హుతంచేశాడు. అంతవరకూ భయంకరంగా, పరుషంగా తోచిన ఆ భూతం శాంతించి, చూడ ముచ్చటయిన మానవాకారంలో, మానవ భాషలో, దీక్షితుడైన ఆజి (దశరథుడు)ని చూచి "రాజా! నేను ప్రాజాపత్యమూర్తిని. నీవు చేసిన యీ ఇష్టికి సర్వదేవతలు సంతోషించారు. ఇంద్రుడు ధన్వంతరిచే, సంతానం ప్రసాదించే సమస్త దివ్యౌషధులతోకూడిన పరమాన్నం తయారుచేయించి నాచేత పంపాడు. తోయధి చతుష్టయం పరివేష్టించిన భూమండలం ఇక శాంతిసుఖాలతో వర్ధిల్లగలదు. నీ చిర పుత్రవాంఛ చతుర్గుణితంగా నెరవేరుతుంది తీసుకో". అన్నాడు.

భయభక్తులతో ముసలి భూపతి లేచి ప్రదక్షిణించి "ఓ దివ్యమూర్తీ! అనుగ్రహింపబడ్డాను. నీ దయావర్షంతో ఈ ముసలి ఎండుచెట్టు మళ్ళీ చిగిరించింది. మా వంశం పొట్లతీగవలె ఎగ్రదాకిపోతుంది. వికియపూచిన గుమ్మడితీగవలే కళకళలాడుతుంది. పండిన దోసతోటవలె సంతానం ఫలిస్తుంది" అంటూ చేతులుచాచి, బంగారు పాత్రలో భద్రపరచబడ్డ పాయసం గ్రహించి, తలపై పెట్టుకొని, మళ్ళీ ముమ్మారు చుట్టూ తిరిగి నమస్కారం చేసి, పాయసంవున్న భాండం మహర్షి సన్నిధిలో దర్భలపైనుంచి "మహానుభావా! అనితరసాధ్యమైన కార్యం సాధించి నా వంశం నిలబెట్టారు. మీకు నేను ఈయవగినది ఏమీలేదు. అంతా ఇదివరకే యిచ్చి వారిచేత మళ్ళీ పుచ్చుకున్నదే. వారే వద్దని తిరస్కరించినప్పుడు మీరసలే గ్రహించరు. నేను నేనుగా మిగిలాను. మీ సేవచేస్తూ శేషకాలం ముగించుకుంటాను. అందుకైన సమ్మతించండి" అన్నాడు. పరమాదరం, పరమానందం పొంగిరాగా, రాజునుచూచిమహర్షి "రాజా! యోగ్యుడైనవాడు, యోగ్యుడైన మరొకరివద్దనుంచి కోరేది హృదయం ఒక్కటే. అది గ్రహిస్తున్నాను. ముగ్గురు దేవేరులకూ పాయసం పంచియిచ్చి, కులవర్ధనులైన కుమారుల్ను కని 'క్షీణే పుణ్యే మర్త్యలోకే విశంతి' (పుణ్యం తగ్గిపోగానే భూలోకంలో తిరిగివస్తాడు) అనే ఆర్షసూక్తికి భిన్నంగా నీవు స్వర్గలోకంలో చిరకాలం

సుఖించు. ఇదిగో పాయసపాత్ర. సత్సంతాన ప్రాప్తిరస్తు. వంశాభివృద్ధి రస్తు. మనోవాంఛా ఫలసిద్ధి రస్తు" అంటూ దీవించి అందించాడు. ప్రాజాపత్యపురుషుడు అంతర్ధానం అయ్యాడు. ఇష్టి ముగించి మహర్షి శాంతా సమేతుడై ఆశ్రమానికి వెళ్ళాడు. ప్రభువు అర్ధాంగులతో ఆవాసం చేరుకున్నాడు.

## ప్రభువు భార్యలకు పాయసం పంచియిచ్చుట

రాజమందిరాలు కొత్త అలంకారాలు సంతరించుకొన్నై. శ్రీరంగేశ్వర మందిరం పరిచారికలతో, రాణులతో కూడివున్నది. స్వామి పాదపీఠంపై వుంచి నివేదించిన క్షీరాన్నభాండం గర్భవతి ఉదరంవలె నునుపెక్కి నిగనిగలతో మెరిసిపోతున్నది. ప్రభువు మంత్రి ముఖ్యులతో, పురోహితులతో లోపలికి వచ్చాడు. అందరూలేచి అభివాదంచేసి వచ్చినవారు కూర్చున్న మీదట మళ్ళ కూర్చున్నారు. ముసలిరాజు మీసం, గడ్డంఎడంచేత్తో సవరించుకుంటూ, భాండంపైవున్న మూతతీసి, అరటి ఆకులో మొత్తం వంచాడు. దాన్నిముందు రెండు సమభాగాలుగా విభజించాడు. పెద్దభార్యా, పట్టపుదేవీ అయిన కౌసల్యను పిలిచి సగం యిచ్చాడు. ఉన్న సగంలో సగం రెండవభార్య అయిన సుమిత్రకు యిచ్చాడు. మిగిలినదాన్ని మళ్ళ రెండుభాగాలుచేసి ఆలోచించాడు. భార్యలు ముగ్గురు. తాను కోరుకుంటున్నది నల్గురు బిడ్డలు. అంతా కైకకు ఇస్తే కొడుకులు ముగ్గురే అవుతారు. నాల్గవ వాడిని ఎవరినుంచి పొందాలి? రాజ్యాధికారంవున్న పెద్దభార్యకు యిద్దరు కల్గడం ఇష్టంలేదు. వారసత్వంకోసం వైరం పెరుగుతుంది. కైకేయికి కల్గినవాణ్ణే రాజు చేస్తాననిలోగడ వాగ్దానం చేశాడు. ఇస్తే ఇబ్బంది వస్తుంది. రెండు భాగాలుగా ఇస్తే యి కా ఆమెకు బలం వస్తుంది. అసలు ఇవ్వక పోతే లోకం హర్షించదు. అందుకు మిగిలిన ఇద్దరు భార్యలూ అంగీక రించరు. నిర్ణయానికివచ్చాడు. ఒకభాగం కైకేయికి ఇచ్చి, మిగిలినభాగం సుమిత్రకు మళ్ళీ ఇచ్చాడు. కొడుకులు కల్గుతారనే సంతోషంలో రాజు చేసిన పంపిణీ విషయం భార్యలు పట్టించుకోలేదు. సాపత్న్యమత్సరం అప్పటికి వారిలో అసలే లేదు. స్వామి పూజ పూర్తిచేసి ఎవరి అంతః పురానికి వారు వెళ్ళారు. తెచ్చుకున్న పాయసం శ్రద్ధాభక్తులతో సేవించి

గర్భవతులైనారు. గర్భం ధరించినప్పటి నుంచీ వారిలో కళా కాంతులు ప్రవృద్ధం కాజొచ్చినై.

## వానరులను సృష్టించమని బ్రహ్మ దేవతలతో చెప్పుట

హవిస్సుగొని స్వర్గంపోతున్న దేవతలతోచతుర్ముఖుడు "సురలారా! నారాయణుడు భూలోకంలో మానవుడుగా పుట్టబోతున్నాడు. మీరంతా మీ మీ అంశాలతో, కామరూపుల్నీ, బలవంతుల్నీ, ఎదురులేని వీరుల్నీ, శూరుల్నీ, నీతిమంతుల్నీ, అజేయుల్నీ వానరరూపాలలో సృష్టించండి. కేవలం మానవులూ, కేవలం కోతులూగాకుండా ఉభయలక్షణం ఉండేటట్లు చూడండి. నర సుర కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర యక్ష గంధర్వాంగనలయందు సంకల్పబలంతో సద్యోగర్భంగా పుట్టునట్లు చేయండి. ఇంతకుముందే నాకు ఆవలింత వచ్చి జాంబవంతుడనే భల్లూకం జన్మించింది. ఈ భల్లూకరాజే రాక్షసవంశ నాశనకర్తగా ప్రథమ సృష్టి జరిగింది. వెంటనే అసంఖ్యాకంగా వానరానీకాన్ని పుట్టించి శ్రీహరికి బాసటగా నిచ్చేట్లు జరిగించండి. నేను పోతున్నాను" అని హంసవాహనారూఢుడై అదృశ్యుడైనాడు.

## వానరోత్పత్తి వివరణం

అనంతరం ఇంద్రుడు వాలినీ, సూర్యుడు సుగ్రీవుణ్ణీ, బృహస్పతి తారుణ్ణీ, కుబేరుడు గంధమాదనుణ్ణీ, విశ్వకర్మ నలుణ్ణీ, రోహితాశ్వుడు నీలుణ్ణీ, ఆశ్వినేయులుమైందద్వివిదుల్నీ, సముద్రుడుసుషేణుణ్ణీ,పర్జన్యుడు శరభుణ్ణీ, వరుణుడు గవాక్షుణ్ణీ, వాయువు అమితశక్తి సంపన్నుడు, చిరంజీవి ఆంజనేయుణ్ణి సృజించారు. ఏ యే దేవతలకు ఏ యే రూపం ఇష్టమో ఆ రూపాలతో, ముప్పయిమూడు కోట్ల దేవ సంఖ్యలో, కొన్ని కోతులు, కొన్ని కొండముచ్చులు, కొన్ని ఎలుగుబంట్లుగా జన్మింపచేశారు. కొన్నిటికిగోళ్ళే ఆయుధాలు. కొన్నిటికి రాళ్ళే అస్త్రాలు. కొన్నిటికి చెట్లూ, కొమ్మలే బాణాలు. కొన్నిటికి దేవమానవపోదిత దివ్యాస్త్రాలు శరాలు. కొండలు, గుట్టలు, వాగులు, వంకలు, చెట్లు, చేలు, పొంతలు,పుంతలు ఆవాసంగా విశ్వమంతా విచ్చలవిడిగా విహరించేస్తూ, అల్లకల్లోలం

కావిస్తుంటే ఇంద్రుడు వాలిని రాజుగా చేసి, సుగ్రీవుడు యువరాజుగా, ఆంజనేయులూ, నలుడూ, నీలుడూ మంత్రులుగా నిర్ణయించి కపిలోకానికి అడుపాజ్ఞలు కల్పించాడు. ఈశ్వరుణ్ణి ఆరాధించి తిరుగులేని పరాక్రమం సంపాదించాడు. తండ్రిచేత బలాకర్షిణి అనే రత్న హారం పొందాడు. ప్లవంగ రాజ్యానికి ప్రభువై, అధిభీకరుడై, స్వతంత్రుడై, అనుజునితోనూ మంత్రులతోనూ కిష్కింధ పేరుగల ప్రదేశాన్ని రాజధాని గావించి పాలిస్తున్నాడు. అతని చెలిమి అందరాని ఫలములకు ఆధారము. అతనితో విరోధము నరకలోకము చూట్టానికి మూటా, ముల్లే సర్దుకోవటం. ఈ విధంగా కపిరాజ్యం విస్తరిస్తు-టే-

## రాణులు గర్భవతులగుట

ముసలిరాజు పుట్టబోయే సంతానంపై ఆశలు విస్తరింపచేస్తుంటే పట్టపురాణులు తమ గర్భపరిమాణం విస్తరిస్తున్నారు. పుత్రకామేష్టి ఏ లోపాలులేకుండా ముగిసింది. చూడవచ్చిన రాజలోకాన్ని తగినట్లు సత్కరించి రాజు వంశప్రతిష్ఠతో తనదాన గౌరవం పెంచాడు. వారి వారి రాజ్యాలకు వారు వెళ్ళగానే, ఋశ్యశృంగుడు శాంతాదేవిని వెంటబెట్టుకొని మామతో అంగదేశం వెళ్ళిపోయినాడు. సర్వసృష్టి తన మాయాజాలంతో బంధించే శ్రీ విష్ణువు రాణులగర్భకుహరంలో బంధింపబడి నాల్గు మూర్తులతో నర్తిస్తుంటే పరిచారికల సందడికి పట్టపగ్గాలు లేవు. ఒక దినంకౌసల్యా మందిరం నుంచి తొందరగాపోతున్న కల్యాణిని కైకేయీ పరిచారిక కుముద్వతి ఎదుర్కొనటం జరిగింది.

కుము: కల్యాణీ! కల్యాణీ! ఆగవే. నేనూవస్తున్నాను. ఏమంత తొందర పని వచ్చిందీ?

కల్యా: పెద్దమ్మగారు ఈపూట బొత్తిగా అన్నమే తినలేదు. ఒకటే ఓకిలింతలు. చాలా నీరసంగా వుంది. ప్రధాన వైద్యుణ్ణి పిలుచుకు రావటానికి పోతున్నా. ఏమోనమ్మా! లోక సామాన్యంగాని వయస్సులో వచ్చిన కడుపులు ఏం ప్రమాదం తెచ్చిపెట్టుతవోనని భయపడిపోతున్నాం. మీ అమ్మగారు చాలా చిన్నవారుగా. పరవా లేదనుకుంటాను.

కుము: సరేసరే. ఆవిడ సంగతే చెప్పు. ఇదివరకెప్పుడూ ఏవేవో యుద్ధ చిత్రాలూ, ఉద్యానవనాలూ, చదరంగాలతో ప్రొద్దుపుచ్చేది. ఈ గర్భం వచ్చిందగ్గరనుంచీ శ్రీరంగశాయి మందిరంలో పూజలూ, పునస్కారాలూ, పురాణాలూ ఒకటేమిటి? ఎప్పుడు ఏం కావాలంటుందో ఇంత అనుభవం వున్న నాకే తెలియక తికమకపడుతున్నానంటే నమ్ము. ఇప్పుడు సుమిత్రమ్మ అక్కగారితో కలసి హోం చేయాలట. తత్క్షణం వెంటపెట్టుకుని రమ్మన్నది.

కల్యా: అంతా విడ్డూరంగానే వున్నది కుముద్వతీ. ఒక్కమాట అడుగుతా ఏమీ అనుకోకుండా చెప్పు.

కుము: అడగవే. మనమధ్య దాపరికాలేమున్నాయ్.

కల్యా: ప్రభువులెప్పుడూ మీ అమ్మవద్దనే వుండేవారుగదా! ఇప్పుడు పెద్దమ్మగారింటిలోనే తరచుగా వుంటున్నారు. కారణం ఏమంటావ్?

కుము: అదా సంగతి! వయసులో అందరికంటే పెద్దదీ, పట్టపుదేవీ. పుట్టే బిడ్డ రాజ్యానికి వారసుడౌతాడు. కనుక అన్ని విధాలా ముందే జాగ్రతపడుతున్నాడు. దేవతా ప్రసాదంలో సగం పంచియిచ్చాడు గదా. గర్భధారణం కష్టం కూడా కావచ్చు.

కల్యా: నీవన్నది నిజమే కావచ్చు. అమ్మగారిలో రోజుకొక క్రొత్తదనం కనబడుతున్నది. నాకు మాత్రం ఆమెలో ఏదో అలౌకికమైనశక్తి కానవస్తున్నది. అన్ని పనులూ ఆమేచేసుకుంటున్నది. చెప్పుకుందే సిగ్గు. స్నానమందిరంలోకి నన్నుకూడా రానీయదు. ఎక్కడ గర్భానికి దిష్టి తగులుతుందోనన్న భయం కాబోలు.

కుము: అసలే ఆడవాళ్ళం. అందులో అపురూపంగా ముసలితనంలో వచ్చిన కడుపూ. ఆ మాత్రం స్వార్థం వుండదటే. సరేకానీ, అమ్మగారి డోకులకు కారణం వేవిళ్ళు. దానికి వైద్యం ఎందుకే? నెలవారీగా తగ్గిపోతై. ఇప్పుడు మూడు వెళ్ళి నాలుగో నెల వచ్చింది. క్రమేపీ సర్దుకుంటై.

కల్యా: నా కా సంగతి తెలుసు. పెద్దవారికి ఏం వచ్చినా ప్రళయమేగా.

అవునన్నా తప్పే. కాదన్నా తప్పే. ఇకపోదాం. మళ్ళీ ఎవరినన్నా పంపితే చిక్కు.

సంభాషణ అనంతరం ఎవరి పనిమీద వారు వెళ్లారు.

## శ్రీ భగవదవతార ఘట్టం

కాలపురుషుని రథంలో మళ్ళీ ఆరు ఆకులు తిరిగాయి. మాధవుని రాకతో మత్తెక్కిన కోకిలలు మధురంగా గానం ఆలపిస్తున్నై. అయోధ్యా నగరవాసుల ఆనందం పూదేనె త్రావి ఒడలుతెలియకుండా ఝుంకారంచేస్తూ వనాలలో, గృహాల్లో తిరుగుతున్న తుమ్మెదలతో చేతులు కలుపుతున్నది. పట్టణం పట్టణమంతా పెద్దదేవి మందిరం చుట్టూ మూగింది. లోపలినుంచి వచ్చిపోయే వారి సంచలనం అధికమయింది. అప్పుడప్పుడూ "అంతా సజావు(సవ్యం)గానే వుంది. కంగారు పడాల్సిన కారణం కనిపించటం లేదు" అనే మాటలు ప్రజానీకానికి వూపిరి పీల్చుకునే అవకాశంఇస్తున్నై. కాలం ముందుకుసాగినకొద్దీ ఆదుర్దా హెచ్చుతున్నది. "అమ్మగారికి నొప్పులు బాగా వస్తున్నై. తట్టుకోలేకపోతున్నదనీ" అంతలోనే,నొప్పులు ఆగిపోయినయ్, ఏమవుతుందోననీ మంత్రసానులు నిమిషాలమీద సమాధానం ఇచ్చే ప్రక్రియలు వాడుతున్నారు. ఫరవాలేదని బయటివాళ్ళకు వార్తలు అందుతున్నయ్. ఆకాశం నిర్మలమైంది. వంశంమూలపురుషుడైన సూర్యుడు నడిమింటికి చేరుకున్నాడు. దేవతాగణం అదృశ్యరూపంలో కౌసల్యా గర్భస్థుడైన పరమేశ్వరుణ్ణి అనేక విధాలుగా స్తుతించి, "సలక్షణంగా ఆవిర్భావం పొందు"మని అర్థించారు. మంగళతూర్యారావాలు శబ్దించినై. శతఘ్నులు ప్రేల్చబడ్డాయి. పూలవాసనలు, సముద్ర తరంగాల తుంపురుల శైత్యం విస్తారంగా సంపాదించి మలయపర్వతం నుంచి ఉత్తర దిశకు ప్రయాణిస్తున్న పవన వణిక్కు [గాలి అనే కోమటి] బరువుభారం మోయలేక మెల్ల మెల్లగా నగరంలోసంచరిస్తున్నాడు. పశువులు క్షీరధారలు కురుస్తూన్నై. ప్రసవమందిరాంతర్భాగాలలో దుర్దోషపరిహారార్థంఋక్కులు చదువబడుతున్నై. "దేవిగారు ప్రసవించారు. మగబిడ్డను కన్నారు. సుఖంగా వున్నారు" అన్నమాటలు నగరమంతాప్రతిధ్వనించినై. ప్రసవ సమయంలో పెద్దమంత్రసాని ఆలస్యం కాకుండా తెరవెలుపలికినిమ్మకాయ

దౌర్హిందించింది. జ్యోతిష్కులు కాయ దౌర్హించిన కాలం తగ్గించి జాతకపత్రం లిఖించారు. చైత్రశుద్ధ నవమి కర్కాటక లగ్నంలో, బృహస్పతి ఉదయించేవేళ, చంద్రుడు, రవి మొదలైన అయిదుగ్రహాలు స్వోచ్చరాసుల్లో వుండగా అదితి నక్షత్రం అర్ధం గతించగా భగవంతుడు మానవుడుగా పుట్టాడు. ప్రసవానంతరం చేయవలసిన కార్యమంతా పరిచారికలు మంత్రసానుల సాయంతో ముగించారు.

పుష్యమీ నక్షత్రంతో కూడిన మీనరాశిలో, పూర్ణంలో ఎనిమిదవ భాగమైన అంశతో కైకేయికిన్నీ, సార్పభనక్షత్రంతో కూడిన కర్కాట లగ్నంలో మధ్యాహ్నకాలమందు సుమిత్రకు నాల్గవవంతుగాను, ఎనిమిదవ వంతుగాను మగబిడ్డలు కలిగిరి. ఆ రోజు మొదలు పురుడువెళ్ళే పర్యంతం ఇంటింటా రకరకాల ఉత్సవాలూ, పండుగలూ, పూజలూ, జరుగుతూనే వున్నై. పుత్రవంతుడైన భూపతి పురుడు వెళ్ళగానే ధనధాన్య రత్నకనక నిక్షిప్తాగారాలు తెరిపించి తనచేతులు చాలక, మంత్రులచేతులు గూడా గ్రహించి అర్థులకు, ఆశ్రితులకు, నర్తకులకు, గాయకులకు, విప్రులకు, బీదలకు కోరినట్టు కోకొల్లలుగా దానం చేశారు. కొందరు వస్త్రాలతోనూ, కొందరు వాహనాలతోనూ, కొందరు గోవులతోనూ, కొందరు అగ్రహారాలతోనూ, ఇబ్బడి ముబ్బడి సంతోషంపొంది, రాజకుటుంబాన్నీ రాజసంతానాన్నీ చిరకాలం వర్థిల్లమని దీవించారు. వసిష్ఠ వామదేవాది గురువులు జాతకర్మ ముగించి నామకరణోత్సవం జరిపించారు. రాజదంపతులను తమ బిడ్డలకు పేరుపెట్టమని వసిష్ఠుడనగానే రాజు సాంజలిబంధంగా "స్వామీ! చిరుతల భవితవ్యం తెలిసిన మీరే నిర్ణయించాలి. మా వల్లకాదు. పుత్రవాత్సల్య కారం వివేకశూన్యులగా చేస్తున్నది" అన్నాడు. గురుదేవులు కూడవలుకు కొని విష్ణువాభేదంగా, తారకంగా, మనోహరంగా, ఉభయమంత్ర ప్రాణాక్షర సంకలితంగా, "రాముడు" అని పెద్దవానికీ, "భరతుడు" అని రెండవవానికీ, "లక్ష్మణ శత్రుఘ్న" లని కవలలకూ నామకరణం చేశారు. ఆ పేరులతో సుత చతుష్టయాన్ని ప్రభువు ముమ్మారు పిలిచారు. రామ భరతులు నీలవర్ణంకలవారుగా, లక్ష్మణశత్రుఘ్నులు అరుణవర్ణంకలవారుగా, అందరి కళ్ళకు చల్లగా కనుపించారు. అశేషజనానికి అన్నదానం జరిగింది.

## కుమారుల శైశవ వివరణం

పన్నెండో రోజున బిడ్డలబోరుకాడించి తొట్లలో వుంచారు. పేరంటాండ్రు వచ్చి బిడ్డల దీవించి జోలపాటలు పాడారు. మోకాళ్ళు దాటుతున్న చేతులతో పట్టిన గుప్పిళ్ళు ముందు సత్యాన్ని ఇలా రక్షిస్తానని శపథం చేసినట్లున్నై. ఏడుస్తూ ఏడుస్తూ మధ్యలో పట్టిన గుక్క ఇప్పటినుంచే మనోనిగ్రహం సాధిస్తానన్నట్లున్నది. నిద్రలో పెదవులపై ప్రకాశించే నవ్వురేఖ నశించే భౌతిక సుఖాలకై ప్రాకులాడే లోకాన్ని పరిహసిస్తూన్నట్లున్నది. నోటిలోపడిన వ్రేలు కుడుస్తున్న చప్పుడు మహాయోగ సమాధిలో సహస్రారంనుంచి పడుతున్న అమృతధారను ఆస్వాదిస్తున్నట్లుంది. బోరగిలపడటానికి చేసే ప్రయత్నం "జీవితం ఏకముఖంగాదు, ద్విముఖం. అదికూడా తెలుసుకోవాలి'' అన్నట్లున్నది. రాముడు అన్నివిధాలా,లోకాభిరాముడే. లక్ష్మణుడు సలక్షణ లక్షితుడే. భరతుడు జ్ఞానదీప్తితోరతుడే. శత్రుఘ్నుడు కామ శత్రుఘ్నుడే. ఘడియలుదినమై, దినములు వారాలై, వారాలు పక్షములై, పక్షాలు నెలలై, నెలలు ఋతువులై, ఋతువులు వత్సరాలవుతున్నవి. రాజునకు ఏ బిడ్డను చూడాలో, ఎక్కడ వుంచాలో తోచక తన మందిరంలో నాల్గుతొట్లలో వుంచి, కన్నార మనసార చూస్తూన్నాడు. పిల్లలు ఎదిగినకొద్దీ తన ఆకాసౌధాలు కూడా అంతస్థులు పెంచుకుంటున్నవి. రాముని ఊయ్యేల ప్రక్క లక్ష్మణుని ఊయ్యేలా, భరతుని తొట్టె ప్రక్క శత్రుఘ్నుని తొట్టె లేకపోతే బాలకులు మారాం చేస్తారు. పాలు త్రాగరు. పవళించరు. ఈ అనుబంధం, ఈ యనురాగం ఇప్పటిదికాదు. శ్రీ విష్ణువుగా మూర్తి కొన్నప్పటిది. శేషాంశలో పుట్టిన లక్ష్మణుడు నిరంతరం సన్నిహితం, శయనస్థానమే కదా. శంఖ చక్రముల అంశంతో కల్గిన భరతశత్రుఘ్నులు రెండుచేతులే కదా. ఇటువంటి అనూహ్యాలు, అపరిచితాలూ అయిన సన్నివేశ సంఘటనలు చూసే కావోలు పెద్దలు వీటిని "జనానంతర సౌహృదాలు'' అన్నారు. దినదినం అభివృద్ధినందుతున్న కుమారులకు, కాలోచితకర్మలైన అన్నప్రాశనం, చౌలం, ఉపనయనం పూర్తిచేసి ప్రభువు విద్యాభ్యాసం నిమిత్తం గురుదేవులకు అప్పగించాడు. వారు శుభసమయంలో గురుకులంలో చేర్చుకున్నారు.

## రాజకుమారుల విద్యాభ్యాసం

నిత్యజీవితంలో అవసరమైన జ్ఞానం ముందు నేర్పారు. తర్వాత సారస్వతంలో అభిరుచి పెంపొందించారు. పిమ్మట దండనీతి నేర్పుతూ రథ గజ తురగారోహణంలో నేర్పరత్వం బోధించారు. అస్త్రశస్త్ర విద్యల్లో అనుభవం కల్పించారు. వ్యూహరచనా, దివ్యాస్త్రప్రయోగం, ఉపసంహారం, శబ్దవేధీ, తంత్రం, మంత్రాంగం, సామదానభేద దండోపాయాలూ, కుటిల నీతీ, అర్థసంగ్రహణం, కాలానుకూలంగా కర్మలుచేసే స్థితప్రజ్ఞ సంపూర్ణంగా అభ్యస్తం చేయించారు. ఇప్పుడు రాకుమారులు మధ్యందిన మార్తాండులు. రాకాసుధాకరులు. మహోదయ సముద్రులు. పక్షసహిత పర్వతాలు. జంగమ కల్పవృక్షాలు, సతనుమదనులు. అకల్మషవర్తనులు. వినయసంపన్నులుకరుణారసమూర్తులుమాతాపితలకుకంటిపాపలు.ప్రజలకు తలలోని నాల్కలు.ఈవిధంగా సద్గుణశోభితులై, శుద్ధపక్షంలోచంద్రుని వలె వృద్ధిగాంచుతున్నకుమారులలో,ప్రజలకేగాక ప్రభువుకుకూడారాముడు మిక్కిలి ప్రీతిపాత్రుడైనాడు. రాముడు సన్నిధిలో లేనిక్షణం రాజునకు ఒక యుగం. ఆయన ప్రేమప్రవాహం హద్దులు త్రెంచుకుని రామ సముద్రంలోనే ఇప్పుడు సంగమిస్తున్నది. సర్వాత్మనా రాముడే అతని సర్వస్వం. ప్రభువు ఇలా వుండే రాముడు కైకేయికి కన్నబిడ్డకన్నాకావల సినవాడైనాడు. లక్ష్మణ భరతశత్రుఘ్నులకు ముగ్గురుతల్లులూ.ఎవరెక్కడ వుంటే వారక్కడే మాతృప్రేమలో మైమరుస్తారు.అక్కడే ఆడుకుంటారు. అక్కడే తింటారు. అక్కడే వుంటారు. అక్కడే పండుకుంటారు. తల్లులు పిలిపిస్తే తప్ప తనయులురారు. అన్నిట్లోనూ అష్టులైన బిడ్డలు కనుసన్నల్లో కదులుతున్న ఆనందంలో తన్మయుడైన దశరథుడు-

## మంత్రులతో కుమారుల వివాహ విషయం ముచ్చటించుట

ఒకనాటి ఉదయం ఆలోచనా మందిరానికిమంత్రులనురప్పించాడు. వచ్చిన వారికి ఆసనాలు కలిపించి ఆసతియిచ్చి ఇలా అన్నాడు. "అమాత్యులారా! మీ ప్రభుభక్తితో, మీ దూరదృష్టితో, మీ సమర్థతతో పదునాలుగేండ్లు గడిచిపోయినవి ఏ అరగొరలు లేకుండా గడిచిపోయినై. మహామహులైన

ఋశ్యశృంగుల అనితర శక్తి సామర్థ్యంతో అవతరించిన బిడ్డలు ఆనాటి కానాడు ఆనందదాయకంగా పెరుగుతున్నారు. ఈ సమయంలోనే వాళ్ళను పెండ్లి కొడుకులుగా చూసి సంతోషపడాలనివుంది. దానికి మీఅభిప్రాయం కావాలి.'' ప్రభువు మాటలకు మంత్రులు పట్టరానిసంతోషంతో ''ప్రభువు లెప్పుడూ వ్యర్థ సంకల్పంచేయరు. చేసిన సంకల్పం ఇంతకాలం వ్యర్థం కాలేదు. మీ యాకోరిక అన్ని విధాలా హర్షదాయకమైందే. అవశ్యం అందుకు తగిన ప్రయత్నం చేస్తాము. గురుదేవుల అనుమతికూడపొందటం ప్రభువుల కర్తవ్యం'' అన్నారు. దానికి రాజు ''అవునయ్యా! అది నాకు తెలుసు. ముందు ఇంట గెల్చికదా రచ్చను గెల్వటంకోసం ఆలోచించటం! సుమంత్రా! నీవేగి వసిష్ఠులవారిని వెంటబెట్టుకొని సభకు రా. మేం ఇప్పుడే అక్కడికి వస్తాం'' అంటూ లేచాడు. మంత్రులు పరిచారకుల బిల్చి ప్రభువులు ఇప్పుడే సభకు వెళ్ళబోతున్నారని చెప్పారు. ఉచిత వాహనాలపై అందరూ సభాంగణానికి తరలిపోయారు. మొగసాలలో పదిగంటలు మ్రోగినై. వెంటనే సభాసమావేశ సూచకంగా పన్నెండుసార్లు కాహళ (బాకాలు) ధ్వనులు వినిపించినయి.

## కొలువుకూటానికి విశ్వామిత్రుడు వచ్చుట

యథా సమయంలో ప్రభువు కొలువుకూటానికి వచ్చాడు. ఈనాటి సభ రాజసంబాధమైన పనులనుగూర్చి చర్చించునట్టిది. ప్రభువు తానుగా దాశరథుల వివాహ విషయం ప్రస్తావించాడు. కొందరు కలసీ, కొందరు వేరువేరుగా మంతనాలు సాగిస్తున్నారు. కొందరు రాజకన్యలగూర్చి ముచ్చటిస్తున్నారు. ఇంతలో ప్రతీహారివచ్చి నమస్కరించి విశ్వామిత్ర మహర్షి రాక ఎఱిగించాడు. వెంటనే, ముఖ్యులతో ద్వారంవరకు ఎదురేగి, అర్ఘ్యం పాద్యం సమర్పించి, పాదపూజానంతరం స్వస్తివాచనంతో సభామంటపానికి తీసుకొనివచ్చి బంగరు గద్దెపై ఆసీనునిజేసి ''మహర్షివరేణ్యా!తలవని తలంపుగా తమరాక ఎంతో ఆనందం చేకూర్చింది. హయమేధ క్రతువుకు మీరు దయచేయక పోవటం ఎంతో విచారం కలిగించి. తాము మహాదీక్షాధారులై వున్నట్లున్నూ, పూర్తి అయ్యేవరకూ ఎక్కడికీ రారన్నట్లున్నూ, మా మంత్రులు ఆ సమయంలో చెప్పారు. ఇప్పటికైనా నాయందు దయ

కలిగి వచ్చారు. అంతేచాలు! త్రిమూర్తులు సేవించినంత మహా అదృష్టం లభించింది" అన్నాడు. "విన్నాను రాజా! మన పూర్వుల ప్రతిష్ఠను ఇను మడింపజేసే విధంగా అశ్వమేధం, పుత్రకామేష్టి చేశావట. చతుస్సముద్ర ముద్రిత భూమండలమంతా ఆధ్వర్యులకు దానం చేశావట. చాలా సంతో షించాను. వృద్ధాప్యంలో సర్వదేవతలను సంతృప్తి పరచి సంతానాన్ని సాధించావు. అన్నిటికీ యోగ్యులైన మంత్రులూ, బ్రహ్మర్షియైన వసిష్ఠులు అండదండగా వున్నారు. మిక్కిలి అదృష్టవంతుడవు" అంటూ ప్రశం సించాడు ముని. ఆ ప్రశంసలకు సభంతా చాలా సంతోషించింది.

## ముని రాకనుగూర్చి ప్రభువు ప్రశ్నించుట

అపరబ్రహ్మగా పేరొందిన విశ్వామిత్రుడు తన్నంతగా పొగడటం ముసలిరాజుకు అనిర్వాచ్యమైన ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగించింది. క్షణంలో తేరుకొని, "ఇటు లౌకిక సౌఖ్యం, అటు అలౌకిక శక్తిసారం చూచిన మీరు అభిమానం కొద్దీ అన్నారేకాని, అంత గొప్ప కార్యం ఏమీ కాదు. ఏదో పనిగలిగే వచ్చారు. అదెట్టిదైనా అరమరలేకుండా అవశ్యం చెల్లిస్తాను. ఇది అంతా మీదే కదా. వలసిందేదో తాము గ్రహింపవచ్చును" అని రాజు చెప్పగా, ముని "రాజా! పలుక తగిన రీతిగా పలికావు. ఈ వినయం, ఈ ఔదార్యం ఇక్ష్వాకులకు వెన్నతో పెట్టినదే. అంతటి నా క్రూర పరీక్షకు నిల్చి అన్నమాటకు అపకర్ష రాకుండా,సత్యవదాన్ని శాశ్వ తంగాదాల్చిన హరిశ్చంద్ర చక్రవర్తి జ్ఞాపకం వస్తున్నాడు. ఇక నాకార్యం నిర్విఘ్నంగా పరి సమాప్తం అవుతుంది.

## ముని తన రాకనుగూర్చి చెప్పుట

రాజా! శ్రద్ధగా ఆలకించు. నేనొక యజ్ఞం తలపెట్టాను. అది దశ రాత్ర పరిమితం. నేను దీక్ష గైకొని అగ్నికుండం ముందు కూర్చొన గానే, మారీచ సుబాహులు అనే రాక్షస సోదరులు ఆకాశమార్గంలోవచ్చి, నెత్తురు, ప్రేవులు, మాంసం వర్షిస్తారు. వారి బాధ నివారించే శక్తి అప్పటి మునులలో లేదు. నేను దీక్షాధారినైతే, రాజస తమోగుణసంబంధ మైన ఏ పనినీ చేయరాదు. ఎన్నిసారులో ప్రయత్నించి విఫలుడనైనాను.

ఆ యజ్ఞం చాలా ముఖ్యమైంది. యజ్ఞ ధ్వంసకులయిన రక్కసిమూకలు మరి మర్త్య లోకంలో నిలువరు. ఇప్పుడున్న రాజులువాళ్ళను ఏమీ చేయలేరు. వాళ్ళు కొందరు మాయా విద్యా విశారదులైతే, కొందరు శస్త్రాస్త్ర విద్యల్లో ఆరితేరిన వారూ, పరగర్వితులూ. ఈ దుష్టులబారినుంచివేదానుష్ఠాన ధర్మ శౌచాలు యథాతథంగా రక్షించటానికే ఈ యజ్ఞం చేస్తున్నాను. ఆ సవన రక్షణకు నీ జ్యేష్ఠపుత్రుణ్ణి కొనిపోవవచ్చాను. రాముడొక్కడే ఆ రాత్రించరుల సంహరింప సమర్థుడు.

బాలకుడని విచారింపవద్దు. ముసలితనంలో కొడుకును విడిచి వుండలేనని దుఃఖించవద్దు. అస్త్రశస్త్రాది విద్యలోఅనుభవంలేదనిఆరాటపడవద్దు. నీ కొడుకుల సంగతి నీ వెఱుంగవు. నేనెఱుగుదును. ఈ వసిష్ఠు డెఱుగును. ఈ తపస్సిద్ధులెల్లరు ఎరుగుదురు. రాముడు తప్ప ఈ నక్తంచరులను ఇంకెవ్వరు శాసించలేరు. నా యజ్ఞ రక్షణం చేయలేరు. రాముడు సత్య పరాక్రముడు. నీవు సంకోచింపక నా వెంటపంపు. నీకుఅనేకశుభాలు చేకూరుస్తాను. నీకు శ్రమలేకుండా నీ సంకల్పం శీఘ్రంగాసిద్ధింపచేస్తాను. ఇచ్చిన మాట రక్షించుకొని ఇహపరాల్లో చిరకీర్తి సంపాదించు."

## ముని కోరిక ముసలిరాజును కలవరపెట్టుట

ముని పల్కిన పల్కులు మూర్ఖునిపట్ల సరసభాషణం వలె మోహావిష్టుడైన ముసలిరాజు హృదయంలో ములుకుల క్రియనాటినవి. తట్టుకోలేక పెనుగాలికి కూలిన బూరుగు వృక్షంలాగా సింహాసనంపై మూర్ఛపోయాడు. ఉపచారానంతరం తెలివి తెచ్చుకుని, దైన్యవదనంతో, స్రవిస్తున్న కళ్ళనీళ్ళతో, చెమర్చుతూన్న స్వేదంతో, వణకుతున్న ఒడలుతో, బొంగురు గొంతుకతో, మాటలు స్పష్టంగా రాక తడబడుతుండగా, కౌశిక మహర్షినిజూచి, "స్వామీ! ఇది ఏమి కోరిక? రాముడెక్కడ? రాక్షసులెక్కడ? యజ్ఞరక్షణం యెక్కడ? యుద్ధం యెక్కడ? అకృతాస్త్రుడే, తల్లిచాటు పిల్లడే, తన మంచిచెడ్డలు ఎరుగని అమాయకుడే. "ఊనషోడశ వర్షోయే రామం దశరథాత్మజం" (కనీసం పదహారు ఏండ్లయినా నిండని వయస్సు గలవాడే దాశరథి) అని లోకులు చెప్పుకునేవయస్సువాడే.రాజీవ లోచనుడే. (కమలాలు రాత్రి ముడుచుకుంటై. రాముడు ఆ సమానం

కాగానే నిద్రిస్తారు. రాక్షసులు రాత్రిపూటే సంచరిస్తారు. ఎలా రాముడు యజ్ఞరక్షణం చేస్తాడు? అది సాభిప్రాయం) క్రతువును కాపాడాలంటే నాకు అక్షౌహిణీ సైన్యం వుంది. దానితో మీ వెంటవచ్చి మీరు చెప్పినట్లు చేసి యజ్ఞం విఘ్నం కాకుండా కాపాడుతాను. అన్యథా తలపోయకండి. అనుగ్రహించండి.

ఈ విఘ్నకరులైన రాక్షసులు ఎక్కడ వుంటారు? ఎవరి ఆజ్ఞలకు లోపడతారు? ఎప్పుడెప్పుడు వస్తారు? ఏరూపాలలో వచ్చి ఎలా విఘ్నంకలిగిస్తారు? విపులంగా వివరించండి" అని కోరాడు. కౌశికుడు ఆ మాటలకు సమాధానం ఇలా చెప్పసాగాడు. "మహర్షులలో అగ్రగణ్యుడై, బ్రహ్మవంశజుడైన విశ్రవసునికి పులస్త్యుడనే పేరుగల కొడుకు పుట్టాడు. అతనికి కుబేరుడూ, రావణుడూ, కుంభకర్ణుడూ, విభీషణుడు అనే నలుగురు కుమారులు కల్గారు. వాళ్ళలో కుబేరుడు ఉత్తర దిశాధిపతియై, నిధినిక్షేపాలకు పురుహూతునిచే నియామకుడైనాడు. రెండవవాడు రావణుడు. బ్రహ్మచే అనేక వరములంది ఆ వరగర్వముతో సర్వలోక శాసనుడైనాడు. ఇప్పుడు రాక్షసలోకమంతా అతని చెప్పుచేతలలోనే వుంది. అతడువిప్పుడూయజ్ఞాలు పాడుచేయడు. పరివారాన్ని పంపించి పాడుచేయిస్తుంటాడు. అతని పరివారంలోని వాళ్ళే యీ మారీచ సుబాహులు. ఇద్దరూ ఒద్దరే. సాటి లేని పోటుబంట్లు. అఘటనాఘటన సమర్థులు. కామరూపులు, కామసంచారులు, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణాలూ, టక్కు టమారాలూ వాళ్ళకు తృణప్రాయాలు. శాపానికి తప్ప, శస్త్రాస్త్రాలతో జయించటం సాధ్యం కాని పని. అందుకే నీ కుమారుని అర్థింప వచ్చాను."

## మునివెంట రామునిపంప రాజు నిరాకరించుట

"తపోగ్రనీ! ఏమంటున్నారు? ఈ విఘ్నకారులు రావణరక్షితులా? మీరే చెప్పారుకదా ఇతరులకు సాధ్యం కాదని! ఇక ముక్కుపచ్చలారని బాలకుడా వాళ్ళను జయించుట? నేనే సైన్యంతో వస్తాను. గెలిచినా, ఓడినా ప్రాణం వున్నంతవరకు యుద్ధం చేస్తాను. మీరు ఆగ్రహపడకుండే, అబ్బాయితో ససైన్యంగా నేను రావటానికి సమ్మతించండి. ఆకటిపొద్దెరుగని చిన్నవాణ్ణి ఒక్కడుగా పంపలేను. నాకు నలుగురు బిడ్డలున్నా అందరూ

నాకు సహసు పే అయినా, అభిమానం విడిచి చెపుతున్నాను. రాముడు నా జీవం. రాముని ఎడబాటు నేను సహించి బ్రతుకలేను. ఏజన్మాంతరసుకృత విశేషం వల్లనో ఈ వృద్ధాప్యంలో సంతతి కలిగింది. పట్టుమని పన్నెండేండ్లయినా, అచ్చటా, ముచ్చటా అనుభవించనేలేదు. పాదాలు పట్టుకుంటాను నా వంశం నిలపండి. నా ప్రాణం కాపాడండి. ఈ స్థితిలో నా రాముణ్ణి, నా నయనానందచకోరచంద్రుణ్ణి, నా నోముల పంటను, నా అల్లారుముద్దు బిడ్డను మీతో పంపలేను. అడవులలో కందమూలఫలాలు తింటూ, కాళ్ళు వొక్కే కటికరాళ్ళలో నడుస్తూ, కఠిన శిలాతలాల పడుకుంటూ పడియల నీళ్ళు త్రాగుతూ, శీతవాతాతపాలకు చలిస్తూ రోజులు గడిపేపుత్రుణ్ణి తలచుకొంటూ నేను క్షణం జీవించలేను. రక్షమాం. రక్షమాం."

## అవనీపతిపై గాధేయుడు ఆగ్రహించుట

"రాజా! ఏం ప్రేలుతున్నావు? వచ్చినవాడెవడనుకున్నావు? ఈ లోకంలో బిడ్డల్ని నీవే కన్నావా? బొట్టూ కాటుక పెట్టి నిన్నేమన్నా ఆశ్రయించానా? అర్థించానా? ఇంతవాడు యెంతపని కలిగి వచ్చాడో అనియైనా ఆలోచించకుండా నోటికి వచ్చినట్లు తూలి ముందుగా యెందుకు వాగావు? నీవు అడగమంటేనే అడిగాను. కాని నిర్బంధం చేయలేదే? నీ వివేకం ఏమైంది?. ఎవరిచేతనూ కానిపని అంటూ చెప్పిన నేను ఈ చిన్నవాణ్ణి ఎందుకు పంపమన్నానో ఏమైనా ఆలోచించావా? ఇంతకాలం కాపాడుకుంటూ వచ్చిన సత్యవాక్యపరిపాలనా, వంశప్రతిష్ఠా శేషవయసులో మంట గలపజూస్తున్నావా? రాముడు ఎవరనుకున్నావు? ఈ విశాలవిశ్వ సంరక్షణకే నీకు కొడుకుగా పుట్టాడు. ఆ మాత్రం తెలియక వచ్చాననుకున్నావా? నీకు మతిలేకపోతే నీ కులగురువు వశిష్ఠుణ్ణి అడుగు. అతడు చెప్పినట్లు చేసి కలకాలం నుంచీ వస్తున్న కులగౌరవం కాపాడుకో. అయినా నాకు నీ వాగ్దానంపై ఆశ ఎందుకు? నేనే నిర్వహించుకుంటాను. నీవూ నీపుత్రులూ సుఖంగా వుండండి"

అంటూ వెనక్కు తిరిగాడు. సముద్రాలు ఘూర్ణిల్లినై. సూర్యమండలం మసక క్రమ్మింది. భూమి కంపించింది. ప్రళయవాయు సంచారంతో పర్వతాలు కదులుతున్నాయి. దివ్య తేజోవిలసితుడై నవిశ్వామిత్రుని

క్రోధమూర్ఛిత వదనంలో, ద్వాదశాదిత్యులు తోచారు. నేత్రాల్లో, హుతవహుడు సప్తార్చులతో ప్రజ్వలించాడు. కనుబొమ భృకుటి ముడిలో నూరుఇంద్ర ధనుస్సులు విరిగినై. అధరకంపంలో, కులపర్వతాలతో కూడ కువలయం గ్రక్కదలిపోయింది. దేవతలు సంభ్రమించారు. బ్రహ్మ ధ్యానసమాధిలో తూలాడు. ఇంతవరకూ శాంత దరహాసంతో వున్న వశిష్ఠుడు లేచి,

## రాజుతో రాముని పంపమని వసిష్ఠుడు చెప్పుట

విశ్వామిత్రుణ్ణి శాంతింపచేసి, రాజుతో ఇలా పలికాడు. "ప్రభూ పుత్రవాత్సల్యమోహంలో కర్తవ్యం మరుస్తున్నావు. నీవైనీవు "యేది మీరుకోరినా ఇస్తాను" అని వాగ్దానం చేశావు. రఘువులు సర్వం త్యాగం చేసి సత్యవ్రతపాలనచేశారు. వారిలో నీవు గణింపదగినవాడవు. సర్వ సుభిక్షంగా అరవై వేల సంవత్సరాలు అవ్యాహతంగా భూమండలం పాలించావు. నలుదిక్కులూ కీర్తి చంద్రికలచే వెలిగించావు. సాటి రాజలోకంలో పోటీలేనివాడవై, త్రేతను కృతయుగంగా చేశావు. అది బొంకిన, ఇష్టాపూర్తవధఫలం నీకు వస్తుంది. ఇది యే మాత్రం తగనిపని. శక్తిహీనుడై నిన్నర్థింపవచ్చిన మునిగా కౌశికుని భావింపకు. ఆయన నీ పుత్రమమకారం ఎంతటిదో ఎరిగినవాడు కనుక, కోపించినా శపించలేదు. లేకున్న ఏమగునో ఎవరికీ వూహకందరాని విషయమిది. ఈ సభాసమావేశం ఎందుకు జరుగుతున్నదో నీకు తెలుసు. ఆ సందర్భంలో అపరసృష్టికర్త రావడం, పరమ శుభావహం. ఒకవేళ రాముడు బాలుడని నీవు భయపడినా ఎవరి వెంట పంపుతున్నావు? జగద్భయంకర తపశ్శక్తిగల విశ్వామిత్ర మహర్షి వెంట. ఆయన వెంటనున్న రాముడు అమృతాంధసుడే. అతడు ఎరిగిన దివ్యాస్త్రములు మా తండ్రి చతుర్ముఖుడు తప్ప మిగిలినవా రెరుంగరు. చరాచర సృష్టిలో ఏ జీవియు నీ బిడ్డను తేరిచూడలేదు. ఇదీకాక, భృశాశ్వుడనే ప్రజాపతి దక్షప్రజాపతి కుమార్తెల జయా, సుప్రభా అనేవారిని పెండ్లాడి, ఇద్దరియందూ సమానంగా నూర్గురు బిడ్డలను పొందాడు. ఆ బిడ్డలు కామ రూపులూ, సంహారాభిలాషులై పుట్టుటచే వారి అభిలాష ఎరిగిన తండ్రి దివ్యాస్త్రాలు కమ్మని అనుగ్రహించాడు. ఆ దివ్యాస్త్రాలన్నీ ఈతడు భూపాలన సమయంలో భృశాశ్వునచే సమంత్రకంగా, ప్రయోగోపసంహార

శక్తిమంతంగా గ్రహించాడు. ఇంత ఎందుకు? విధాతను ధిక్కరించి ప్రతి సృష్టి చేసిన సంగతి జగద్విదితమేకదా? కావున, అణుమాత్రం సంకోచింపక ఈయనవెంట రామభద్రుని పంపు. మరల కళ్యాణరాముడుగా నీకు సమర్పిస్తాడు."

## రామలక్ష్మణుల రాజు మునివెంట పంపుట

ఈవిధంగా గురుదేవుడు బోధించిన వెంటనే అంధకార జవనిక తెరువబడిన జ్ఞానరంగంలో ప్రవేశించాడు రాజు. మరచిన కర్తవ్యంమరల స్ఫురించింది. సింహాసనం దిగి మేరు పర్వతం వద్దకు వింధ్యపర్వతం వలె నడచివచ్చి తన రెండు చేతులతో గాధేయుని రెండు హస్తాలు స్వీకరించి "నా యవిధేయత క్షమించండి. గురుదేవులన్నట్లు మీ శాంతగుణమే నా వంశాన్ని ఉద్ధరించింది. శుభ సంకల్పంతో వచ్చి అశుభం కల్పించటం మంచిదికాదనుకొన్న మీ సమయపాలనం నాకు స్ఫూర్తినిచ్చింది. మీ ఆజ్ఞ ద్విగుణీకృతంగా నెరవేరుస్తాను. సుమంత్రా! రామలక్ష్మణుల్ని కొనిరమ్ము" అంటూ ఆనందబాష్పాలు రాల్చాడు. మేఘం వెలువడిన మెరుపుల్లాగావచ్చిన పుత్ర ద్వయాన్ని ఆలింగనంచేసుకుని స్వస్తి పలికాడు. పురోహితుడు మంగళసూక్తులతో మంత్రితులచేసి ఆశీర్వదించాడు. అంతట బిడ్డను దగ్గరకు తీసుకుని చుబుకం స్పృశించి, శిరస్సు మూర్కొని, మునితో రాజు ఇలా అన్నాడు. "స్వామీ! ఇదుగో బిడ్డలు. మనఃపూర్వకంగా మీకు సమర్పిస్తున్నాను. తమ ఇష్టానుసారం బిడ్డలు అనుసరిస్తారు." దేవదుందుభులు మ్రోగినై.

## ముని రామునకు బల, అతిబల అను విద్యలనిచ్చుట

ముని, దండము పిడిచేతా, కమండలమువిడమచేతా, వ్యాఘ్రాజినం చంకలో దాల్చి ప్రసన్న వదనంలో ప్రభువును దీవించి ప్రస్థానంచేశాడు. ఆయనవెంట రామలక్ష్మణులు ఒక్కొక్క అడుగూ రాక్షసుల గుండెలపై వేస్తున్నట్లుగా వేస్తూ, తండ్రికీ, తల్లికీ, గురువులకూ నమస్కరించి సెలవు తీసుకొన్నారు. నగరం దాటేవరకూ సుమంగళులు హారతులిస్తూ "శుభంగా తిరిగిరండ"ని దీవిస్తూనే వున్నారు. పౌరులు కాలినడకన పోతూన్న

సూర్యచంద్రుల్లా వెలిగే అన్నదమ్ముల్ని సరయూతీర ప్రాంతందాకా అనుసరించి అనుజ్ఞతో మరలి వచ్చారు. మునికులతిలకుడు సార్ధయోజనంగమించి నది దాటి దక్షిణదిక్కు చేరి, "రామా! భగవానుడు మింట ప్రకాశిస్తున్నాడు. ఆలస్యం చేయక శుచివై దోసిలినిండా జలం గ్రహించి సూర్యాభిముఖుడవు కమ్ము. నీకు బల, అతిబల అనే రెండు విద్యలు మంత్రరూపంగా ఉపదేశిస్తాను. దారివెంట అవి పఠిస్తూ రా. నీకు ఆకలీ, దప్పీ, అలసటా, శ్రమా కలుగదు. తొందరగా రా. ఇవి బ్రహ్మదేవుని పుత్రికలు. ఈమంత్ర సిద్ధివల్ల అజేయపరాక్రమం లభిస్తుంది. నిద్ర సమయంలో కానీ, ఏమరుపాటులో కానీ, రాక్షసమాయలు నిన్నేమీ చేయలేవు. ఏది అనుకుంటే అది సిద్ధిస్తుంది. ఈమంత్ర పరిగ్రహణానికి నీవే అన్నివిధాలా అర్హుడవు" అనగానే రాముడు నదిలోనికి దిగి, పాదప్రక్షాళనంచేసి, వార్చి, శుచియై, అంజలినిండా నీళ్ళుగొని ప్రాగ్దిశగా నిల్చున్నాడు. ముని సమీపించి, చెవిలో మంత్రోపదేశం చేసి, "ఆ జలం నా పాదాలమీద పోయి" అన్నాడు. వెంటనే కమండలంలోని నీరు దక్షిణకరం అరచేతి వ్రేళ్ళమీదుగా రాముడు దోసిలితో ధారగా వదిలాడు. తర్వాత రాముడు మునీశ్వరుని గాంచి "స్వామీ? నాదొక-" "అర్థమైంది రామా! దత్తం చేసినప్పుడే సర్వాధికారం వాటిపై నీకు వచ్చింది. నీ ఇష్టానుసారంగా చేయవచ్చు" నని ముని అర్ధోక్తిలోనే సమాధానం చెప్పాడు. వెంటనే లక్ష్మణునకు సాదరంగా రాముడు ఆ విద్యలు రెండూ ప్రసాదించాడు. ఈవిధంగా గాధేయుడుతాను సంకల్పించుకొన్న సర్వప్రయోజనాలు నెరవేరేందుకు ముందుగానే బీజావాపం చేసి ముందుకు నడిచాడు. దినకరుడు పశ్చిమాశాముఖుడైనాడు.

ఓరంత ప్రొద్దుండగానే ఒక మునిపల్లెచేరి, అచ్చట ఆతిథ్యంపుచ్చుకొని గడ్డితోనూ, ఆకులతోనూ అమర్చబడిన శయ్యలపై మేనులు చేర్చి ఆ రాత్రి గడిపిరి. మౌనీంద్రుడు ఉషఃకాలానికి ముందేలేచి, హంసతూలికల పాన్పుపై పవళించినట్లే సుఖనిద్రలోవున్న రాజసోదరుల్ని చూచి, కన్నులలో కరుణారసం తొణికిసలాడగా, వాక్కుల్లో మాధుర్యం ఒరిగిపోతుండగా,

"కౌసల్యా సుప్రజా! రామ! పూర్వా సంధ్యాప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్."

(కౌసల్యా కుమారుడైన రామా! తెల్లవారుచున్నది. నరసింహా! లే. దేవతాకార్యాలకు సమయమైంది.)

అనగానే సోదరులు మేల్కొని, సరయూ నదిలో స్నానాదికాలు ముగించి, అనుష్ఠానాది విధులు తీర్చి, జప తపాలు నిర్వర్తించి, ముని వెంటకువచ్చి, ప్రయాణ సంసిద్ధత తెలుపుకున్నారు. ముగ్గురూ ముందుకు పోసాగారు. కొంత నడచిన తర్వాత, చాలా పర్ణకుటీరాలు, నిర్జనంగానూ, పతనావస్థలోనూ వున్న ప్రదేశం చేరారు. అచ్చటనే సరయూనది గంగా నదిలో సంగమిస్తుంది. ఆ పవిత్ర స్థలాన్ని సందర్శించిన రాజకుమారులు మునిచంద్రునితో "స్వామీ! ఇది ఏ ప్రదేశం? ఈ గొప్ప ఆశ్రమం ఎవ్వరిది? ఈ పర్ణశాలలు ఎందుకు ఈనావస్థలో నున్నవి? చూచినకొద్దీ అబ్బురం కలుగుతున్నది. తెలుసుకోవలెనని మనస్సువువ్విళ్ళూరుతున్నది. దయతో తెలుపండి" అన్నారు. వారి ప్రశ్నలకు ముద్దువచ్చి నవ్వుతూ,

## దాశరథులకు ముని అంగదేశ వృత్తాంతం చెప్పుట

గాధేయుడు కథ చెబుతున్నాడు. "వత్సలారా! వినండి. ఇప్పుడు మీరు చూస్తున్న ఈ ఆశ్రమం పూర్వంమన్మథుడు శరీరధారిగా వున్నప్పుడు ఈశ్వరుడు ఈ సంగమ స్థానంలో మహాఘోరంగా తపస్సు చేస్తున్నాడు. హిమవంతుని కుమార్తె ఆయనకు సపర్యలు చేస్తున్నది. ఈ సమయం లోనే వరగర్వంతో తారకాసురుడు దేవతలపై విరుచుకుపడ్డాడు. అతని సంహారార్థం, ఈశ్వరుని అంశతో పుట్టినవాడు కావాలి. అందుకని మన్మ థుణ్ణి ఇంద్రుడు తపోభంగం చేయటానికి పంపాడు. అలా వచ్చిన మారుడు పుష్పాస్త్రం వేయగానే శివుడు కోపించి మూడవ కన్ను తెరచి అతణ్ణి బూడిద చేశాడు. మన్మథుని శరీరం (అంగం) ఇక్కడనే పోయింది. కనుక అప్పటినుంచీ దీన్ని అంగదేశం అని పిలవటం జరిగింది. తర్వాత మహేశ్వర శిష్యులైన తాపసు లెందరెందరో తర తరాలుగా ఈ చోట తపస్సుచేసి పాపవర్జితులై పరమపదం అలంకరించారు. ఒకప్పుడు అతివృష్టివల్ల సరయూ, గంగా నదులు పొంగి ప్రవహించినై. ముందు దృష్టిగల తపస్వులు తమ ఆశ్రమంబుల విడచి నైరుతిమూలగా పోయి మెరకప్రదేశముల మళ్ళీ నిర్మించుకొన్నారు. మనం సాయంకాలవిధులు

ఇక్కడనే పూర్తి చేసుకొని అక్కడకు వెళ్ళుదాము. ఈ గంగా సరయూ సంగమ స్థానంలో స్నానం చేసినవారికి రౌరవాది నరకాలు సైతం నశించి పోతై" అంటూ వివరించి ఆహ్నికాలు ముగించుకొని, ప్రయాణించ పోతుండగా, దివ్యదృష్టిగల మహర్షులు కుశిక నందనుని రాక ఎఱింగి, ఋషివాటికనుంచి ఎదురు వచ్చి, గౌరవ పురస్కృతంగా తోడ్కొని వెళ్ళారు. ఆతిథ్యం గ్రహించి, వారు ఏర్పరచిన శయనములపై ఉపవిష్టులై ఇష్టాగోష్ఠులతో కొంతకాలం గడిపి రెండవరాత్రి గురుశిష్యులు వేగించారు.

## విశ్వామిత్రుడూ, రామ లక్ష్మణులూ గంగదాటుట

సకాలంలో నిద్రలేచి దినకృత్యాలు తీర్చి, ఆశ్రమవాసులు ఏర్పాటు చేసిన నావపైనెక్కి, కామాశ్రమం గమించి, పడవలోపోతూ నలుప్రక్కలా దృష్టికందే ప్రకృతిశోభ తిలకిస్తూ, ఆకస్మికంగా రాముడు "స్వామీ! ఈ భయంకర ధ్వని ఏమిటి? వాయుపీడనంతో కలుగుతున్న అలల సంఘర్షణా? లేక ఇతరమైన హేతువేమైన నున్నదా? సరయూనామం నదికి ఎట్లు వచ్చింది? తెలుపండి. మీరు వీటిని గురించిన ప్రాంతగాథలు చెపుతూంటే మాకు ఇతర విషయాలు మనస్సుకే రావు" అన్నాడు. "రామా! ఎంత అమాయకుడవౌతున్నావయ్యా! నీ మాటలకూ, నీ వినయవివేక సంపదకూ, నీ స్వచ్ఛమైన అంతఃకరణకూ, నీ మోహనరూపానికీ, నాకే వ్యామోహం కలుగుతుంటే, నీ తండ్రి నిన్ను విడువలేక అసత్యదోషానికి పాలుపడ్డా డంటే ఆశ్చర్యమేముంది? ఈ సరయూనమ్మ వృత్తాంతం విను.

కైలాసపర్వతం మీద చతుర్ముఖుడు సరోవరం నిర్మించాలని మనస్సులో సంకల్పించాడు. భావన కలిగిన వెంటనే అచ్చట మనోహరా కారంతో, స్వచ్ఛజలంతో, జలవిహంగాలతో, రకరకములైన పూలతావు లతో పెద్దతటాకంవలె సరస్సు ఏర్పడింది. దానినే మానస సరోవరం అంటారు. ఆ సరోవరం ఎల్లప్పుడూ నిండి ప్రవహిస్తుంటుంది. ఆ ప్రవాహమే క్రమక్రమంగా మహానది అయింది. సరోజనితం కాబట్టి "సరయూ" అనే పేరు వచ్చింది. ఇది ఇక్ష్వాకుల రాజధాని ఐన అయోధ్యా పట్టణాన్ని అంటుకొని ప్రవహిస్తూ, ఇక్కడ గంగానదిలో కలుస్తూన్నది. మిత్రు పల్లాలలో కలుస్తూన్న కారణంగా ఈ శబ్దం భయంకరంగా వినిపిస్తూన్నది.

ఆ ధ్వని, రఘువంశ ప్రభువుల సంతతి కావటంచేత మీకు నమస్కారాలు అంటున్నది అని ముగించి, నావ దిగి, చేయూతతో రాకుమారుల్ని దించి, సంగమస్థానానికి అభిముఖంగా నిల్చి నమస్కారాలు చేసి, చిన్న చిన్న కథలు చెపుతూ ముని ప్రయాణం సాగించాడు. సూర్యుడు నభోమధ్యానికి చేరేసరికి ముగ్గురూ భయంకరమైన ఒక అరణ్య సమీపానికి చేరుకున్నారు.

ఆ గహనం చూడగానే రాకుమారులకు విస్మయం కలిగింది. "గురుదేవా! మనం నడుస్తున్నదారి అంతా రాళ్ళు, అడవులూ వున్నా, ఇంత క్రూరంగా కనుపించలేదు. ఇక్కడ, కొండలూ, రాళ్ళూ లేకపోయినా ప్రవేశం చాలా కష్టంగా వుంది. ఈ ప్రదేశంలో మనం తప్ప, ఇంకెవరూ ఇంతకు పూర్వం వచ్చిపోయినట్లులేదు. నభమంటే పెద్ద పెద్ద చెట్లూ, బండిగురువెంద తీగెలతో, రేగి, బలుసు, తుమ్మ, జెముడు మొదలైన ముండ్లచెట్లతో, కాలుపెట్టే సందులేకుండా క్రమ్ముకొని చూడ దుర్భరంగా వుంది. అడవిపందులూ, కారెనుబోతులూ, సివంగులూ, ఎలుగులూ, పులులూ, తోడేళ్ళు, నక్కలూ, సింహాలూ, మొదలగు క్రూర మృగాలు తప్ప, లేళ్ళు, దుప్పులూ, కుందేళ్ళు మొదలైన సాధుజంతువులు మచ్చుకైనా కనబడటం లేదు. కర్ణకఠోరంగా వాటి అరుపులే వినవస్తున్నై. ఈ అడవి దాటటం కష్టంగదా? దీన్ని ఏ రాజులు కూడా తమ ఏలుబడిలోనికి తీసుకోలేదనుకుంటాము. ఇది మిక్కిలి సారవంతమైన భూమిలాగా వుంది. మహానుభావులు మీరు కాబట్టి ఈ దారిని ప్రయాణిస్తున్నారు."

"వత్సలారా! అవును. నేను బుద్ధిపూర్వకంగానే మిమ్మల ఈ దారిన తీసుకు వస్తున్నాను. పైగా మన ఆశ్రమానికి ఇది దగ్గరి త్రోవ. మీరు అడవి చరిత్ర వినాలని అనుకుంటున్నారు. నాకు తెలుసు. నాయనలారా! జంకెందుకయ్యా! వసిష్ఠుడెటువంటివాడో, మీకు నేనూ అటువంటివాడనే. మీరు అడగవలసిందే. నేను చెప్పవలసిందే. నా మాటలకు మీరు సంతోషిస్తే, అదే నాకు సంతోషమేగా.

## ముని మలద, కరూశ దేశముల కథ చెప్పుట

కృతయుగంలో ఇంద్రుడు వృత్రుడనే అసురుణ్ణి చంపగా, బ్రహ్మహత్యాదోషం ప్రాప్తించింది. ఆ దోషంవల్ల అతనికి ఆకలీ, మలం అనే

మానవలక్షణాలు సంభవించినై. ఈ అపలక్షణాలతో దేవలోకాధిపత్యానికి భంగం వాటిల్లింది. అప్పుడు దేవతలూ, మహర్షులూ, ఇక్కడకు కొని వచ్చారు. ఎందుకంటే ఈ ప్రదేశమంతా దేవతా నివాసయోగ్యంగా వుండేది. అణువు అణువూ మహర్షుల తపశ్శక్తితో తేజోవంతమైంది. అన్నీ పుణ్యక్షేత్రాలే. అన్నీ పరమపావనమైన ప్రవాహాలే. ఆ కారణంచేత ఇక్కడి నదుల్లో స్నానం చేయించి, మహర్షుల ఆశీఃప్రభావం కలిగించటానికని తీసుకువచ్చారు. ఆ విధంగానే అతనికి ఆకలీ, మలమూ హరించి దేవత్వం మళ్ళీ వచ్చింది. తన దుష్టభాగాన్ని హరింపజేసింది కనుక, మలద కరూశములుగా ప్రఖ్యాతిగాంచమని వరం ఇచ్చాడు. ఆ నాటి నుండీ ఈ నాటి మహారణ్యం ఆ పేరుతో వ్యవహరించబడ్డది. అయితే ఆ మహాగౌరవం, భోగం ఎంతో కాలం నిల్వలేదు. అందుకు వేరే కథ వుంది.

## తాటక వృత్తాంత కథనం

సుకేతుడనే యక్షుడు సంతానం లేక బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. అతని నియమనిష్ఠలకు మెచ్చిన విధాత వేయియేనుగుల బలం గల్గిన, అందమైన పుత్రికను ప్రసాదించాడు. ఆమె పేరు తాటక. దిన దిన ప్రవర్ధమానయై, వివాహయోగ్యత వచ్చి గానే సుందుడనే వానికి యిచ్చి యథావిధి పెండ్లిచేశాడు. అతనివల్ల మారీచుడనే కుమారుణ్ణి కన్నది. తండ్రి ఎంత దుర్మార్గుడో అంతకు పదిరెట్లు కొడుకు దుర్మార్గుడు. సుందుడు సహజాహారం దొరకనప్పుడల్లా ఒక మునిని చాటుగా తినేవాడు. ఒకనాడు అగస్త్యుల వారిని తినబోగా, ఆయన త్రీవ్రదృష్టితో భస్మం చేశాడు. ఆ సంగతి తెలిసి, కొడుకుతో మహర్షి మీదికి వెళ్ళింది. ఆడుది కావున చంపకుండా క్రూరంగా, వికటరూపంగా, రాక్షసభావంతో బ్రతుకుమని శపించాడు. దాని కొడుకును గూడా తల్లివలెనే బ్రతుకమన్నాడు. ఆయనను ఏమీ చేయలేక జనపదాల్ని కాల్రక్కమేనా తల్లీ, కొడుకూ పొట్టబెట్టుకున్నారు. మలద కరూశ దేశాలు ఈ మహామారుల చేతుల్లో మాయమై మహారణ్యంగా మారిపోయింది. దుష్టరాక్షసి ఇక్కడే తిరుగుతుంటుంది. దీన్ని వధించి, మానవలోకోద్ధరణ చేయించటానికే మిమ్ము తీసుకొని

వచ్చాను. ఈ అడవికి సార్ధయోజన దూరంలోనే నా యాశ్రమం వున్నది. రాత్రికాకుండగా అడవి దాటవలెను" అంటూ అడవిలోకి ప్రవేశించాడు.

## ముని తాటకను వధింప రాముని ప్రోత్సహించుట

దారిలో తాటకచేసిన క్రూరకృత్యాలు వరుసగా రామునకు చెప్ప సాగాడు. "ఈ మలద కరూశ ప్రాంతాలు ఎంతో భాగ్యవంతమైనవి. ఇచ్చటి జనపదాల్లో అధర్మాచరణలేదు. అసంతుష్టిలేదు. దానధర్మాలకు కొదవలేదు. అకాల మరణాలకు తావులేదు. ఇక్కడి జనులంతా నియమనిష్ఠలుకలవారు. ప్రాజ్ఞులు. వివేకం కలవారు, వేదసంరక్షులు, సత్యసంధులు. అందుకే దేవతలు తరచూ ఇచ్చటికి వచ్చి (స్వర్గ సుఖంకన్నా, ఆప్యాయంగావున్న) అధిక సౌఖ్యాలు ప్రజలవల్ల పొందుతూండేవారు. తాపసులెల్లరు వారి శీల శౌచ రక్షణ కోసం, ఆయుః ప్రమాణ వృద్ధికోసం, అతివృష్టి, అనావృష్టి, డాంబరం మొదలగు ఈతిబాధల బారినుండి కాపాడటంకోసం ఎన్నో యజ్ఞాలు, ఎన్నో యాగాలు, ఎన్నో క్రతువులు, ఎన్నో సత్రయాగాలు చేస్తుండేవారు. అటువంటి ఈ పుణ్యభూమిని భయంకరారణ్యంగా ఈ దానవి మార్చు చేసిందంటే, ఎంత దారుణ హింసకు పాల్పడ్డదో నీవే గ్రహించు. పసిపాపల్ని మొదలు పరమతాపసులవరకూ నిర్దాక్షిణ్యంగా, అతిక్రూరంగా, బలాత్కారంగా చంపి కడుపు నింపుకొన్నది.

తెలియక ఈ ప్రదేశంలోకి వచ్చినవాడెవడూ తిరిగిపోలేదు. ఇంత దారుణమారణకాండ జరుగుతున్నా, మౌనులు దానిజోలికి పోలేదు. ఆత్మార్పణమే చేశారు. ఇది దానికి సహజ గుణంకాక, శాపంవల్ల వచ్చింది. కనుక, శాపగ్రస్తురాలిని శపించటం మహాపాపం. అందుకే ఎవ్వరూ ఏమీ చేయలేకపోయారు. రామా! అందుకు నీవు ఒక్కడవే సమర్థుడవు. దానిని వధించి ప్రజా రక్షణం చేయాలిసుమా" అని పలుకుతూండగానే భయంకర గర్జనం వినిపించింది. ఆ అరుపునకు అడవి అంతా దద్దరిల్లి పోయింది. క్రూరమృగాలు దిక్కుతెలియకుండా చెల్లాచెదురై, అటూఇటూ గగ్గోలుపడి పరుగెత్తసాగినై. క్రమంగా సూర్యరశ్మి కనుమరుగైంది. గురువు పలుకులు వింటూనడుస్తూన్న రాముడు ఆ కేకకు స్తంభించి నిల్చి, "గురుదేవా! ఆ ధ్వని ఎక్కడిది? ఎటునుంచి వచ్చింది?" అని అడిగాడు.

"రామభద్రా! నరవాసన దానికి తగిలింది. ఇక మనపైకివస్తుంది. ధనుస్సు సజ్యం చెయ్యి. అస్త్రాన్ని అనుసంధానానికి సిద్ధంగా వుంచు. నేనిప్పుడు శాపధారినేకాని, శస్త్రధారిని కాను గదా. ఉపేక్షించినచో మనల్ని గమ్యం చేరనీయదు. జాగ్రత్తగా వుండు."

"స్వామీ! స్త్రీ వధ మహాపాపం కదా? నా శరప్రయోగం మొట్ట మొదటనే ఆడుదానిపైనా? అనర్థంచరిని సాధ్యమైనంత వరకు శక్తిహీను రాలిని చేస్తాను. లేదా? సముద్రాంతర్భాగాలకు విసరివేస్తాను. అంతేకాని, ఆడుదాన్ని చంపాడన్న అపయశస్సు పొందలేను."

"రాఘవా! చిన్నవాడవైనా నీ ధర్మబుద్ధికి మెచ్చుకున్నాను. కాని ఒక్క సంగతి బాగా విచారించుకో. బ్రతికివున్నంతవరకూ దాని బలం తగ్గించటం సాధ్యంకానిపని. ఇంక ఎక్కడికి పారద్రోలినా అది ఆ ప్రదేశాల్ని ఈ విధంగానే నిర్మానుష్యం చేస్తుంది. ఈ పని నీవు చేయతగింది కాదు. కరిచి, బోసినోరు అనిపించుకున్నట్లు అవుతుంది. ఇది దుష్టురాలు. దీనిని వధించవలసిందే. రాజులకూ, అందులో రఘువంశ్యులకూ, దుష్టుల్ని శిక్షించటం, శిష్టుల రక్షించటం అవశ్యకర్తవ్యం. ఇంక "ఆడుది" అని సంశయింపవలసిన అవసరం ఎంతమాత్రం కూడా లేదు. ఇందుకు పూర్వ దృష్టాంతాలు కొన్ని చెబుతా విను.

ఇంద్రుడు విరోచన పుత్రిక "మంథర" అనేదాన్ని తన్ను మ్రింగ రాగా, వజ్ర ప్రయోగంతో వధించాడు. శ్రీ విష్ణువు, స్వర్గాధిపత్యంకోరి తపస్సుచేస్తున్న భృగుమహర్షి భార్యను చక్రాహతిచే సంహరించాడు. ఇంకా ఎందరో లోకశ్రేయస్సుకోసం ఆడవాళ్ళను చంపారు. అదీగాక చేస్తున్నపని "ఉపకారమా?ఉపద్రవమా?" అనిచూడాలి కానీ, స్త్రీ పురుష విభేదంకాదు. సంశయం విడిచిపెట్టి, అది రాగానే శరసంధానం చేసి జముని వీడికి పంపు."

ఆ పలుకులు విని, రాముడు "నా తండ్రి మునీశ్వరుడు చెప్పినట్లు చేయమనిగదా చెప్పెను. ఆయన అనుమతితో గురుదేవుల ఆజ్ఞపాలిస్తాను. ఇచ్చట నాకు ధర్మాధర్మ విచక్షణతో కానీ, పాపపుణ్య మీమాంసతోకానీ పనిలేదు. అటు శరీరమిచ్చిన తండ్రి. ఇటు పరమ పూజ్యులైన మహా

తపస్వి గురువు. ఇందు నా కర్తృత్వమునకు తావేలేదు" అని క్షణకాలం యోజించి, తమ్ముణ్ణి చూచి "లక్ష్మణా! ఈ పెనురక్కసిని కర్ణనాసికా చ్ఛేదముచేసి, యానవేగాన్ని భంగించి, విరూపగా చేసి విడిచిపెట్టదలచాను" అంటూ భుజం పైనున్న విల్లు చేతదాల్చి, వంచి, అల్లెత్రాడు ఎక్కించి, ఒక్కసారి నారిలాగి వదిలాడు. ఆ నారిటంకార ధ్వనికి భూనభోంతరాలు దద్దరిల్లినవి.

## శ్రీరాముడు తాటకను వధించుట

ఆ ధనుర్గుణ ధ్వానానికి తాటక అదిరిపడిలేచి ఆవులించింది. ఒడలు విరుచుకుంది. తీక్షణంగా చూచింది. ఆ చూపునకు అడవిలో వస్తూన్న బాటసారులు, అందులో మానవులు కనిపించారు. అసలే వేయి ఏనుగుల బలం కలది. ఇంకా పదిరెట్లు ఎక్కువై కొండవంటి మంచెదిగి, బారసాచిఅంగలు వేస్తూ వస్తూండే, భూకంపంలాగా ఆ ప్రదేశమంతాకదిలిపోయింది. అల్లంత దూరాన వచ్చేవాళ్ళను చూసి "ఆగండి. ఎక్కడికి పోతారు? రావలసిన చోటికే వచ్చారు. బహుకాలమైంది మానవ మాంసం తిని" అంటూ ఇకిలించింది. రాముడు ఆకారం దాల్చిన నడకొండలాగా వున్నదాన్ని వ్రేలితో చూపుతూ "తమ్ముడూ! చూశావు కదా? ఎంత భయంకరంగా వుందో. ఇది ఇప్పుడేం చేస్తుందో చూద్దాం. నీవు కూడా ధనువందుకో" అన్నాడు. ఇంతలో రక్త మాంసాల వర్షం కురవసాగింది. విశ్వామిత్ర ముని "రామా" అన్నాడు. ఒక్క బాణం రాముడు సంధించి విడిచాడు. నెత్తుటి వాన ఆగిపోయింది. రాళ్ళు అసంఖ్యాకంగా విసరబడుతున్నాయి. రాకుమారులు ముక్కలుముక్కలుగా నిరోధించారు.

ఆసురకు కోపం వచ్చింది. అంతర్ధానం అయింది. అనేక శత సహస్ర సంఖ్యలో బాణాలు ప్రయోగింపబడుతున్నై. ఆ నిష్ఠుర బాణాహతికి నొచ్చుకున్న రాముడు శబ్దవేధి ప్రయోగించాడు. రెండుచేతులూ తెగి భూమిపై పడ్డాయి. అంతలో లక్ష్మణుడు ముక్కూ, చెవులూ ఖండించాడు. నారాయణాస్త్రంతో తాటక కల్పించిన మాయాజాలాన్ని రాముడు ఛేదించాడు. ఇక లాభం లేదని, రక్కసి నిజరూపంతో ముగ్గురినీ మ్రింగటానికి నోరు తెరచి పైకురికింది. ముని మళ్ళీ "రామా! కర్తవ్యం" అని

హెచ్చరించాడు. సూర్యాస్తమయం కానున్నది. రాత్రించరులను రాత్రి వేళ జయించలేరు. వెంటనే, దారుణాస్త్రంతో దానిగుండె చీల్చాడు. పెద బొబ్బ పెట్టి, పక్ష విచ్ఛేదం అయిన పర్వతంలాగా భూమిపైబడి ప్రాణాలు విడిచింది. పుష్పవర్షం కురిసింది. అడవిమాత ఆనందధామమైంది. ఇంద్రుడు దేవతలతో వచ్చి రాముని స్తుతించాడు. గాధేయునికి ప్రణామాంజలి సమర్పించాడు. లోకోత్తరకార్యం శిష్యునిచేత సాధించినందుకు శ్లాఘించాడు. భవిష్యత్కార్యాచరణానికి దోహదంగా, భృశాశ్వసంతాన ప్రాప్తుని (సర్వదివ్యాస్త్రాలు పొందేట్లు) చేయమని అర్థించాడు. ఇంతకన్న యోగ్యుడూ, పాత్రుడూ లేడని విన్నవించాడు. నయన సహస్రం ఆనందాశ్రులు నిండగా, నాకలోకం చేరాడు.

## దేవతాకములైన అస్త్రాలు ప్రయోగ, ఉపసంహారాలతో ముని రాముని కిచ్చుట

పాకశాసనుని పల్కులకు సంతోషించి, మూడవనాడిరాత్రి యచటనే పుచ్చి, నాల్గవరోజు ఉదయం, రాకుమారులతో అరణ్యంవాది జనసంచార భూమికి చేరుకున్నాడు. అక్కడ, ఆహ్నికాలు తీర్చి, "రామచంద్రా! ఇంద్రుడు సకాలంలో జ్ఞాపకం చేశాడు. ఆలస్యం చేయక ఎదురుగా, పద్మాసనుడవై కూర్చో. నీ ధర్మచింతకూ, గురుభక్తికీ, నీ సత్యపరాక్రమానికీ, సార్థక్యం కలిగేట్లు, ప్రతిగర్వితాలై, అనితరసాధ్యాలైన అన్ని శస్త్రాస్త్రాలు నీకు ఉపదేశం చేస్తాను. అజేయత్వం ప్రసాదిస్తాను.

దండచక్రము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, ఐంద్రము, వజ్రము, శివశూలము, బ్రహ్మశీర్షము, ఇషీకము, బ్రహ్మము, మోదకి, శిఖరి, గద, వరుణపాశము, వారుణము, ధర్మపాశము, కాలపాశము, ఆర్ద్రము, శుష్కము, నారాయణము, నాకము, ఆగ్నేయము, శిఖరము, వాయవ్యము, జిహ్మగము, హయశిరము, క్రౌంచము, కంకాలము, ముసలము, కంకణము, కాపాలము, విద్యాధరము, నందనము, అసిరత్నము, మానవము, గాంధర్వము, ప్రశమనము, ప్రస్వాపనము, భాస్కరము, దర్పణము, శోషణము, సంతాపనము, విలాపము, దర్పకము, కందర్పకము, పైశాచికము, మోహనము, సంవర్తకము, దామనము, సౌమనము, అమోఘము, మౌసలము,

తేజః ప్రభ, సత్యము, మాయాధరము, సౌమ్యము, సుదామనము, భగము, శీతము, మానవశీతము, అనే అరవై దివ్యాస్త్రాలు, యింకా నలభై సాధారణ అస్త్రాలు మంత్రపూర్వకంగా ధారాదత్తం చేస్తున్నాను. పరిగ్రహించు."

అని దోసిట్లో జలంపోశాడు. రామభద్రుడు ధ్యానమగ్నుడై నిష్ఠతో పునశ్చరణం చేశాడు. అన్ని అస్త్రశస్త్రాలు నిజరూపాలతో సాక్షాత్కరించి ఆజ్ఞవేడినై. వాటిని చేతితో స్పృశించి, అవసరమైనప్పుడు మీ ప్రయోజనం పొందుతాను. యథాస్థానాలకు పొందని నిర్దేశించాడు. సిద్ధిపొంది, వశం చేసుకొన్నముని దత్తం చేసిన వెంటనే, దాచిన ధనంలాగా, రామచంద్రునికి సద్యఃఫలితం కలిగింది. ఇన్ని దివ్యాస్త్రాలు ఒక్కడు సాధించాలంటే యుగాలుచాలవు. ఇచ్చినవాడుఅపరబ్రహ్మ. పుచ్చుకున్నవాడు భగవంతుని అంశగలవాడు. క్షీరశర్కరాన్యాయంగా, ఒకదానికొకటి పరిపోషకమైంది. అనంతరం, దాశరథి ప్రణామంచేసి, గురువులతో ఇలా అన్నాడు. "గురువర్యా! మీ దయవల్ల సహస్రకోటి జన్మల్లోకూడా మానవుడు సంపాదింపలేని శస్త్రాస్త్రవిద్య సంపూర్ణంగా అల్పవయస్సులో, అల్పవ్యవధిలో పొందాను. మీ శిష్యవాత్సల్యం ఎంతటిదోపలుకలేను. ఇంత నిగ్రహానుగ్రహశక్తి సృష్టిలో వుందని ఇప్పుడే తెలుసుకున్నాను. నేను కోరకుండానే ఇంతశక్తి సామర్థ్యాలు ఇచ్చారు. నేను మనఃపూర్వకంగా మిమ్మల్ని అర్థిస్తున్నాను. మానవుని మనస్సు క్షణక్షణ చలనంకలది. బాహ్యేంద్రియ ధర్మాలైన కామమోహాది వికారాలకు వశమై, మంచి చెడ్డల వివక్షింపదు. అటువంటి సమయంలో, ఇటువంటి మహాశక్తి సంపన్నమైన అధికారం వుంటే, అవి వెర్రితలలు వేసి లోకారిష్టహేతువవుతుంది. కనుక యీ అస్త్రాల ఉపసంహారం కూడ దయచేయండి. త్వరపడినా, చక్కదిద్దుకో వచ్చు."

ఆ మాటలు కర్ణరసాయనాలు కాగా రాముని ఆర్ద్రహృదయంతో ఆలింగనం చేసుకుంటూ, "పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది పుడు పుట్టగానే బాధిస్తుంది అన్నట్లు, ఉజ్జ్వలభవితవ్యంగల వాని నోట యిటువంటి పలుకులుగాక, ఇంకేం వస్తాయి? బహుయుగాంతర స్థాయిగల నా జన్మ చరితార్థమూ, ధన్యమూ కూడా అయింది. ఉపసంహార విధి కూడా ఉపదేశిస్తున్నాను.

సత్యవంతం, సత్యకీర్తి, ప్రతిహారం, ధృష్టం, రభసం, పరాఙ్ముఖం, అవాఙ్ముఖం, లక్షాక్షం, విషమం, దశాక్షం, ఉగ్రం, దృఢనాభం, సునాభం, సుదీప్తం, దశశీర్షం, శతోదరం, నిశితం, శతవక్త్రం, కృశనం, జ్యోతిషం, పద్మనాభం, మహానాభం, దుందునాభం, సునాభం, నైరాశ్యం, శుచి, బాహువు, విధువి, రుచిరం, ధనం, మహాబాహువు, నిష్కలి, చైత్యశమనం, హరిద్రం, యోగంధరం, మకరం, ధ్యానం, పితృపు, సౌమనసం, శాతము, కరవీరము, విధూతము, కామరుచి, ఆవరణం, మోహం, కామరూపం, సర్వనాభం, జృంభకం, వారుశీల, సంతానం, వరణం, అనంతం, విధావంతం, అనే పేర్లుగల భృశాశ్వుని రెండవ సంతానాన్ని ధారావర్తంవేసి, "రామా! ప్రథమసంతానం ప్రయోగార్హతగలది. ద్వితీయం ఉపసంహృతశక్తి కలదిన్నీ. సభలో మీనంశగురువు పేర్కొన్న భృశాశ్వ సంతానమైన మహాస్త్రాలు యివే. నీవు గ్రహించి సాక్షాత్కరించుకొని తమ్మున కొసంగుము."

అంతట రవివంశ తిలకుడైన రామచంద్రుడు జపించి వశ్యం చేసుకొని, కోరినప్పుడు రమ్మని అనుమతి ఇచ్చి తమ్మునకు సాంగోపాంగంగా ఆ విద్యల నొసంగి, మబ్బువదలిన మార్తాండునివలె ప్రకాశింపసాగాడు. వారిని వెంటగొని ముని తన ఆశ్రమానికి ప్రయాణం సాగిస్తుండగా, మధ్యలో పర్వతప్రాంతం వచ్చింది. దాన్ని చూచి, రాముడు ఆనందంతో ఇలా పల్కాడు. "గురుచంద్రా! ఎంత హాయిగా వున్నది ఈ ప్రదేశం. ఆ పర్వతం పైనుంచి ప్రవహించే సెలయేళ్ళు, కలకల ధ్వనులతో కర్ణములకు సుఖం కల్పిస్తున్నవి. వంకర వంకరలుగ తిరిగి క్రిందికి వస్తున్న ఆ వాగులు, మహాసర్పాలు వడివడిగా పైనుంచి భూమికి దిగి వస్తున్నవా? అన్నట్లు గోచరిస్తున్నై. ఆ వాగుల తుంపురలచే, ఇరుపైపుల అల్లిబిల్లిగా అల్లుకొని, విచ్చిన పూలవాసనలతో వికసిపోతున్న తీగలు, పర్వతకన్య వెలిగించిన దీపావళిలాగా కన్నులపండువు చున్నవి. పరిపక్వ ఫలభారంతో వంగిన కొమ్మలుగల భూజాలు, విద్యావినయ సంపదతో నతశిరస్కులైన మహావిద్వాంసుల కీర్తి చిత్రాహ్లాదం కలిగిస్తున్నై. సెలయేటి నీళ్ళతోనిండి, స్వచ్ఛంగా అడుగు చూపుతున్న కాసారాలు, శయన

మందిరాల్లో అమర్చిన నిలువుటద్దాలవలె ప్రకృతిశోభను ప్రతిబింబించిచూడ ముచ్చటగొల్పుతున్నై. చిలుకలు, గోరువంకలు, నెమిళ్ళు కలకూజితాలు చేస్తూ,పరవశంతో పాడుకుంటున్న గాయక సార్వభౌముల్లాగా మనోల్లాసం సంఘటిస్తున్నై. ఇట్టి సమతలమైన, సారవంతమైన ప్రకృతి శోభారమ్య మైన ప్రదేశం మనమింతకు పూర్వం చూడలేదు. రాక్షసుల తాకిడికి నిల్చి నవనవోన్మేషంగా,ఆవాసయోగ్యంగావున్న ఈప్రదేశాన్ని ఏమనిపిలుస్తారు? ఈ గొప్ప ఆశ్రమం ఎవ్వరిది?"

## సిద్ధాశ్రమ వృత్తాంతం

"రఘువంశ దీపకా! ఇది సిద్ధాశ్రమం. ఇచ్చట శ్రీ మహావిష్ణువు, అనేక సహస్ర దివ్య సంవత్సరాలు చలించని నిష్ఠతో తపస్సు చేశాడు. ఆ తపఃఫలితం ఇక్కడ సిద్ధించింది. అప్పటినుంచీ సిద్ధాశ్రమంగా ఈ ప్రదేశం వ్యవహరింపబడుతున్నది. ఆతర్వాతదేవ రాక్షసులకు తండ్రియైన కశ్యప ప్రజాపతి తపస్సుచేశాడు. ఆసమయంలో,మహావీర బలిచక్రవర్తి దేవతల్ని జయించి సురలోకం పాలిస్తున్నాడు. కశ్యప మహర్షి చేస్తూన్న తపస్సుకు విష్ణుప్రత్యక్షమై ఆయనకోరినట్లుగాఅనుగ్రహించిపుత్రుడుగా పుట్టాడు. ఆ పుట్టినపిల్లవాడు మరుగుజ్జు. తండ్రి అతనికి వామనుడని నామ కరణం చేశాడు. దేవతలకు బంధవిముక్తి చేయటంకోసం యజ్ఞంచేస్తున్న బలిని మూడడుగులమేర భూమి యాచించి, భూమ్యాకాశాల్ని రెండుపాదా లతో కొలిచి, మూడవపాదం శిరంపై పెట్టి రసాతలానికి పంపి, మళ్ళీ స్వర్గం ఇంద్రునికిచ్చాడు. తర్వాత ఇచ్చటికి వచ్చి అవతారావసరం తీరే వరకూ ఇందేతపం చేశాడు. నేను ఎల్లప్పుడూ లక్ష్మీపతిని ధ్యానించే వాడను; కాబట్టి ఇక్కడికి చేరువలో ఆశ్రమం నిర్మించుకున్నాను. ఇక మనం త్వరగా ఆశ్రమం చేరుకుందాం. అది నా కెట్టిదో నీకుకూడ అట్టిదే" అంటూ సిద్ధాశ్రమ భూమిలో నడవజొచ్చాడు.

హేమంతఋతువు గడచిపోగా వచ్చిన పునర్వసు నక్షత్రంతో కూడి వెలుగుతున్న చంద్రుడులాగా వస్తున్న మౌనినాథుని, సిద్ధాశ్రమ వాసులైన తాపసులందరు ఎదురేగి కొనివచ్చి, ఉపచారాలన్నీ ముగించి ఆతిథ్యం ఇచ్చి, కుశలప్రశ్నలతో వృత్తాంతం తెలుసుకొని, మునిచంద్రుణ్ణి

రాజపుత్రుల్ని అభినందించారు. రాముడు భక్తితో, "గురుదేవా! ఈరాత్రికే మీరు దీక్షకై కొనండి. శత్రుంజయమవుతుంది. యజ్ఞం నిర్విఘ్నం అవుతుంది. ఫలం సిద్ధిస్తుంది. సిద్ధాశ్రమనామం అన్వర్థం అవుతుంది" అన్నాడు. రాము చేసిన సంకల్పానికీ, తానుపడిన శ్రమకూ, నేటికి ఫలితం దక్కిందని సంతోషించి గాధేయుడు దీక్షాధారియైనాడు. తెల్లవారింది. అయిదవనాటి పుదయం వేళ, రామలక్ష్మణులు నియమిత కర్మలు ముగించుకొని, యజ్ఞవేదిక సమీపానికి వచ్చి మాక ద్రవ్యం సెలవీయండని అడిగారు.

రాజపుత్రుల సముచిత బుద్ధికి సంతసించి "వత్సలారా! మహర్షి దీక్షితుడై, మౌనం వహించి ధ్యానమగ్నుడైనాడు. యజ్ఞం ప్రారంభమైంది. ఈ నాడు మొదలుగా ఆరురోజులు సవనం సంరక్షించాలి. ఏ సమయంలో వస్తారో తెలియదు. జాగరూకులై, ధనుష్పాణులై, అనిమిషులై యుండండి" అని మునులు చెప్పారు. శరచాపధారులై, వస్త్రాలు వెనుకకులాగి దోపి, ఆవరణం చుట్టూ తిరుగుతూ రాఘవులు కావలాకాస్తున్నారు. అవాంతరం లేకుండా క్రతువు జరుగుతున్నది. హోమధూమం సుష్ఫుతియగుతూ ఊర్ధ్వంగా పోతున్నది.

## రక్తముఖుడూ, లంబకేశుడూ ప్రవేశం

ఆ సమయంలో రక్తముఖుడూ, లంబకేశుడూ యజ్ఞవాటికకు దూరంగా వచ్చి నిలబడి—

రక్త: లంబకేశా! ఈ ముసలి తాపసి మళ్ళీ తంతు మొదలెట్టాడు.

లంబ: పెట్టాడు. వీళ్ళకి ఎగ్గా? సిగ్గా? ఎన్నిసార్లు పాడుచేసినా, ఈతల తిక్క మనుషులు ఎందుకు మానుకోరో బోధపడ్డంలేదు. ఈ సారి వీళ్ళను ప్రాణాలతో వుండనీయకూడదు.

రక్త: అది మనవల్ల అయ్యేపని కాదురే.

లంబ: ఎందుక్కాదూ! మన జట్టువాళ్ళకు సుబాహుడు తెలుసుగుండే క్షణంలో జరిగిపోతుంది. ఈ ముసలోడు దీక్షలో మాట్లాడడు. శాపం పెట్టడు. తక్కిన గోచిపాతరాయుళ్ళు బొరుసు చూడంగానే పారిపోతారు. అప్పుడు పట్టుకొని అమాంతం ఒక్కొక్కట్టే మింగేద్దాం.

రక్త: నీ తెలివి తెల్లవారినట్లేవుంది. ఈ సారి అగడ్తాలబూచి తగిన బందో బస్తుతోనే తలపెట్టాడు.

లంబ: అని నీ కెవరు చెప్పారు?

రక్త: ఒకరు చెప్పటందేనికీ? అదుగోచూడు ఆఇద్దర్నీ. విల్లంబుల్నిదాల్చి ఎట్లా తిరుగుతున్నారో. వాళ్ళ దృష్టిలోపడితే మనం దొర దగ్గరికి పోం.

లంబ: ఓష్. ఆకుఱ్ఱాళ్ళా మన దొరలను ఎదుర్కోవటం? ఎవరైనా నవ్వి పోతారు. రెండు కట్టెబద్దలు పట్టుకోగానే సరిపోయిందా?

రక్త: ఏమోనబ్బా! ఆకుఱ్ఱాళ్ళు పనికిమాలిన వాళ్ళయితే ఎందుకు కాపలా పెడ్తాడు? అంత తెలివితక్కువ వాడుగాదులే ముసలోడు.

లంబ: ఎంతవాళ్ళో నేనూ చూస్తాను.

అంటూ ముంగిసలాగా మారిపోయి యజ్ఞశాలలో ప్రవేశించబోతుండ గానే ప్రహరణాస్త్ర ప్రయోగంతో విమ్మతిరిగింది. అయ్యావాపోయ్ అంటూ రక్తముఖుణ్ణి కలిసి కాలికి బుద్ధి చెప్పాడు. అయిదు రోజులు అవిఘ్నంగా హవనం సాగిపోయింది.

ఆరవ నాటి ప్రాతఃకాలం యజ్ఞకాండ అతి తీవ్రతరంగా జరుగు తున్నది. ఆజ్యా హుతులతో అగ్నిదేవుడు నాలుకలు చాస్తూ అంతరిక్షాన్ని అందుకుంటున్నాడు. దెబ్బతిని వచ్చిన లంబకేశుడు దొరతో జరిగిన సంగతి చెప్పాడు.

## రామ లక్ష్మణులు సవన రక్షణం సలుపుట

సుబాహుడు పండ్లు పటపట కొరుకుతూ, అన్నవద్దకువెళ్ళి విశ్వా మిత్రుడు మళ్ళీ తలపెట్టిన యజ్ఞాన్నిగూర్చి హెచ్చరించాడు. ఈ సారి ఆ జడదారులను వదల వద్దన్నాడు. ఇద్దరుకుఱ్ఱవాళ్ళు శరచాపహస్తులై సవన భూమి సంరక్షిస్తున్నారని తెలిపాడు. లంబకేశుడికి కల్గిన అవమానంచెప్పి, యజ్ఞభంగం ఎలాచేయాలో పథకం వేయమన్నాడు. మారీచుడు తమ్ముని మాటలు విని, తాటకను చంపినవాళ్ళు వీళ్ళేనేమోయని కొంత తటపటా యించి, సరేలే. పోదాం పద అంటూ లేచాడు. ఇక్కడ రాముడు "ఇది క్రతువు పరిసమాప్తి దినం. సరీసృపకీటకాదులుగానీ, వన్యమృగాలుకానీ

ఇంకా ఏ విధమైన జీవులుగానీ యజ్ఞశాలా ప్రాంగణంలోనికి ప్రవేశించరాదు. రాక్షసులు శాంబరీ విద్యలో చతురులు. వారి మాయోపాయాలు అనేక రూపాలుగా వుంటై. గురుదేవులు ప్రసాదించిన దివ్యాస్త్రాలను సంస్మరించి, కన్నుల్లో వత్తులిడుకొని కాపాడాలి. తండ్రుల కీర్తి దశదిశాంచలాలు వ్యాపించాలి" అని గట్టిగా పలికి కార్యోన్ముఖుడైనాడు. వేద మంత్రాలతో, ఆజ్యాహుతులతో యజ్ఞకుండం హుతవహుని ప్రచండకాంతులతో ప్రజ్వలించి పోతున్నది. చిటపట ధ్వనులతో సమిధలను దహిస్తుంటే కీలా జాలం, నాగస్వరానికి పారవశ్యంతో పడగలువిప్పి, తోకమట్టంగా లేచి, నాలుగు ప్రక్కలకు తలలు త్రిప్పుతూ, నడుమ నడుమ ఫూత్కరిస్తూ, కాటువేయబడినట్లున్నది.

దుర్భరమైన ఒక ప్రచండారావం వినిపించింది. ప్రళయ సమయ గర్జాఘోషలకు అది ప్రతిద్వంద్విగా నిల్చింది. నిర్మలాకాశం నిమిషంలో మబ్బులతో కావురు క్రమ్ముకొన్నట్లయినది. కోటానుకోట్లుగ, మిడుతల దండు రొదచేస్తూ యాగశాల సమీపిస్తున్నది. శ్రీరాముడు ఐంద్రాస్త్రం అభిమంత్రించి ప్రయోగించాడు. మేఘాలూ లేవు, మిడుతల దండూలేదు. లక్ష్మణుడు శబ్దవేధులతో రాక్షస పరివారాన్ని బలిగొన్నాడు. ఈ లోపల యజ్ఞకుండం నెత్తురుతో, మాంసంతో, కల్లుతో నిండిపోయింది. యజ్వులు ఆక్రందనంతో హాహాకారాలు చేస్తున్నారు. ఎట్టి సంకటసమయంలోనూ కలతచెందని శ్రీరామచంద్రుని గంభీరమూర్తి కళవళ పడింది. క్రోధంతో కన్నులు జేగురించినై. వెంటనే భాస్కరాస్త్రంతో మాయా తిమిర భంగంజేసి, దర్పకాస్త్రంతో శత్రుస్థానాన్ని గుర్తించి, మానవాస్త్రం మారీచునిపై ప్రయోగించాడు. ఆ అస్త్రం దానవుణ్ణి మూర్ఛలో ముంచి, ఒగుడాకును గాలి కొనిపోవునట్లు, నూరుయోజనముల దూరంలో వున్న అంబురాశి మధ్యలో పడునట్లు కొనిపోయి విసరివేసిఅదృశ్యమైంది.

ఆగ్నేయాస్త్రం అనుసంధించి సుబాహుని వక్షం లక్ష్యంగా ప్రయోగించి యమలోకం పంపి వాయవ్యశరంతో రక్షఃకులాన్ని గిరగిర సుళ్ళు త్రిప్పి ఉపసంహరించాడు. తత్క్షణం ఎగురుతున్న తేలికవస్తువులు గాలి తక్కువకాగానే చెల్లాచెదురుగా పడిపోయినట్లు భూమిపైబడి గతాసువైంది. ఈ రీతిగా రామలక్ష్మణులు జనకుని ఆజ్ఞ, గురుదేవుని కోరికాతీర్చి,

యుద్ధంలో విజయం సాధించిన ఇంద్రుడూ, కుమారస్వామివలె, మునీంద్రులచేత సంస్తుతింపబడ్డారు. మౌనం క్రతు పరిసమాప్తితో విసర్జించి, "రామా! కోరి తెచ్చుకున్నందుకు నా కోరిక తీర్చావు. ఈ యజ్ఞఫలం లోకక్షేమంకరుడవై పుట్టిన నీకు ధారపోస్తున్నాను. మహాఫల శక్తితో పదకొండువేలయేండ్లు ప్రజాపాలన మొనరించి, "శిష్టపోషకుడూ, దుష్టనాశకుడూ" అన్న కీర్తి ఆచంద్రతారార్కంగా పొందుము" అని దీవించాడు.

రాముడు బద్ధాంజలియై, "స్వామీ! నేనెంత? నా వయసెంత? నా విద్యయెంత? దేవతలకే సాధ్యంకాని అతి రహస్యాస్త్రాలు ఉపదేశించి, ఆకలి దప్పులులేని అమృత శక్తినిచ్చి, నన్ను నిమిత్తంగా సర్వం మీరే నిర్వహించుకున్నారు. మా వంశగురువులు తోడ్పడకున్న, నా తండ్రి పుత్రవ్యామోహంలోపడి ఈ మహాఫలం వ్యర్థంచేసుకొనేవాడు. ఇప్పుడాయన తెలుసుకొని ఎంత ఆనందపడతాడో. మీరు సూక్ష్మంగా పల్కిన సర్వశుభములూ శతగుణితంగా ప్రాప్తింపచేశారు. ఏ కాలంలో, ఎవ్వరుగానీ, తమ శిష్యులకు ఇంత విద్యాదానం, ఇంత కీర్తిప్రతిష్ఠలూ కల్గించిఉండరు. నా జన్మాంతర సుకృత విశేషమే, మీ పాదసేవాభాగ్యం కల్గించింది. ధన్యుడనైనాను" అని, ఆనందబాష్ప లోచనుడై, రుద్ధకంఠంతో పలికి సాష్టాంగ ప్రణామం చేశాడు. మందారం, హరిచందనం, కల్పకం, పారిజాతం, సంతానం, అనే అయిదు దేవతా తరువులు పుష్పవృష్టితో గురు శిష్యుల్ని ముంచెత్తివేశాయి.

## కౌశికునితో రాకుమారులు మిథిలకు ప్రయాణించుట

రాక్షస సంహారంతో యజ్ఞం నిర్విఘ్నంగా ముగిసినందుకు, మహర్షితోపాటు మౌనులందరు పరస్పర గౌరవ సంభాషణలతో పదియవ రాత్రి గడిపారు. సూర్యోదయానంతరం తమ్మునితో కలసి గురుదేవుని దర్శించి, "గురుదేవా! ఇంక మాచే కాగల కార్యములేవేనియున్న ఆజ్ఞాపింపుడు" అని కోరాడు రామప్రభువు. వెంటనే ఆశ్రమవాసులైన మునులు "రామభద్రా! జగత్కల్యాణ కారకమైన ఈ మహాక్రతు సంరక్షణం చేయటం నీకే సాధ్యమైంది. ఇక చేయదగిందేమీలేదు. మేం మిథిలా నగరం పోతున్నాం. అక్కడ జనకమహారాజు "జనకం" అనే క్రతువు

చేస్తున్నాడు. నిజంగా, మౌనీంద్రులకేమి, రాజులకేమి అతడు పరమ పూజ్యుడైన జనకుడే. జ్ఞానం ఆయనలో మూర్తికొన్నది. ఆ యజ్ఞం చూడదగ్గది. అదిగాక ఇంకో విశేషంకూడా వుంది.

ప్రత్యేకంగా నిర్మించిన ఆయుధాగారంలో ఒక దివ్యచాపం వుంది. అది మానవమాత్రులకు సాధ్యంకానిది. ఎందరెందరో రాజకంఠీరవులు ఆ ధనుస్సు మోపెట్టవచ్చి, తుదకు కదల్పనైనా చేతకాక పరాభూతులై సిగ్గుతో మరలిపోయారు. పూర్వం యజ్ఞఫలంగా జనకునివంశ మూలపురుషుడైన "దేవరాతు"డనే చక్రవర్తి ఈ ధనుస్సును దేవతలచే పొందాడు. తదాది వంశపారంపర్యంగా నిత్యం పూజార్చనలతో నేటివరకు సేవింపబడుతూ ఆ ఆగారంలోనే వున్నది. నీవు క్షత్రియ కుమారుడవు. విశ్వామిత్ర మహర్షి శిష్యుడవు. సర్వాస్త్ర కోవిదుడవు. దాన్నిచూచి సంతోషపడగలవు. రా తలంచితేని మాతో తీసుకపోతాము" అన్నారు. ఆమాటలు గాధేయుడు విని, "మంచి సంగతి చెప్పారు. నాకిక ఇచ్చట పనిలేదు. ఈ ప్రదేశానికివచ్చి తపస్సుచేసిన ఫలితం సిద్ధించింది. నేను కూడా మా శిష్యయుగళంతో వస్తాను. ప్రయాణ సన్నాహం చేయండి" అన్నాడు. ఎద్దులు పూన్చిన బండ్లపై అగ్నిహోత్రం వుంచిన కుండికలను పెట్టి తాపసులంతా, గురుశిష్యుల వెనుకగా కదిలిపోసాగారు. తనతో వస్తున్న ఆశ్రమ హరిణాల్ని, చిలుకలనూ, నెమళ్ళనూ, గోవులనూ బుజ్జగించి, మరల్చి, "నేనిక హిమవత్పర్వతానికి పోతున్నాను. తిరిగిరాను. మీకు శుభంకలుగుగాక!" అని దీవించి గాధేయుడు శిష్యులతో ముందుకు నడిచాడు.

## కౌశికుడు రామునకు తన వంశ చరిత్ర చెప్పుట

తాపసులు పరివేష్టింపగా విశ్వామిత్రుడు శిష్యులతోగూడి సూర్యుడు పశ్చిమదిక్కాంతా పరిరంభణాకాంక్ష శైలశృంగంవెనకకు వెళ్ళాడు. అసూయతో పద్మినులు ముడుచుకున్నవి. రాజదర్శనం కోసం కువలయ సంతానం ముస్తాబౌతున్నది. మధువు అని, మైకంలోపడి పరదార గ్రహణా సక్త చిత్తంతో పద్మాలయంలో తుమ్మెదలు బంధింపబడ్డై. ఆ వేళకు మునులు శోణ నదీతీరానికి చేరుకున్నారు. ఆ నదిలో కృతస్నాతులై, సూర్యార్ఘ్య

ప్రదానం, సంధ్యావందనాది నిత్యక్రియలు తీర్చి, ఫలహారాలుచేసి, తృణ శయ్యలపై మేను వాల్చారు.

పదకొండో రాత్రి శోణనదీ సమీప స్థానంలో విశ్రమించిన తరువాత, రామచంద్రుడు గురువులను ఆ ప్రదేశ విశేషాలు అడిగాడు. ఆ ప్రశ్న ఆధారంగా, రామునితోపాటు ఋషులంతా వినేలాగా కౌశికుడు తన వంశ గాథ చెప్పటం మొదలుపెట్టాడు.

"దాశరథీ! తెలియదగిన విషయాలే నీవు ప్రశ్నిస్తావు. ఇది మా వంశ చరిత్ర. మా వంశ మూలపురుషుడు "కుశుడు". అతడు బ్రహ్మదేవుని కొడుకు. అంతటి సద్గుణశాలి అంతకు పూర్వం పుట్టలేదు. ఆయన విదర్భ రాజు కుమార్తె "వైదర్భి"ని గేస్తురాలుగా గ్రహించి నలుగురు పుత్రుల పొందాడు. వారు "కుశాంబుడూ, కుశనాభుడూ, అమూర్తరజసుడూ, వసువూ" అనే పేరులతో పిలువబడ్డారు. వారికి యుక్తమైన వయస్సు రాగానే తండ్రి, అసమశక్తులచేతా, భేదకార్యాలచేతా, వింత ప్రవృత్తులచేతా భిన్నభిన్న ఆకార, ఆచారాలచేతా సృష్టింపబడ్డ జీవరాశిని, సమానంగా సుఖింపచేయాలన్న సంకల్పంతో పిలిచి ఇలా చెప్పాడు.

"బిడ్డలారా! కేవలం సత్త్వం లోకాన్ని అనుశాసించలేదు. రజస్తమో గుణాల మిశ్రమం వుండాలి. మీరు జన్మతః సత్త్వసంపన్నులు. రజస్సునూ తమస్సునూ, అవసరార్థం కావలసినంత గ్రహిస్తూ లోకపాలనం చేయండి. ప్రజలను ధర్మంగా పాలించే రాజుకు సర్వ తపః ఫలాలూ లభిస్తాయి. కాబట్టి నేటినుండి మీరు క్షత్ర ధర్మాన్ని పొంది క్షత్రియులుగా పేరుకాంచి అజరామర కీర్తి కాంచండి" అన్నాడు.

పితృదేవుని యాజ్ఞ గైకొని, కౌశాంబి నగరాన్ని కుశాంబుడూ, మహోదయ నగరాన్ని కుశనాభుడూ, ధర్మారణ్య నగరాన్ని అమూర్త రజసుడూ, గిరివ్రజమును వసువూ రాజధానులుగా చేసుకుని, విశాల విశ్వాన్ని పాలించారు. వారిలో చివరివాడైన వసురాజు ఈ ఐదు మహా పర్వతాల మధ్యస్థ భూమిని సస్యశ్యామలంచేసి ప్రజారంజకుడైనాడు. మగధ దేశంలో పుట్టి ఈ పర్వతాల మధ్యగా శోణనది ప్రవహించి పశ్చిమ ముఖంగా సముద్రంలో కలుస్తుంది. రెండవవాడైన కుశనాభుడు ఘృతాచి యను అప్సరః కన్యను వివాహమాడి నూర్గురు పుత్రికల పడశాడు.

అతని పాలనలో మహోదయ రాష్ట్రం మూడు పూలూ, ఆరు పిందెలుగా వర్ధిల్లింది. రూప యౌవన సంపన్నులైన రాజపుత్రికలు క్రీడా వనానికి విహారార్థం పోగోరి సర్వాభరణ భూషితలై, మన్మథాస్త్రాలవలె, చెలులతో వ్యాహ్యాళికి వెళ్ళారు. ఆ కన్యల అనుత్తమ సౌందర్యం చూచి, వాయు దేవుడు మోహపరవశుడై, పతిగా తన్ను స్వీకరించవలసిందిగా అర్థించాడు. అందుకా సుందరీమణులు వ్యంగ్య భాషణం చేశారు.

"ఓ జగత్ప్రాణా! నిన్నెఱుంగకేమి? నీవు మమ్ముల అమర్త్యుల చేయగలవు. మా సౌందర్యం కాలవశం కాకుండా కాపాడగలవు. ఇంకే మైనా చేయగలవు. కానీ మేం తండ్రి చాటు బిడ్డలం. ఆయన ఎవరికి యిస్తే వారినే భర్తగా సేవిస్తాం. నీ అసందర్భ ప్రలాపాలకు నిన్నిచ్చట నుండి తొలగించగల తపస్వినులం.ఐనా మేం ఆ పని చేయతలచుకోలేదు. ఇంక నీ దురుసు మాటలు మాను" అని.

ఆ మాటలకు వాయువు కాలరుద్రుడై "వనితరాలా! జీవ స్వరూపు డైన నన్ను తిరస్కరిస్తారా? పైగా కఠినవాక్యాలు పలుకుతారా? మిమ్మేం చేస్తానో చూడండి" అంటూ, వారిలో ఉచ్ఛ్వాస, నిశ్వాస రూపంగావున్న తన తేజం ఉపసంహరించాడు. వెంటనే ఆ సుందరులు సర్వాంగాలు కుంచించబడి మఱుగుజ్జులై, వంగిన నడుమూ, పొట్టిచేతులూ, వంకర దేహములతో, వికార రూపులై, ఏడుస్తూ ఆవాసం చేరుకున్నారు. ఆ ఘోరం తిలకించి తండ్రి జరిగిన విషయం తెలుసుకొని, సుతల నోదార్చి "మీ క్షమయే మిమ్ముల రక్షిస్తుంది. క్షమకు మించిన గుణం వేరొకటి లేదు. అచిర కాలంలో మీకు శుభం కలుగుతుంది."

అని, మంత్రులతో కుమార్తెలకు వరాన్వేషణ విషయం ప్రస్తావన చేశాడు. అదే సమయంలో, ఊర్ధ్వరేతస్కుడైన "చూళి" అనే తాపసి ఊర్మిళ నామంగల గంధర్వతరుణి కూతురు "సోమద" పేరుగలది శుశ్రూష చేస్తుండగా ఘోర తపం చేయసాగాడు.

## బ్రహ్మదత్తుని చరిత్రం

కొంతకాలం గడిచింది. సోమద సపర్యకు సంతసించిన చూళి వరం కోరుకొమ్మని ఆమెతో అన్నాడు. ఆమె, "స్వామీ! నేను కన్యకను. అవి

వాహితను. మీసేవతప్ప అన్యం ఎరగను. మీరు బ్రహ్మర్షులు. ఆగతానాగములనెరింగినప్రజ్ఞులు. అడుగరాని కోరికయైనను మన్నించి నాకు పుత్రదానం చేయవలెను. భర్తృ సుఖం లేకున్నా, పుత్రసుఖం అనుభవిస్తాను" అన్నది. అందుకు ఆ మౌని ఆగ్రహించక, తనయంత వానిని సంకల్పమాత్రంగా పుట్టించి, ఆమెకు ఇచ్చి యథేచ్ఛముగా పొమ్మని అనుగ్రహించాడు. బ్రహ్మసన్నిభుడైన ఋషిచే ఈయబడినవాడగుటచే, "బ్రహ్మదత్తుడు" అనే నామం పొందాడు. పుట్టుకతోడనే ప్రాజ్ఞుడౌటచే, తల్లినింగొని కాంపిల్య నగరం చేరాడు. ఆ రాజ్యాధిపతి అపుత్రకుడు కావటంచేత బ్రహ్మదత్తునికి రాజ్యం అప్పగించి, తురీయాశ్రమం స్వీకరించాడు.

ఆ వృత్తాంతం తెలుసుకున్న కుశనాభుడు, మంత్రులచే ఆతనిని రావించి, జరిగిన సంగతులు చెప్పి తనకుమార్తెల వివాహమాడవలసినదిగా వేడుకున్నాడు. అందుకు బ్రహ్మదత్తుడు హర్షించాడు. ఆనందంగా పెండ్లి జరిగింది. అనంతరం బ్రహ్మదత్తుడు వరుసగా ఆ రాజకుమారికల పాణిగ్రహించాడు. ఆమహాతపస్వి కరగ్రహణ స్పర్శవల్లనే వారియథా రూపాలు ప్రసాదించాడు. తండ్రి ఆనందానికి మేరలేదు. వైభవోపేతంగా అల్లునీ, పుత్రికలను పంపి, వంశవృద్ధికోసం ఇష్టిచేయగా, కుశుడు కుమారుని గాంచి, "పుత్రకా! విచారించకు. సర్వలోక ప్రసిద్ధుడైన కుమారుడు కల్గుతాడు. అతని పేరుతో వంశం ప్రఖ్యాతి వహిస్తుంది" అని చెప్పి బ్రహ్మలోకం చేరుకున్నాడు. ఆ తనయుని పేరే గాధి. నా తండ్రి ఆ మహాత్ముడే. కుశాన్వయుడనైన నేను, కౌశికుడనీ, గాధేయుడనీ వ్యవహరింపబడుటకు కారణమిదియే. నా అక్క సత్యవతి ఋచీకమహర్షికి ఈయగా, ఆమెఒడతోనే దివ్యలోకం పొంది, మరల "కౌశికి" పేరుతో నాకంలోనుంచి హిమశైలం ప్రాపించి, అక్కడనుంచి భూతలంలో పుణ్యక్షేత్రంగా ప్రవహిస్తోంది. ఆమె పూర్వనామం సత్యవతి కావున, ఆనదిని కౌశికీ, సత్యవతీ అనికూడా పిలుస్తారు. అందుకే నేను హిమశైలాన్ని తపస్సుకు కోరుకున్నాను.

నేతలపెట్టిన యాగం సిద్ధించటానికే సిద్ధాశ్రమం చేరాను. అది నీ అపారగురుభక్తి—కాదు—కాదు—ప్రసాదంచే సిద్ధించింది. వచ్చిన పని అయింది. రామా! ఇది నావంశ చరిత్ర. రెండవయామం దాటుతున్నది. పగలంతా ప్రయాణంతో బడలి వున్నావు. తగిన విశ్రాంతి శరీరానికి అవసరం.

రేపు మళ్ళి నడవాలికదా. ఇంక పరుండు" అని మేను నిమిరి, అస్త్రరణ ములు చూపి నాటికి శయనించాడు.

తోడవచ్చిన మునులనూ, కౌశికుని పలువిధముల పొగడి, ఆయన వంశ ప్రతిష్ఠలను వర్ణించి, కౌశికీనది పావిత్ర్యాన్ని పరిపరివిధాల సంస్తుతించి వారును నిద్రావశులైరి. రాత్రి గడచుచుండగా చంద్రోదయమైంది. వెన్నెల కాంతులు శోణనద జలములపై ప్రసరించి, తరగల కదలికలో మిలమిలా మెరిసిపోతున్నవి. గాలి స్తంభించుటచే ఆకల్లాడలేదు. వృక్షముల నేర్పరచు కొన్న గూండ్లలో పక్షులు కూర్చున్నై. దూరంగా పల్లెల్లోఅప్పు డప్పుడు కోళ్ళ "కొక్కొరొకో" ధ్వనులు వినవస్తున్నాయి. అందరూ ఆ రాత్రి సుఖంగా నిద్రించారు. ముందుగా మహర్షి మేల్కొంచి "రామచంద్రా లే. తెల్లవార వస్తున్నది. మనం ప్రయాణించాలికదా. అవశ్యవిధులుపూర్తి చేసి కొనండి" అని లేపాడు. రామలక్ష్మణులు అనుష్ఠానాలు ముగించారు.

## గంగానదీ వృత్తాంతం

పన్నెండవనాటి ఉదయం. రాముడు గురువులతో "స్వామీ! శోణ నదం నిర్మల జలకలితమై, మీ అనురాగ హృదయంవలె, ఎంతో ఆహ్లాదం కలిగించింది. ఈ నదాన్ని ఏ రేవున మనం దాటాలి" అని అడిగాడు. "వత్సా! మునులు స్నానార్థమై నడచిన కాలి దారి ఇదిగో. బాగా నలిగి స్పష్టంగా గోచరిస్తున్నది. దీనివెంట పోయి ఆవలికి చేరుకుందాం" అంటూ నడకసాగించాడు మునులూ, రాకుమారులు ఆయనను అనుసరించారు.తమ సీదను తాము ద్రొక్కు వేళకు—

"కాంచిరి మౌని పుంగవులు కల్మషభంగను, దేవయక్ష దృ
క్సంచిత పుణ్యసంగను, ప్రకాంత కృపావిమలాంతరంగనున్,
చంచల పద్మరంజిత విశాలతరంగను, చక్రవాక స
త్కాంచిత జకాది మోహన పతంగను, రంగదభంగ గంగనున్."

అప్పటికి ప్రయాణమాపి, సుస్నాతులై, మధ్యాహ్న విధులు పరిపూర్తికావించి, తర్పణములిచ్చి, యజ్ఞహవిస్సు భుజించి, తీరమందలి వృక్షచ్ఛాయల్లో (చల్లగానున్న గంగా సైకత ప్రదేశంలో) మహర్షి మధ్య ముండగా, చుట్టూ మౌనులు ఆసీనులయ్యారు.

సర్వ గుణభద్రుడైన రామభద్రుడు వికసిత పద్మాల్లాంటి రెండు హస్తాలూ జోడించి, "గురుచంద్రా! బాలక చాపల్యంచేతా, మీ కథాకథన పద్ధతికీ, ఆకర్షితుడనై అడుగుతున్నాను. మాటిమాటికి ఈ ప్రశ్నలేమని ఆగ్రహింపకుడు. మహాయుగాలు ధిక్కరించి, అమృతసంపూర్ణంతో వెలుగుతున్న మీకుగాక, పూర్వపూర్వమైన ఈరహస్యగాథలు ఎవరికితెలుస్తాయి? తెలిసినా మీవలె హృద్యంగా, నవనవంగా ఎవరు చెపుతారు? సర్వలోక పవిత్ర గంగాభవానిని "త్రిపథ" అంటారుకదా? ఆపేరు ఆమెకుఎందుకు వచ్చిందీ? మానవలోకంలో ఏక గమనగానే కనుపిస్తున్నది. అనుగ్రహించండి" అన్నాడు.

"రఘువంశమండనా! రామా! అతి విచిత్రగాథ అడిగితివయ్యా! వేదంలో ఇది వైజ్ఞానిక రహస్యం. అందుకే శ్రుతి ప్రజ్ఞాన, విజ్ఞాన, సుజ్ఞాన నిలయమైంది. సృష్టి రహస్యాన్ని కథోపకథలుగా చెప్పింది. అల్పబుద్ధులూ, దురహంకారులూ, అజ్ఞానులూ, అసూయపరులూ, జాతిద్వేషులూ వేదపరమార్థం తెలుసుకోలేరు. ప్రతి అణువూ తేజోరూపమే. చైతన్యవంతమే. విద్యుత్తును దర్శించి, స్పర్శించలేనట్లు, ఆ మహాతేజాన్ని చూచీ, తాకీ చెప్పలేరు. అందుకే బాహ్యానుభవంగల పదార్థాలద్వారా సాకారంతో మనోహరంగా గానంచేసింది.

త్రిపథ అంటేమూడుగతులు కలదిఅని అర్థం. నీటికిమూడుగతులూ వున్నాయి. అధోముఖం (ఇంకుట) ఊర్ధ్వగమనం (కనపడేలా పారడం) ధాతుసృష్టి (మూలపదార్థాలన్నింటినీ పుట్టించటం). అధోముఖాన్ని, పాతాళగంగఅనీ, ఊర్ధ్వగమనాన్ని ఆకాశగంగ అనీ, ధాతు సృష్టిని ప్రాణాధారమనీ, లోకవ్యవహారంకోసం చెప్పబడింది. పంచభూతాల్లో నాల్గవ భూతంగా గుర్తించబడిన ఈ గంగ, సర్వమైన ఓషధులకూ, ధాతువులకూ మూలమైన హిమశైలంమీద పుట్టింది. సముద్రంలో కలిసింది. ఇది మర్త్యగాథ.

హిమవంతుడు మేనకను భార్యగా గ్రహించి ఇద్దరు పుత్రికలనూ, ఒక పుత్రుణ్ణీ కన్నాడు. పెద్దదిగంగ. రెండవది ఉమ(పార్వతి). కుమారుడు మైనాకుడు. తనతపశ్శక్తిచే సర్వజీవనాధారగా వెలిగింది. స్వర్గలోకవాసులు ఆపవిత్రగంగను స్వర్గంలో ప్రవహింపచేయాలనికోరి శైలాన్ని ప్రార్థించారు. ఆపర్వతరాజు వారి అభ్యర్థన అంగీకరించాడు. భూలోకంలో నుంచి స్వర్గా

నికి కొనిపోయినందున రెండు పక్షాలు గలిగినై. రెండవకూతురుపార్వతి. ఈమె ఈశ్వరుణ్ణి పతిగా వరించింది. ఆ దంపతులు సృష్టికై, అసంఖ్యాక దేవతావత్సరాలు కామ ప్రవృత్తిలో సుఖించారు. కానీ సంతానలాభంకలగ లేదు. ఆ ఆదిదంపతుల కూటమిలో పార్వతిగర్భవతియైఒకబిడ్డను కన్నచో ఆ బిడ్డను ఆజ్ఞాపించగలఅర్హత బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకేలేదని ఆలో చించి, దేవతలు పరమశివుని సమీపించి, "స్వామీ! మీ తేజస్సంగమంలో జగత్ప్రళయహేతువై నభూతంకలిగి, సృష్టినశిస్తుంది. జీవలోకరక్షణకునీవే వీర్యధారణచేయ"మని కోరారు. (రెండు సమపాత్రలలోనున్న నీళ్ళు ఒక సమపాత్ర ధరించలేదు) అందుకు అంగీకరించి, "నా తేజస్సును (వీర్యం, లేక *ధాతువు) పాతంచేస్తే ధరించే శక్తి ఎవరికుంది?" అని శంకరుడు ప్రశ్నించాడు. అందులకు సురవర్యులు "భూమి"•ధరిస్తుంది అని చెప్పారు. వెంటనే ఈశ్వరుడు వీర్యపాతం గావించాడు. ఆ తేజస్సు భూదేవికి దుస్స హంబైంది. అంతట దేవతలు అగ్నిని ధరించమన్నారు. ఆతడంగీకరించి ఆ వీర్యమును ధరించాడు. వెంటనే వెండికొండవలె ప్రకాశింప సాగాడు. అనంతరం—

## పార్వతి దేవతల శపించుట

శివవీర్యం పాతమై, భూదేవి ధరించినట్లు తెలియగానే, పట్టరాని తీవ్ర కోపంతో దేవతలను ఉద్దేశించి "విశ్వక్షేమ నెపంగా నా భర్తను వంచించి, నన్ను శాశ్వతంగా అపుత్రను చేసిన మహాపాపానికి మీకూ శాశ్వతంగా మీ కళత్రాలవల్ల సంతానం పొందకుందురుగాక. ఓసీ! ధరిత్రీ! సాటిఆడు దానివై కూడా ఈ అకృత్యానికిపాల్పడ్డావు, కనుక నీవూఅపుత్రవురాలివై, అనేక భార్య(రాజులకు పత్నీ భావం)వలె, బహువిధరూపవతివై (ఎగుడూ దిగుడూ, నలుపూ, ఎరుపూ, తెల్పూ, కంకరమొదలైన నానాకారవిశేషాలతో) సృష్టి అంతవరకూ బ్రతుకుదువుగాక" అని శపించింది.

---

* ధాతువు అనగా అణువును ఛేదించే శక్తి.

• ఖనిజాలన్నీ ఈ కారణం చేతనే భూమిలోనే లభిస్తాయి.

ఆ శాపానికి, భూదేవీ, సురలూ ఘోరంగా దుఃఖించసాగారు. వారి శోకం చూడలేక భార్యతో ఈశ్వరుడు మంచుకొండ దక్షిణదిశకేగి మరల తపోనిష్ఠలో నిమగ్నమైనాడు.

## కుమారస్వామి జననం

గౌరీశంకరులు వెళ్ళినమీదట. ఏమి చేయుటకు తోచక, భార్యలందు సంతానం కలుగదు కనుక, "దితి సంతానం బాధ తప్పించే శక్తిగల సేనానాయకుడెట్లు లభించగలడా?" అని విచారించి దేవతలు బ్రహ్మ సమ్ముఖానికి పోయి తమకోర్కెలు తెల్పిన అమరులకు ధాత ఒక మార్గం తెలిపాడు. "శంకరుని వీర్యం దాల్చిన అగ్నిదేవుని ఆశ్రయిస్తే, అతడు గంగయందు ఆ ధాతువును నిక్షిప్తం చేస్తాడు. ఆమె కుమారుని ప్రసవిస్తుంది. ఆ బిడ్డడే దేవతలందరికీ కుమారుడు అవుతాడు. కనుక అతని పేరు కుమారస్వామిగా వ్యవహరించండి. మీకు రెండు కార్యాలూ సిద్ధిస్తాయి" అని. ఆ మాటపై సురలంతా అగ్నిహోత్రునివద్దకుపోయి, చతుర్ముఖుని ఉపదేశం వినిపించారు. "నేనీ భారంతో కదలలేను. మీరు గంగాదేవిని అంగీకరింపచేసి తీసుకొని వస్తే, ఈ భారం ఆమెకు దత్తం చేస్తాను" అని అగ్ని చెప్పాడు. ఆమె అందుకుసమ్మతించగా, వైశ్వానరుడు శివవీర్యం ఆమెపై వర్షించాడు. అంత తేజస్సంపన్నురాలైన గంగ కూడా ఆ మహావీర్య భారాన్ని భరించలేక గగ్గోలు పెట్టింది. సమయోచితబుద్ధియైనహుతవహుడు గంగను ఓదార్చి ఇలా అన్నాడు.

"లోకపావనీ! నీవు నీ గర్భాన్ని హిమవత్పర్వత ప్రాంతభూమిలో స్రావం చెయ్యి. అలా చేస్తే నీ భారం తగ్గిపోతుంది" అని చెప్పాడు. ఆ మాటకు గంగ హర్షించి శ్వేతశైల సమీపం చేరి గర్భస్రావం చేసింది. వెంటనే మంచునిండిన ప్రదేశమంతా వెండిగా మారిపోయింది. తక్కిన క్షార ప్రదేశం (ఉప్పులోభేదాలు)లో రాగి, నల్లని ఇనుమూ(దుక్క ఇనుము) మన్నూ, సీసం, తగరం, తయారైంది. తన గుల్మలతాదులన్నీ బంగారంగా మారినై. స్రావమైన చోటంతా రెల్లుగా మార్పు పొందింది. (ఇది గంగకు మూడోగతి) ఆ రెల్లులో కుమారస్వామిజన్మించాడు. ఆ బిడ్డకు షట్కృత్తికలు మాతృమూర్తులై స్తన్యమిచ్చి పెంచారు. పెద్దవాడైన కుమారునికి

ఇంద్రుడు దేవసేనాపతిత్వం ఇచ్చి గౌరవించాడు. ఈ విధంగా గంగాదేవి త్రిలోకపూజ్య అయింది. సర్వధాతువులకూగంగమూలద్రవ్యాలలో ప్రధాన పాత్ర వహిస్తుంది. ఈ వేద రహస్యం మహర్షుల్లో నేనూ, భరద్వాజుడు మాత్రమే ఎరుగుదుము.

వేదహృదయమైన గాయత్రి మంత్రానికి నేను ద్రష్టను. అందుచే ఆ మంత్రానికి ఋషి నయ్యాను. వేదగర్భితమైన విజ్ఞానం మంత్రరూపంగా వుంది. అది నాకు తెలుసు గనుకనే అపరబ్రహ్మనయ్యాను. ఏవిధంగానూ సంబంధంలేని "విశ్వామిత్ర" నామం నాకు వచ్చింది. ఈ రహస్యాన్ని సంపూర్ణంగా సమన్వయించుకుంటా స్పష్టంగా తెలిపాను. ఈ పరమపావని చరిత్రగూర్చి ఇంకో గాథ వుంది. అది సాగర చరితం.

## సగరచక్రవర్తి వృత్తాంతం

పూర్వం మీ వంశంలో "సగరుడు" అనేరాజు పుట్టి, లోకాతిశయ విఖ్యాతితో భూపాలనం చేశాడు. అతనికి బహుకాలం గడిచినా సంతతి కలగలేదు. అందుచేత మిక్కిలి విచారించి, విదర్భరాజు కుమార్తెను "కేశిని"నీ, అరిష్టనేమి కూతురు "సుమతి"ని వెంటపెట్టుకొని "భృగుప్రస్రవణం" అనే పర్వతం చేరి అక్కడ నూరు సంవత్సరాలు వానప్రస్థుడై తపంచేశాడు. ఆతని గొప్ప తపస్సుకు "భృగు" మహర్షి సాక్షాత్కరించి రెండు వరాలు ఇచ్చాడు. "అసమాన వేలమంది శక్తిమంతులు ఒక భార్యకూ, వంశవర్ధనుడు ఒక్కడు ఒక భార్యకూ కలుగుతారు" అని. పిల్లలు కలుగుతారన్న సంతోషం ఒక పక్క, ఎవరికి ఏ విధంగా కలుగుతారో తెలియని సంశయం ఇంకొక వంకా కలవరపెడుతుండగా, సుమతీ, కేశినులు భృగువును గాంచి, "స్వామీ! ఎవరికి పెక్కుమందీ, ఎవరికి ఒక్కరూ కలుగుతారో దయచేసి మాకు సెలవీయుండి" అని అడిగారు. "మీ కోరిక ననుసరించి" అని చెప్పాడు. కేశిని వంశవర్ధనుణ్ణి ప్రసవించదలచింది. సుమతి బహుల సంతానం కటాక్షించమన్నది. ఆ విధంగా అనుగ్రహించి భృగువు వెళ్ళిపోయాడు.

భార్యలతో తిరిగి సగరుడు అయోధ్యకు వెళ్ళాడు. కొంతకాలానికి కేశిని కుమారుణ్ణి కన్నది. పిమ్మట సుమతి "తుంబను" ను (గడ్డిముబ్బ

ఆకారంతో పొడవుగా వుండేది) కన్నది. ఆ తుంబము చెదరి అరువదివేల ముక్కలుగా పరివర్తనం పొందింది. ఆ శిశురూప ఖండాలను, క్రొత్త కుండలలో ఘృతం (నేయి) పోసి దాచులు, వాటియందుంచి క్రమపద్ధతిలో దోహదక్రియలు చేస్తూ వుండగా, శిశువులై, ఆ తర్వాత మానవాకారాలతో ప్రాప్త యౌవనులయ్యారు. (ఇది క్రమంగాని కృత్రిమ సంతాన,ఉత్పత్తి లక్షణం) కేశిని కుమారునకు "అసమంజుడు" అనీ, సుమతి బిడ్డలకు "సాగరులు" అనీ తండ్రి పేర్లు పెట్టాడు. పెద్దవాడయిన అసమంజుడు అందరివలెకాక, దుర్మార్గుడై, క్రూరుడై, పౌరుల (చిన్నబిడ్డల)ను ఆటలకై తీసుకుపోయి, సరయూ నదిలో విసిరివేసి మునిగి తేలగానే మళ్ళీ ముంచి చంపి ఆనందించేవాడు. ఈ క్రూరత సహించని ప్రజలు రాజుతో చెప్పగా, ఆ పాపిష్టి కొడుకును దేశబహిష్కారం చేశాడు. అప్పటికి అసమంజునకు "అంశుమంతుడు" అనే ఆత్మజుడున్నాడు. అతడు తారామండలంలో చంద్రుడులాగా, విద్యలలో ఆదిశేషుడులాగా, బుద్ధిలో బృహస్పతిలాగా, పౌరుల ఆనందం పట్ట శక్యంగాని విధంగా ప్రకాశిస్తున్నాడు. ఆ మనుమనికి యౌవరాజ్య పట్టాభిషేకం చేసి, హిమ వింధ్య పర్వతాల మధ్యప్రదేశం యజ్ఞక్షేత్రంగా అశ్వమేధం చేయతలంచి, గుర్రాన్ని విడిచాడు. దాన్ని ఇంద్రుడు మాయచే అపహరించాడు. నిర్ణీతకాలానికి తిరిగి ఆ జానేయం రానందున, అధ్వర్యులురాజుతో "గుర్రం రాకపోతే క్రతువు విఘ్నమై, మీ వంశం అంతరిస్తుంది. త్వరగా వెదకి తెప్పించ"మని చెప్పారు. సంతపించి సగరుడు సుమతి సంతానం అరువదివేలమందినీ పిలిచి, చెప్పగా ఒక్కొక్కరు ఒక్క యోజనం పరిమితి, గడ్డపారలు, సెలకపారలు [శూలాలు, బల్లేలు ఇంకా త్రవ్వకానికి వీలయ్యేపరికరాలను] కొని, భూమిని ఎనిమిది దిక్కులా పాతాళ పర్యంతం త్రవ్వసాగారు.

ఆ ఖనన క్రియ [త్రవ్వుట]లో కలిగిన రణగొణధ్వనికీ, రసాతల పర్యంతం త్రవ్వి ఆ లోకాన్ని పాడుచేసిన పనికీ ఇంద్రాదులు విరించి లోకానికిపోయి, పడుతున్న బాధలు నివేదించారు. విని విని చతుర్ముఖుడు ఈ నవఖండ మండలాయుతమైన ఈ భూ ఖండం అంతా, విష్ణుని ఆధీనం. ఆ మహాభాగుడు "కపిల"ముని రూపంలో దాన్ని రక్షిస్తున్నాడు ఆయన సాగరుల పని చక్కబెట్టుతాడు. ప్రతికల్పంలోనూ ఈ విధంగానే జరుగు

తూంది. మీరు విచారం మాని వెళ్ళండి." అని చెప్పాడు. ఇక్కడ సాగరులు అష్టదిగ్గజాలను పరామర్శించి, అనుమానించిన వాళ్ళను హతంచేస్తూ, ఎక్కడా గుఱ్ఱం జాడ తెలియక తండ్రితో విషయమంతా వివరించారు. ఆయన ఆగ్రహపడి "గుఱ్ఱాన్ని తేకుండా తిరిగి రావద్దు. జగత్తు సర్వం శోధించండి. ఏమైనా చెయ్యండి. గుఱ్ఱంతో రండి" అని కఠినంగా శాసించాడు. దాంతో సృష్టి విధ్వంసనం చేస్తూ, ఉత్తరదిక్కున భూమిని త్రవ్వుకుంటూ పోగా పోగా, మునినీ, సకిలింపుతున్న గుఱ్ఱాన్నీ చూశారు.

పట్టలేని దురాగ్రహంతో మునిని చేరి "ఓ దొంగమునీ! నీవు మా హయాన్ని ఎందుకు దొంగిలించావూ? నీమాయమామైనకాదు. మేంసాగరులం సుమా! మర్యాదగా ఇచ్చి క్షమాపణకోరుకో, లేకపోతే నిన్ను ప్రాణాలతో విడువం" అంటూ గర్జించి పై కురికారు. ఆకఠినవాక్యాలు విని, క్రుద్ధుడైన ముని కనులు తెరచి చూశాడు. ఆ తపోగ్నికిసాగరులుభస్మరాసులయ్యారు. ఎంత కాలానికీ బిడ్డలు రానందున వ్యధచెంది, "నీవు ప్రయోజకుడవు, విజ్ఞానఖనివి. పినతండ్రుల జాడ తెలుసుకొని యజ్ఞాశ్వంతో వెంటనే మరలిరా" అని సగరుడు మనుమని ఆదేశించాడు. అంశుమంతుడు తాతగారి అనుమతితో ససైన్యుడయిపోయి, అష్టకరీంద్రములకు వరుసగా మ్రొక్కి వాటి దీవనలంది, పితృవ్యులజాడ నెరిగి, మునిని, మెంతనున్న మహాశ్వాన్ని, బూడిదరాసులైయున్న పినతండ్రులనూ చూశాడు. తండ్రుల దురవస్థతలచి, బిగ్గరగా రోదించాడు.

## దుఃఖించు అంశుమంతుని గరుడుడు ఓదార్చుట

కపిలముని సమీపంలో ధ్యానమగ్నుడైయున్న గరుత్మంతుడు అంశుమంతుని ఏడుపు విని, చేరవచ్చి బుజ్జగించి "నమనా! దుఃఖపడకు. కపిల ముని ఆగ్రహానికి నీ తండ్రులు బూడిదెరాశులైనారు. వీ రిట్లు గావడం విశ్వహితం. "వీరు మహాపరాక్రములు.వీరికినివాసములు[చచ్చిన వారికిచ్చు ఉదక క్రియలు] ఇచ్చుటెట్లు, జలం లేదే" అనుకుంటున్నావు. బ్రాహ్మణ శాపంతో హతులైనవారికి అన్యగతాగతులు లేవు. వీరికి స్వర్గలోక ప్రాప్తి కల్పించాలంటే ఒకటే మార్గముంది. అది హిమవంతుని పెద్ద బిడ్డయగు గంగను ఈ రాసులపై ప్రవహింపచేయటం. ఇప్పుడు నీవి తుక్కం

గాన్ని తీసుకుపోయి, తాత యజ్ఞం సమాప్తం చేయించి, ఆమీదగంగాదేవిని భూలోకానికి కొనివచ్చే ప్రయత్నం చెయ్యి" అని హితోపదేశం చేశాడు. అంశుమంతుడు గరుత్మంతుని బోధ చొప్పున గుర్రాన్ని కైకొని తాతను చేరి, పిన తండ్రుల గతి చెప్పాడు. సగరుడు యాగం పూర్తి గావించి, కొడుకులకై వగచి, గంగదెచ్చు ఉపాయం తోచక, ముప్పైరెండువేలేండ్లు పరిపాలనం చేసి స్వర్గానికరిగాడు. అనంతరం అంశుమంతుడు తనకొడుకు దిలీపునకు రాజ్యం ఇచ్చి, హిమగిరికరిగి, ముప్పై రెండువేల వత్సరాలు ఉగ్ర తపం చేసి, గంగను తేలేక శరీరం చాలించాడు. దిలీపుడు కూడా ముప్పైవేల వర్షాలు అనేక యజ్ఞయాగాదులు, దానధర్మాదులుచేసి, గంగను తేలేక తన కొడుకు "భగీరథు"నికి పట్టంకట్టి ఒడలు చాలించాడు. దిలీపుడు కూడా తన యావచ్ఛక్తిని వినియోగించి పితరుల ఋణం తీర్చలేక భగీరథుణ్ణి ప్రభువుగా చేసి శరీరత్యాగం చేశాడు.

రాజర్షియని ప్రఖ్యాతిగన్న భగీరథుడు తాతలకు ఉత్తమలోక ప్రాప్తికై రాజ్యాన్ని మంత్రుల పరంచేసి గోకర్ణ క్షేత్రానికి తపస్సునకై పోయాడు.

## గంగావతరణం

గోకర్ణ క్షేత్రంలో ఆశ్రమంనిర్మించుకుని,జితేంద్రియుడై,పంచాగ్ని మధ్యంలో, ఊర్ధ్వబాహుడై, గాలి, నీరూ వర్జించి, నెలకు ఒకసారి మాత్రం కందమూలాలుతింటూ,వేయిసంవత్సరాలు విడువని దీక్షతో,సడలని నిష్ఠతో బ్రహ్మనుగూర్చి తపంచేశాడు. చతుర్ముఖుడుఆనందించి ప్రసన్నుడై,సత్యలోకవాసులు సేవింపగా వచ్చి "భగీరథా! లే. తపో విసర్జనం చేయి. నీ కోరిక ఏమిటో చెప్పు. తప్పక తీరుస్తాను" అన్నాడు. భగీరథుడువలగొని మ్రొక్కి, "ఓ హిరణ్యగర్భా! ఈ అల్పుని అనుగ్రహింపవచ్చావు. నీ అపార కరుణను నేనేమని కొనియాడగలను? నా తాతలు కపిలముని క్రోధానలంతో భస్మీభూతులై బూదిదరాసులైనారు. వారికి ఉత్తరక్రియలుచేయటానికి వీలుపడక, గంగాదేవిని ప్రవహింపచేయటానికి ప్రయత్నించిన నా పెద్దలు గతాసులయ్యారు. పరిశుద్ధమైన సూర్యవంశంలో జనించి, మహా పరాక్రమవంతులైననా పూర్వులునారకవాసులవుటకుమిక్కిలిశోకిస్తున్నాను

వారికి ఊర్ధ్వగతులు కలిగేటట్లు గంగను ప్రసాదించు. నాతో ఆగిపోకుండా ఇక్ష్వాకువంశం సాగేలాగా అనుగ్రహించు" అని కోరాడు.

"రాజర్షీ! నీ ఉచితమైన కోరికలు రెండూ ప్రసాదిస్తున్నాను. గంగ భూమికి సరాసరి దిగితే ఆమె భరించలేదు. కాబట్టి నీవు మహాదేవుని ప్రసన్నుని చేసుకో. నీ కార్యం సిద్ధిస్తుంది. గంగా! ఈ ఉత్తమరాజర్షిని అనుగ్రహించు" అని పల్కి అంతర్ధానమయ్యాడు. వరముల ఇచ్చి కమలాసనుడు తిరోగామి కాగానే, పరమశివుని హృదయపీఠంలో నిల్పి, సాక్షాత్కారార్థం సంకల్పించి, కుడికాలి బొటనవ్రేలిని భూమిపై మోపి, రెండు చేతులూ పైకెత్తి అంజలి బంధించి, రెండునేత్రాలూ భ్రుకుటి మధ్యలో చూడగా, గాలి ఆహారంగా, కదలక నూరువత్సరాలు తపస్సు సలిపాడు. భక్తజన వశంకరుడైన శంకరుడుదర్శనమిచ్చి "వత్సా! భగీరథా! నీఅభీష్టం సిద్ధించుగాక. ఇదుగో నేను గంగ వేగాన్ని నా శిరస్సున భరిస్తాను. తపం చాలించు" అన్నాడు. వెంటనే గంగ గర్వంతో ఇలా అనుకున్నది.

"నా మహోద్ధృత వేగాన్ని ఈశ్వరుడుభరిస్తాడా? ఈతణ్ణి పాతాళం చేరుస్తాను. కులపర్వతాలు ఆగలేవు. వృక్షాలు నిల్వలేవు. ఇంతవరకు ఏ దేవతా నా శక్తిని నిగ్రహించలేదు. నన్నాశ్రయించి కొందరూ, నాలో మునిగి కొందరూ, నా జలపానం చేసి కొందరూ సంకల్ప సిద్ధులైనారు" అని.

గంగాదేవి గర్వభావం శంకరుడు గుర్తించాడు. "నా అనుగ్రహానికి ఎలా పాత్రురాలు కాదో చూస్తాను. సర్వసంహార కారణమైన రుద్రతేజం అల్పంగా భావించిందంటే క్షమించరాని అపరాధం" అని రుద్రమూర్తియై అర్ధాంగి పార్వతిని చూచి నవ్వాడు. ఆమె పతి నవ్వునిభావం గ్రహించిమంద హాసం చేసింది. పరస్పర మందహాసంలోని పరమార్థం నారదుడు గుర్తించాడు. గంగా గర్వభంగం జరుగుతుంది. నీ అక్కగదా అని విచారిస్తావా? అని మృత్యుంజయుడు నవ్వితే, అహంకార భంజనం అవశ్యకర్తవ్యం. అలాగేచేసి అనుగ్రహించండి అని పార్వతి నవ్వింది ఈ హాసం సాకుగా, కలహప్రియుడు గంగాదేవిని ఘనంగా స్తోత్రం చేశాడు. దాంతో ఆమె మిన్నూ, మన్నూ ఏకం చేస్తుందా అన్నట్లు పొంగిపోయింది.

## అవతరణ దృశ్యం

ఈ మహాద్భుత సంఘటనం తిలకించి ఆనందించటానికి సురానీకం విమానాల్లో ఆకాశం నిండిపోయింది. భగీరథుడు దండ కమండలంకృత ధారియై, "నేటికి నా పితరులు ఉత్తమలోకం పొందే అవకాశం వచ్చింది. బ్రహ్మ మహేశ్వర గంగలు అనుగ్రహించారు" అనే సంతోషం నయన ద్వయంలో నర్తిస్తుండగా, ఆకసంవైపు శిరమెత్తి చూస్తున్నాడు. పార్వతి, హాలహలపానంచేసి, అనంతజీవకోటి ఆక్రందనంబాపిన తన ఆత్మేశ్వరుడు భక్తపరాధీనుడై, ఉల్లోలకల్లోలంగా విజృంభించి, ఉచ్ఛృంఖల విహారంతో ఉరీతలాన్ని అంతం చేయటానికా? అన్నట్లు వస్తున్న గంగను శిరఃస్థల జటాజూటంలో ధరించి, ప్రళయం నివారించి, ప్రమోదం ప్రసాదిస్తున్నాడు అని భర్తవంక తనివితీరని వీక్షణ సందోహంతో చూస్తున్నది.

వృషభరాజు, మెడలోని చిరుమువ్వలు మాటిమాటికీ మ్రోగి కర్ణానందం కల్పిస్తూండగా "తన ఏలిక పద్నాల్గు లోకాలకు పరమానందం చేకూర్చే మహాకార్యం చేస్తున్నందుకూ, ఆ దేవాదిదేవుని అనుక్షణం వహించి సేఃస్తున్న తన జన్మసార్థక్యానికీ, నేత్రాలవెంట ముత్యాల వరుసల్లాగా, సెలయేటి బిందువుల్లాగా సంతోషాశ్రువులు రాలుస్తూ స్వామిని చూస్తూ పరవశుడౌతున్నాడు.

చండీశ్వర, భృంగీశ్వరాది భూతగణం ఫాలభాగంలో, మూడురేఖల విభూతిమధ్య భ్రుకుటి పైభాగాన లలాటనేత్రం దిద్ది, దీర్ఘంగావున్న జడలను పైకెత్తి తల కుడిభాగంలో ముడివేసి, శరీరమంతా భస్మోద్ధూళనం చేసి, రుద్రాక్షమాలలు గళంనిండా, కరములనిండా ధరించి, కరివ్యాఘ్ర చర్మాలు జఘనభాగంపై దాల్చి, మృదంగ, ఢమరు, గోముఖ, శంఖాది తూర్యత్రికాలను వాయిస్తూ "ఓం నమశ్శివాయ, ఓం నమశ్శివాయ" అని బిగ్గరగా ఉచ్చరిస్తూ, ఒడలు తెలియని ఆవేశంతో, అర్ధనిమీలిత నేత్రాల్తో బృందనృత్యం చేస్తున్నారు. నారద తుంబురులు వీణావాదనంచేస్తున్నారు. ఇంద్రుని సుధర్మపీఠం కదలివచ్చింది. ఋషులు "జయజయ మహాదేవ శంభో! భువనత్రాణ పరాయణ! పర్వతరాజనందినీ హృదయాంగణ పరినర్తితమయూర! భక్తజన నేత్రానంద చకోరచంద్ర! సంస్మరణమాత్ర

సకలాభీష్టప్రదాన! హే మృత్యుంజయ! నమస్తే నమస్తే నమః" అని నుతిస్తున్నారు.

రంభా, ఊర్వశీ, మేనకా, మంజుఘోషా, ఘృతాచీ, తిలోత్తమా మొదలైన దేవవేశ్యలు, జంత్రవాద్యానుకూలంగా, చేతికంకణాల నాదానికి కాలిగజ్జెల సవ్వడి లయబద్ధం గావింపగా, ఆడుతున్నారు. పాడుతున్నారు. అష్టదిక్పాలకులు "నమశ్శంకరాయచ, కాలాయచ, రుద్రాయచ, నమశ్శంభవేచ, శశిధరాయచ, కృత్తివాసాయచ, మృత్యుంజయాయచ, నమః ఓం" అని పంచామృతములతో, కల్పప్రసూనాలతో అభిషేకింపగా, సర్వం త్యాగంచేసి, దిగంబరుడైన మహాకాలుడు, వామపాదం ముందుకుచాచి, వామ దక్షిణహస్తాలు కటిప్రదేశంపై ఉంచి, గర్వాంధీభూతచేతస్కురాలైన గంగా దేవి రాకను గమనిస్తున్నాడు.

ప్రవాహం శరీరంగా, సుడులు నాభిగా, చేపీసలు కన్నులుగా, తాబేళ్ళు చీలమండలుగా, శంఖాలు కంఠంగా, పద్మాలు పాదాలుగా, తూడులు బాహువులుగా, నురుగు దరహాసంగా, తుమ్మెదలు వేణీభరంగా, ధవళిమ వస్త్ర కంచుకంగా, ముత్యాలు తారహారంగా. సౌందర్యం తనకంటె భిన్నంగా లేదన్నట్లు, సర్వాంగ సుందరియై, సర్వాభరణ భూషితయై, పరమేశ్వర సంభావనకు అసూయచెందిన దానివలె పొంగి, మూర్ఛిల్లుతూ, శిఖరాగ్రంనుంచి నేలకు దూకుచుండంగా, చేతులుచాచి, అధోముఖంగా, అభంగ తరంగ రంగత్ప్రికాశంతో దెసలావరింప అవతరణం చేసింది.

ఆమె రాకను హర్షిస్తున్నట్లు వ్యోమకేశుడు జటాభాగం సడలించాడు. ప్రవాహ వేగంలో, సుళ్ళుత్రిప్పుల్లో ఎంత ఘనపదార్థాన్నైనా అవలీలగా కొనిపోయే గంగ ఈశ్వర జటాజూటంలో ఇరుక్కొనిపోయింది. ఇద బంధించాడు శితికంఠుడు. ఆ ముడిదాటి అవనికి అవతరించలేక ఆక్రోశించింది. ఆర్తనాదం చేసింది. "అడియేన్ దాస దాసోహం" అన్నట్లు అంగలార్చింది అనిమిషులు ఆ దృశ్యంచూడలేకా, మహాకాలుని భయంకర స్వరూపం సమీపించలేకా, నిమిషులు (మర్త్యులు) అయ్యారు. నందీశ్వర భృంగీశ్వరాది భూతగణం పరమేశ్వరదివ్యలాసానికి పరవశించారు. పార్వతి "రక్షమాం రక్ష, జగద్రక్ష, శూలపాణి, త్రినయని, శంకర ప్రభో

ప్రభో! పాహిపాహి" అంటూ అహిసర్పత్పాదుని రెండు పాదాలు రెండు చేతులతో గట్టిగా పట్టుకుంది.

ఆసన్న కాలంలో రాలనున్న పండు వాయువశంచేత నదిలో పడి మునిగినప్పటి క్షుధార్తుని మానసాన్ని, ద్విగుణీకృతంగా జ్ఞాపకంచేస్తూ, భగీరథుడు విలవిలలాడిపోయాడు. కింకర్తవ్యతామూఢుడైనాడు. పితరులకిక దుర్గతులేశరణ్యమని వాపోయాడు. తనజన్మమింక నిరర్థకం అనుకున్నాడు. తపోగ్నిలో తనదేహం సమిధగా చేద్దామని సంకల్పించాడు. అంతలో "ఆగు, ఆగు భగీరథా! నిరాశా నిస్పృహలను పొందకు. శంకరుడు అఘ నాశం కరుడు. భక్తవశంకరుడు. లోకక్షేమంకరుడు, శుభంకరుడు. ఆ యోగీశ్వరేశ్వరుని శరణుపొందు. నృసింహునిశాంతింపచేయుప్రహ్లాదునివలె నీవూ సర్వభూతేశుని శాంతింపచేయగల శక్తిమంతుడవు" అంటూ అశరీర వాణి అభిభాషించింది.

సాగరగర్భం నుంచి వెలికివేసిన శామాన్య ప్రాణివలె పునర్జీవుడై, "జయజయ పరమశివ! ఈశా! మహేశా! గిరీశా! హృషీకేశసంభావ్యమానా నిధానా! నిదానా! మహాదేవ! దివ్యత్రిభావా! పాహిమాం పాహిమాం పాహి" అంటూ వత్సరకాలం ధ్యానించాడు. అతని భక్తిశ్రద్ధలకు ఉమాపతి మెచ్చి, ముడివిన జడ సడలించి "బిందు సరోవరం"లో విడిచాడు. పతి జటాజూట నిర్గతమైన గంగాభవాని, హ్లాదిని, పావని, నళిని, అనే పేరులతో మూడుపాయలై తూర్పుదెసగా ప్రవహించింది. సుచక్షువు, సీత, సింధువు అన్న నామాలతో మూడుపాయలుగా పడమరగా నడిచింది. ఏడవపాయగా రాజర్షిననుసరింప, అతడు రథారూఢుడై ముందు చన, భూమిపై పయనించింది. ఒకచోట రాగవతె, ఒకచోట మూగవతె, ఒకచోట గభీరవతె, ఒకచోట సాధ్వివలె, ఒకచోట భోగినివలె, ఒకచోట త్యాగినివలె, ఒకచోట నర్తకివలె, ఒకచోట వక్రవలె, ఒకచోట నితంబినివలె, పరువెత్తును. ధ్వని మానును. నడచును. నిండుగ నుండును. సర్వముఆక్రమించును. సర్వము పరిత్యజించును. విలాసముగ నర్తించును. వంకర వంకరలుగపోవును. ఒడుదుడుకులులేక మందముగ గమించును.

భగీరథ ప్రయత్నంలో ఆకాశం నుంచి ధరణికి దిగిన గంగ, జల

రూపిణిగా పారినవెంటనే త్రిలోకవాసులు తృప్తితీర స్నానం చేశారు. పానం చేశారు ఆచమించారు. వార్చారు. పాపులు గతపాపులైనారు. రోగులు నిరోగులైనారు. రాజర్షితో పోతున్న గంగను దేవతలు వెంబడించారు. ఆమె ఈశ్వర బంధంనుంచి విముక్తురాలై, పడినబాధ మరచి పరవళ్ళు త్రొక్కుతూ, జహ్నుముని యజ్ఞవాటిక ముంచింది. ఆ ముని ఆగ్రహించి వక్త్రగహ్వరంలో ఆ జలాన్ని ఇంకింపచేశాడు. సురలూ మునులూ ఆతణ్ణి వినుతించి "ఇకముందు గంగ నీ కూతురుగా పిలవబడుతుంది. భగీరథుని కోర్కె తీర్చ"మని కోరారు. వారి మాటలకు ఆమోదించి చెవిరంధ్రం ద్వారా బహిర్గతం చేశాడు. అటునుంచి "జాహ్నవి" పేరుతో అబ్ధిలోచొచ్చి, సాగరుల బూడిద కుప్పలపై ప్రవహించి వారికి ఉత్తమగతులు కల్పించింది.

చతుర్ముఖుడుకృతార్థుడైన భగీరథుని ప్రశంసించి, "మీ పూర్వులు, సాగరులు జలాభావం పొందనంతవరకూ, సౌరమండలంలో సర్వసుఖాలు అనుభవిస్తారు. గంగ "భాగీరథీ" పేరుతో నీకు కూతురుగా వ్యవహరిస్తుంది. సత్సంతానసంతుడవై, ఆచంద్రభాస్కరంగా కీర్తితో ధరణి పాలించి సురలోకంలో సుప్రతిష్ఠుడవు కమ్ము" అని ఆశీర్వదించి అరిగాడు. రామా! గంగావృత్తాంతం ఆనుపూర్విగా నీకు చెప్పాను. ఈ గంగాచరిత్రం విన్నా, చదివినా, వ్రాసినా, సమస్తపాపాలు హరింపునై. సర్వసుఖాలు సమకూరునై" అని ముగించాడు. రామలక్ష్మణులు ఆ ముని కంఠీరవుణ్ణి అనేక విధాల పొగడి ఆనందంగా ఆ రాత్రి గడిపారు.

పదమూడోనాడి వేకువన, కృతకర్ములై, గురునిచేరి "స్వామీ! మీరు వచ్చిన సంగతి ఎఱిగిన మహర్షులు, ప్రయాణోచితంగా అమర్చిన ఓడ తీరానికి పంపి మీ కోసం వేచివున్నారు. సెలవేమి?" అనగానే, గాధిజుడు ముని సహితుడై తరణిని అధిరోహించి ఆవలి తీరం చేరాడు. తీరం నుంచి, ఫల వృక్ష లతా గుల్మాదులతో సాంద్రమై, విశాలములై, ఎత్తైన మేడల వరుసలతో ప్రకాశవంతమై, పథికజనులకు పరమానంద కారణమైన "విశాలా" నగరం ప్రవేశించారు. ఆ పట్టణ రామణీయకానికి మెచ్చి, రామచంద్రుడు మునిచంద్రునితో ఈ పురగాథ చెప్పమని కోరాడు.

## విశాలానగర గాథ గాధేయుడు చెప్పుట

విశ్వామిత్రుడు ఆ పట్టణ పూర్వోత్తరాలు, మధురభావాలతో, సరళ పదాలతో సరసార్థాలతో, చమత్కారంగా, శ్రోతలు పురోగాములుగా, విని పించసాగాడు. "కకుత్స్థవంశమండనా! దుష్టదైత్యదండనా!

కృతయుగంలో దైత్యులు, ధర్మకర్మ పరిరక్షకులై, శౌర్యవంతులై దేవతల్ని లెక్కచేయక ఇష్టానుసారం భోగాలు పొందుతున్నారు. అందుకు అసూయపడి, మర్త్యభావం వదలి అమర్త్యులుకాగోరి పాలకడలి చిలికి, అమృతం పొంది హాయిగా బ్రతుకుదామని దేవతలు ఆలోచించారు.

హిమశైలం నుంచి ఓషధులను తెచ్చి పాలసముద్రంలో పడవేసి, మంధరపర్వతాన్ని కవ్వంగా,వాసుకి అనే సర్పరాజును త్రాడుగాచేసిమథించ సాగారు. ఈ సంగతి దానవులు తెలిసికొని మేంకూడా లాగుతామన్నారు. బలవంతులైన వారితో విరోధం ప్రమాదమని దేవతలు శిరస్సు మీరూ,తోక ప్రక్క మేమూ నిల్చి చిలుకుదామన్నారు. వారు అంగీకరించారు. (ఇది పదార్థసంయోగంతో చావులేని ఔషధం సృజించే ప్రక్రియ.)

బహుకాలం దేవదానవులు క్షీరాబ్ధిమథనం సాగించారు. ఈ సవ్యాప సవ్య పీడనానికి సహించలేక వాసుకి క్ష్వేళం [విషం] వెడలగ్రక్కి, చేతనా చేతనముల భస్మీభూతం చేయసాగింది. ఆ కాలకూట మహాగ్నిజ్వాలలకు సహింపలేని దేవతలు, శూలపాణినిచేరి, "ప్రభూ! రక్షించు రక్షించు. ఈ ఘోరవిషం అలసిస్తే లోకాన్ని దహిస్తుంది. ఆపన్నులం" అంటూ శరణు వేడారు. అదే సమయంలో శ్రీవిష్ణువువచ్చి "ఈ ఉపద్రవం నీవేతప్ప దాటించే వారు లేరు. దేవతాకోటికి పెద్దవుకావున, అగ్రపూజగాగొని అనుగ్రహించ" మని తిరోహితుడయ్యాడు. సకల జీవశరణ్యుడైన ఫాలలోచనుడు, భక్త లోకాభయప్రదాన ప్రశస్త దక్షిణ హస్తాన్ని చాచి, అరచేతిలోనికి హాలా హలాన్ని ఆకర్షించి, అల్లోనేరేడుపండువలె నోటిలో వేసుకున్నాడు. గర్భస్థవిశ్వం అల్లకల్లోలమై, "హరహరా! మ్రింగవద్దు. మ్రింగవద్దు. బీజ రూపంగా వున్న అంతర్విశ్వం నశిస్తుంది. ప్రభూ! కర్తవ్యం ఆలోచించ" మని ఆఘోషించింది. అదిదేవుడు మ్రింగక, విషాన్ని కంఠస్థంచేసి, విశ్వశాంతి వెలయించి కైలాసానికి వెళ్ళాడు. పిమ్మట దేవాసురులు విడవకుండా త్రచ్చ

సాగారు. ఆ వేగంలో పర్వతం తూకం చెదరి సముద్రంలో మునిగిపోతూంది. శ్రీ విష్ణువు కూర్మమై అవతరించి, నీటిలో మునిగి, వీపుపై దాల్చి పైకెత్తగా, మళ్ళీ త్రిప్పజొచ్చారు.

వేయేండ్లు గడచినాయి. ఆయుర్వేద విశారదుడైన "ధన్వంతరి" దండ కమండలుధారియై పుట్టాడు. అనంతరం త్రిజగన్మోహినులైన అప్సరసలు జన్మించారు. సురాసురలు వారిని గ్రహింపక పోవటంతో స్వేచ్ఛాచారులైనారు. జలాధిదేవతయైన వరుణునిపుత్రిక వారుణి "సుర" పేరుతో కలిగింది. దానవులు నిరసించగా దేవతలు గ్రహించి సురలైనారు. దానవులు నిగ్రహించి అసురులైనారు. పిదప "ఉచ్చైశ్రవం" ఉద్భవించింది. "కౌస్తుభం" అనే రత్నం, "అమృతం" అనే మహారసం పొడమింది. ఆ అమృతంకోసం దేవదానవులు ఘోరంగా పోరాడుకున్నారు. ఇరు వాగులలో అసంఖ్యాకంగా మరణించారు. దుర్వారులైన అసురులు అమృతభాండం హరించారు. విష్ణువు మోహినియై, దానవుల వంచించి, పీయూషం దేవతలకిచ్చాడు. దాని సేవించి దైత్యుల నిర్జించి స్వర్గం ఇంద్రుడు తిరిగి సాధించాడు.

కశ్యప ప్రజాపతి రెండవభార్య దితి, కొడుకులపాటుకు వ్యథచెంది, భర్తనుజేరి, ఇంద్రుని జయించే పుత్రుణ్ణి ఇమ్మని కోరింది. కడుపు స్పృశించి, మంత్రోపదేశం చేసి తపస్సు చేసుకుందానికి వెళ్లాడు. ఆమె దీర్ఘకాలం వ్రతం సాగించింది. ఇది తెలిసిన వృత్రారి శుశ్రూషనెపంతో పినతల్లిని సేవిస్తూ, అనాచారసమయం గుర్తించి గర్భంలో ప్రవేశించివజ్రాయుధంతో పిండాన్ని ఏడు శకలాలుగా ఛేదించాడు. ఛేదనకాలంలో శిశువులు రోదనం చేస్తుండే, ఇంద్రుడు "మారుద, మారుద" అంటుంటే, నిద్రలేచి దితి శక్రుని క్రూరత్వానికి శపించబోయింది. ఆమెను సమ్మతిపరచి, సప్త మరుత్తులుగా పేర్కొని, ఇంద్రోడువాయుపథాల [ఇంద్రపథం, ఉడుపథం, వాయుపథం] జేష్ఠానుపూర్వంగా సంచారార్హత కల్పించి, మిగిలిన నల్గురినీ తన అధికారంలో వుంచుకున్నాడు. ఈ ప్రదేశం పినతల్లి దితిని సేవిస్తూ ఇంద్రుడు నివసించింది. ఈ నగరం, ఇక్ష్వాకుపు "అలంబుస" భార్యగా "విశాలు"ని గాంచెను. ఆయన దీని నిర్మించెను. అందుచే ఇది "విశాల" అయింది. విశాలునకు "హేమచంద్రుడూ", అతనికి "సుచంద్రుడూ", వానికి

"ధూమ్రాశ్వుడూ", అతనికి "సృంజయుడూ", అతనికి "సహదేవుడూ", వానికి "కుశాశ్వుడూ", అతనికి "సోమదత్తుడూ", వానికి "కకుత్థ్సుడూ", అతనికి "సుమతి" వంశవర్ధనులై జన్మించారు. వర్తమానంలో సుమతియే పాలిస్తున్నాడు.

రామభద్రా! ఈ రాత్రి ఇచ్చట గడిపి, రేపు మిథిలానగరం వెళ్ళుదాము. ఈ వైశాల ప్రభువులు పూర్వంనుంచీ, ధర్మార్థకామాలను విధివిహితంగా అనుభవించి, కీర్తిమూర్తులైనారు. విన్నావుగదా విశాలనగర వృత్తాంతం" అంటూండగానే, సుమతి మంత్రి పరివారసహితుడై వచ్చి, కౌశికుని దర్శించి, నగరానికి ఆహ్వానించాడు. మునులతో,రామలక్ష్మణులతో రాజగృహం ప్రవేశించి, ఆతిథ్యం స్వీకరించారు. అనంతరం ఉభయులూ ఇష్టాగోష్ఠి సలిపి, సూర్యచంద్రులవలె, అశ్వినీ కుమారులవలె, నలకూబర జయంతులవలె వెల్గుతున్న రాకుమారుల చరిత్ర మహర్షి చెప్పగా విని, రాజోచిత సత్కారాలతో వైశాలికుడు పూజించాడు. గాధేయునిచే వినుచున్న అపూర్వగాథలు అన్నదమ్ములు మరల మరల గుర్తు తెచ్చుకుంటూ సంతోషంతో శయనించారు.

వచ్చాల్గో దినం, ప్రభాతమలయమారుత సంస్పర్శచే సోదరులు మేలుకాంచి, స్నాతులై, గురుదేవుడు ఉపదేశించిన మహామంత్రముల జపించి, దేవప్రీతిగ తర్పణంచేసి, మునులతో కూడి విశాలనగరం దాటి పోయి మిథిలానగర సమీప ప్రవేశంచేరి, తపోవనాన్ని, అందు నిర్జనంగా వున్న సుందర ఆశ్రమాన్ని చూచి, గురుదేవుని, ఏతద్వృత్తాంతం తెలుప వలసిందిగా వేడుకున్నారు. ఆ కుమారుల ఆసక్తికీ, ఓపికకూ, ఎంతో మురమంది, గడ్డం సవరించుకుంటూ, మందహాసం చేసి మొదలుపెట్టాడు.

## గౌతమాశ్రమ కథనం

"వత్సలారా! ఈ ఆశ్రమం గౌతమ మహర్షిది. ఆయనకు సాటి చతుర్ముఖు డొక్కడే. అపూర్వ సౌందర్యరాశియైన అహల్యపత్నిగా, గతించిన కాలం గణనకందకుండగా తపస్సమాధిలో నున్నాడు. తపస్సిద్ధిపొంది మహర్షియై లోకసంగ్రహార్థం గృహస్థజీవితం కొనసాగిస్తూ,నిత్యనైమిత్తిక అనుష్ఠాన, అగ్నిహోత్రాది విధుల తీరుస్తూ కాలం గడుపుతున్నాడు.ఒకనాటి

ఉషఃకాలంలో స్నానార్థం సమీప నదీతీరానికి వెళ్ళాడు. ఆ సమయంచూచి ఇంద్రుడు గౌతముని వేషం ధరించి గృహకృత్యానికి ఉపక్రమించే అహల్యను చూచి "ప్రాణేశ్వరీ! ఏలనో మదన క్రీడయందు వాంఛ జనించె. సత్వరము నా కోరిక తీర్పు"మని కోరాడు. ఆ తపస్విని గౌతమాకారంతో వచ్చినవాడు సురరాజని గుర్తించి, అధర్మమని యెరిగీ, అతని కోరిక మన్నించింది. చేసిన పని చెడ్డదైనా, వెంటనే వెడలిపొమ్మని ఇంద్రుని తొందరపెట్టింది. అతను మునిరాకముందే పోదామనుకొనుచూ ద్వారం సమీపించేసరికి గౌతముడు రానే వచ్చాడు. తేజస్సు ముందు తిమిరం నిలువగలదా. స్మరణమాత్రం సర్వం గ్రహించి ఇంద్రుని వృషణహీనుడవు కమ్మని, అహల్యను "పెక్కేండ్లు గాలితింటూ, అన్నోదకాలకు దూరమై, పెనుతాపంతో ఎవ్వరికీ కనరాకుండా, బూడిదెలోపడి జీవించు. ఏనాడు దాశరథి ఈ ప్రదేశంలో ప్రవేశిస్తాడో, ఆనాడు నీవు గతకల్మషవై, పూతవై, అతని అర్చించి, అనుగ్రహింపబడతావు. నా సహధర్మచారిణిగా గ్రహించటానికి అప్పుడే వస్తా"నని ఆగ్రహంతో శపించి వెళ్ళాడు.

## అహల్యా శాపవిమోచనం

గౌతమమహర్షి శాపంతో ముష్కహీనుడైన సురపతి సిగ్గుతో స్వర్గానికి వెళ్ళి, దిక్పాలకులనూ, పితృదేవతలనూ, మహర్షులనూ రావించి, తన కష్టగాథ వెళ్ళబోసుకున్నాడు. దేవకార్యార్థం గౌతమ ముని తపోభంగం కోసం ఆకృత్యానికి పాల్పడవలసి వచ్చిందని వాపోయాడు. అంగహీనత దుస్సహం అని అర్థించాడు. వారందరూ దీర్ఘంగా ఆలోచించి, పితృదేవతలకని, మీరు నాకపతిని అంగవంతునిగా చేయండని కోరారు. వారు, అజాండము [మేకవృషణాలు] లను తెచ్చి, శస్త్ర చికిత్సద్వారంగా అతికించి, "ఏమేక పుట్టుకతో అంగహీనంగా పుట్టి యజ్ఞార్పణం గావింపబడుతుందో దానిని హవిస్సుగా గ్రహించి, పుణ్యలోక ప్రాప్తి కలిగించాలని నిర్ణయించి, ఆ విధంగా చేసి పురందరుణ్ణి సొంపునిగా చేశారు. [ఇది వేదంలోని శస్త్రచికిత్సకు సూత్రప్రాయం] మీరు కోరిన ఈ ఆశ్రమ చరిత్ర వినిపించాను. ఇక ఆశ్రమం చూచి మిథిలకు పోదాం పదండి" అంటూ అహల్య అదృశ్యంగా వున్న చోటికి దారితీశాడు. అందరూ మహర్షిని అనుసరించారు.

రాముడు ఆ ప్రదేశంలో కాలు మోపిన వెంటనే దిగ్భ్రాంతు డైనాడు. "అహో! ఈమె ఎంత తపస్విని! ఎంత సౌందర్యవతి! ఇంత మహాసాధ్వి భర్తృశాపానికి గురికావటం విధిబలీయం కావటంచేతనేకదా? ఈమెను గృహస్థ ధర్మంలో పుండగా దర్శిస్తే, మాతృదేవతగా నన్నెంత ఆదరంగా చూచేదో, ఆతిథ్యం ఇచ్చి ఎంత లాలించేదో" అని మనసులో అనుకున్నాడు. అంతవరకు లోకానికి అదృశ్యంగా, శాపాహతివల్ల తేజం కోల్పోయి, పశ్చాత్తాపంతో, క్రుంగి, కృశిస్తూన్న అహల్యను ఏదో దివ్యశక్తి స్పృశించింది. జడమైన మనస్సు చైతన్యవంతమైంది. పోయిన ఆత్మశక్తి పునః ప్రవేశం చేసింది. దీర్ఘనిద్రలో నుంచి హఠాత్తుగా మెలకువవచ్చినట్లు లేచి "హృదయేశ్వరా! మహాతపస్వీ! అపరాధిని క్షమించు" మంటూ ఆశ్రమంలోకిపోతూ, మునిసహితుడైన విశ్వామిత్రుణ్ణి పరాశక్తి ప్రతిరూపులైన రామలక్ష్మణులను జూచింది. గతం దీర్ఘ విస్మృతి అయింది. అగ్నితప్తమై పునరాకారం పొందిన జాతవా పసిండివలె భాసిల్లింది. ఆత్మశక్తితో అన్నీ కల్పించి, అర్ఘ్యం, పాద్యం, ఆసనం సమర్పించింది. ఆనందంతో ఆతిథ్యం ఇచ్చింది. ఆ వేళకు గౌతముడు వచ్చి, రామునీ కౌశికునీ పూజించి అహల్యను స్వీకరించి, తిరిగి తపస్సు చేసుకుంటానికి హిమశైలానికి వెళ్లాడు. అనంతరం రాకుమారులూ, మునీశ్వరులూ, అనుగమింపగా గాథేయుడు మిథిలకు ప్రయాణించాడు.

## శ్రీరామాదులు మిథిలకు పోవుట

గౌతమాశ్రమం గమించిన దాశరథులు, పల్లెలు, జనపదాలు, నగరాలు దాటుతూ, ప్రకృతి శోభను అచ్చెరువుపడుతూ, కౌశికుని ఆదరాన్నీ, అమృత వాక్కులనూ చూరగొంటూ, క్రమంగా, మిథిలానగర పరిసరాల్లో నిర్మించిన సవనవాటికకు, ఈశాన్యదిశగా పయనించి చేరుకున్నారు. ఆ క్రతుశాల నిర్మాణానికి ఎంతో ముగ్ధులయ్యారు. "అహో! ఎందఱు ఋత్విక్కులు! ఎన్ని శకటాలు! ఎన్ని పరికరాలు! ఎన్ని ఘృతభాండాలు! ఎన్ని సమిధల గుట్టలు! ఎందరు ఋషులు! ఎంత పరివారం! ఎంత యాతాయాత జనసంకుల కలకలం! గురుదేవా! ఇచ్చట మనమెక్కడ నివసించాలి? కాలాతిక్రమణం లేకుండా కర్మలు ముగించాలికదా" అన్నారు.

"తూర్పుగా తటాకం వుంది. అక్కడ నిశ్శబ్దంగా వుంటుంది. మనం వెళ్ళి ఆహ్నికాలు తీర్చుకొని విశ్రాంతినిపొందుదాం" అంటూ కౌశికమహర్షి కదలబోతుండగా, ఆయన రాక ఎఱిగిన జనకుడు, రాజపురోహితుడూ, అంతరంగికుడూ అయిన "శతానందు"ని గూడి ఆహ్వానించుటకై అక్కడికి వచ్చాడు. ఆయన వెనువెంట భూసురలు చనుదెంచి సశాస్త్రీయంగా వారందరినీ అర్చించి, ఆతిథ్యం స్వీకరించమన్నారు. జనకరాజు "కౌశిక మహర్షి పుంగవా! దయచేసి, యజ్ఞవాటిక దర్శించి, మునిజన మండలికై ఏర్పరచిన ఆసనం స్వీకరించండి" అని కోరాడు. ఆ తర్వాత వారిట్లు సంభాషించుకున్నారు.

కౌశి: రాజశ్రేష్ఠా! సకుటుంబ పరివారంగా క్షేమమేకదా? క్రతువు నిర్విఘ్నంగా సాగుతున్నదా? రాజ్యం సర్వ సుభిక్షంగా వున్నదా?

జన: మీ దయవల్ల అంతా కుశలంగానే వున్నారు. ప్రజాక్షేమంకోసం "సంపన్నం" అనే సప్తతంతు ప్రారంభించాను. ఇంతవరకు సవ్యంగానే సాగింది. మీ వునికి పొత్తిగా తెలియటంలేదు. మీరు సిద్ధాశ్రమంలో వుంటున్నారని తెలిసి, ఆహ్వానం పంపాను. కానీ, మీరు అయోధ్య కేగినారని వారు తిరిగివచ్చి చెప్పారు. పోయిన పని నెరవేరిందికదా?

కౌశి: ఆశించిన దానికంటే అధికాధికంగా పూర్తయింది.

జన: సంతోషం. అపరసృష్టికర్తలు. మీరు తలంచిన కార్యం ఆగుతుందా? పూజ్యులు దశరథ మహారాజు కుశలమేనా? వసిష్ఠవామదేవులు సుఖులై యున్నారనుకొందును. ఈ కుమారులెవ్వరు? సర్వలక్షణ లక్షితులూ, స్వభావప్రసన్నులూ, మనోహర మూర్తులూ, క్షత్రియ వేషధారులూ, ధనుష్పాణులూ, వినయ సంపన్నులూ తమ శిష్యులగుదురా? దయతో సెలవిండు.

కౌశి: చక్రవర్తీ! ఈ బిడ్డలపట్ల నీవు పేర్కొన్న విశేషణములు అతి సామాన్యములు. వీరు దాశరథులు. పుత్రకామేష్టిలో ప్రాజాపత్య పురుషుడు మెచ్చి ఇచ్చిన పాయస ప్రభావాన జన్మించినారు. నేను సంకల్పించిన సవన రక్షణార్థం తండ్రి పంపున వచ్చారు. తొమ్మిది మారులు విఘ్నమైన క్రతువు ఈ చిన్నవారు, మారీచ సుబాహుల

దండించి పరిపూర్తి చేయించారు. దారిలో, లోక భీకరమైన తాటకను చంపారు. మునులు చెప్పగా విని, నాతోవచ్చి నీ యింటనున్న శివ ధనువును చూడముచ్చట పడగా నేనే వీరిని వెంటతీసుకునివచ్చాను వస్తూ విశాల నగరాన్ని, గౌతమాశ్రమాన్ని చూపించాను. అక్కడ అహల్యా గౌతమర్షుల ఆతిథ్యంపొంది, మీ సవనవాటికి వచ్చి అఖండ స్వాగతం అందుకున్నాం.

ఆ చివరి మాటలు ఆలకించిన శతానందుడు, కుశికనందనునిచూచి, "పూజ్యుడా! దుస్సహంబైన మాఆశ్రమానికివెళ్ళారా? అక్కడ, చిరతపస్వి నాతల్లి సాకార అయినదా? ఈ మహాభాగునికి, ఈ సర్వదేహ పూజార్హునికి నా జననిని చూపినావా? ఆమె విగత విస్మృతియై ఈరాజలోక సుధాకరుని సత్కరించిందా? బ్రహ్మ సన్నిధుడు నా తండ్రి గౌతమ మహర్షి, ఆప్యాయంగా నా మాతృదేవిని మరల గ్రహించి ఈ పూజ్యుని అర్చించి అనుగ్రహింపబడ్డాడా?" అని ఆసక్తితో అడిగాడు.

మౌనిమందారమైన విశ్వామిత్రుడు శతానందునిచూచి, "పూజ్యుడా చేయవలసిన పనులన్నీ సమయం మీరకుండా పూర్తి చేశాను. పరమ సంతోషంతో నీ తలిదండ్రులు కలిసికొన్నారు. భక్తిభావంతో మమ్ములను సంప్రీతులుగాచేశారు" అని సమాధానం చెప్పాడు.

మహర్షి పల్కిన ప్రతి అక్షరం కర్ణపేయంగా, అహల్యా కుమారుడు భక్తి తాత్పర్యాలతో శ్రీరాముని తిలకించి "రామచంద్రా! మా అదృష్టంకొద్దీ ఈ దేశం వచ్చావు. నీ రాకతో మేం ధన్యులమైనాం. మీ గురుదేవులెంత గొప్పవారో నీకు తెలియచెపుతాను విను. ఈ పూజ్యుడు పూర్వాశ్రమంలో క్షత్రియ ధర్మాన్ని అనుసరించి రాజై అవక్రవిక్రమంతో అసంఖ్యాక సంవత్సరాలు పాలించి, తరుగని కీర్తి నార్జించాడు. ఒకానొక సమయంలో సకల సేనాపరివార సహితుడై ప్రజాక్షేమం తెలుసుకుంటూ విశ్వమంతా సంచరించాడు. ఆ సంచార కాలంలో వసిష్ఠాశ్రమానికివచ్చాడు.

## వసిష్ఠుడు గాధేయునకు విందుచేయుట

ఆ ఆశ్రమ ప్రశాంతత, ఆ ప్రకృతి శోభా, ఆ నిర్మలత్వమూ, ఆ కాలాతిక్రమణ జరుగని కర్మాచరణమూ, ఆ శ్రుతి దర్శనమూ, (ఆ

అజ్ఞానలోక సముద్ధరణకై శాస్త్రాది గ్రంథ రచనమూ) ఆ అన్యోన్యాభేద జీవన విధానమూ, ఆ అపార మేధా విభవమూ, ఆ అచంచలతపస్సంపదా, ఆ జీవకారుణ్యమూ, ఆశిష్యవాత్సల్యమూ, గాధేయునికి పద్నాల్గులోకాలను ఒక్కమాటు స్ఫురింపచేసి, తానింతకు పూర్వం చూచిన నగరాలుగానీ, ఆశ్రమాలుగానీ ఇంత సంతృప్తిని కలిగించలేదు. ఈ ఆశ్రమం ప్రత్యేకత ప్రశంసాపాత్రంగావుంది. ఒక్కొక్క వృక్షచ్ఛాయలో, చెట్టు మూల స్థానంలో వేదికా, వేదికపైన కుశాసనం, దానిపై కాషాయ వస్త్రం, దానిపై ఆచార్యులూ, వామహస్తంలో భూర్జపత్రాల గ్రంథం, దక్షిణ హస్త విన్యాసంతో వ్యాఖ్యానం, అధికారక్రమంలో శిష్యులు కూర్చుండి పఠించడం, వనమయూరాలూ, చిలకలూ, హరిణాలూ స్వేచ్ఛగా, నిర్భయంగా సంచరించటం, దారితప్పి వచ్చిన క్రూరమృగాలు అటూ యిటూ తిరిగి, తమ దారిని తాముపోవటం చూచాడు. అశ్లీల భాషణం, అపశబ్దోచ్చారణం, అసంగత కాలక్షేపం, అనుచిత కార్యక్రమం అక్కడ కనుపించలేదు. ఆయనపొందిన ఆనందానికి హద్దులేదు. కొంతదూరం లోనికి నడిచాడు.

నానావృక్ష సమాకీర్ణమై, నానావిధ మృగ విహంగమాకీర్ణమై, దానవులూ, దేవతలూ కలిసి నివసించుట కావాసమై, హరిణాది సాధుమృగముల కాలవాలమై, అగ్నికల్పులైన మహాత్ములతోనూ, తపస్సుచే ధన్యులైనవారితోనూ, ఆగతానాగత విదులైన బ్రహ్మర్షులతోనూ, వాయుభక్షకులూ, జలాశనులూ, పర్ణభోజనులూ, ఫలభక్షణులూ, లంబికా యోగనిష్ఠులూ, మునిముఖ్యులైన వాలఖిల్యావాసుదేవాదులూ మొదలైన అసమాన తాపసులతోనూ, పరివేష్టింపబడి, కమలాసనసన్నిభుడైన బ్రహ్మవలె పర్ణశాల ముంగిటనున్న చూతవృక్ష వేదికపై ఆసీనుడైన వసిష్ఠ మహర్షినిగాంచి, పులకితగాత్రుడై తనలో నిట్లు తలపోశాడు.

'అహో! ఏమి ఈ తేజస్సు! సత్యలోకం పరిపూర్ణంగా ఇక్కడ సాక్షాత్కరించింది. నా పరిపాలనలో ఇటువంటి దివ్యప్రదేశం ఒకటి వున్నదనికానీ, ఇంతటి నిగ్రహానుగ్రహ సమర్థులైన ఋషులున్నారనిగానీ నేను కలలోకూడా అనుకోలేదు. నా భాగ్యమే భాగ్యం. ఒక్కసారి ఇంతమంది పరమపూజ్యుల దర్శించి, వారి ఆశీర్వాదాలు పొందనున్నాను.' ఈ విధంగా భావించి, సప్రశ్రయుడై, కృతాంజలియై, వసిష్ఠునికి

సాష్టాంగ దండ ప్రణామంచేశాడు. వచ్చినవాడు గాధేయుడనీ, క్షత్రతేజో బలసంపన్నుడనీ, సర్వంసహా పాలకుడని తెలిసిన వశిష్ఠుడు సగౌరవంగా ఆహ్వానించి, ఉచితాసనుని కావించి, మధురఫల జలాలొసంగి, లఘువుగా ఆతిథ్య మర్యాదలు పూర్తిచేసి ఆశీర్వదించాడు.

కౌశి : మహర్షివర్యా! కుశలమేకదా? తమ నిత్యాగ్నిహోత్రాలకూ, అనుష్ఠాన విధానాలకూ అంతరాయం కలుగటంలేదు కదా? తమసహచర వర్గం శిష్యులూ భద్రంగా వున్నారు కదా? సకాలంలో తరువులుఫలాదుల నిచ్చుచున్నవి కదా? యజ్ఞయాగాదులు నిరంతరాయమేకదా?

వసి: గాధినందనా! "యథారాజా, తథా ప్రజా" అని కదా. మేం ఇలా వున్నామంటే అందుకు మీరే కారణం. మీ పాలనలో లోపంలేదన్న మాట. కుశాన్వయులైన మీకు కొరతలు ఏముంటవి? అందరూ ధర్మ పాలకులే కదా.

కౌశి: మీ వంటి అలౌకిక సంపన్నులూ, పరోపకారపారీణులూ "చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభంభవతు"అని తపశ్శక్తి ధారపోయకపోతే రాజు లెంత ధర్మపరులైనా ప్రజలను రక్షింపలేరు. ప్రకృతి శక్తులను శాసింపలేరు. మీ దర్శనంతో నేను పావనుణ్ణి అయ్యాను. ఇక పోయి వస్తాను. సెలవిచ్చి పంప ప్రార్థన.

## విశ్వామిత్రునకు మహర్షి విందుచేయుట

వసి: రాక రాక వచ్చారు. ఈనాడు మేమిచ్చే సంపూర్ణమయిన ఆతిథ్యం మీరూ, మీ పరివారం గ్రహించి, ఉదయం వెళ్ళుదురుగాని. మీరు కృత్యాలు వెంటనే పూర్తిచేసిరండి.

కౌశి: ఇప్పటికే మీ ఆతిథ్య సత్కారాలతో తృప్తినందాను. చాలాపరివారం వుంది. మీకు శ్రమ కలిగించటం నా అభిమతంకాదు.

వసి: సందేహపడకండి. ఏదో ఆశ్రమవాసులం. యథాశక్తి ప్రభువుకు విందుచేస్తాం. మీరు త్వరలో రండి. ఆలస్యంచేయకు.

గాధినందనుడు చకితుడైనాడు. "ధరించిందిగాక, మరొక్క వస్త్రయుగ్మం లేని సంపద. వీరు నాకెట్లు విందుచేస్తారు? ఐనా చూద్దాం" అనుకుంటూ నిష్క్రమించాడు. పరిజనానికి ఆదేశం పంపాడు. అంతా విస్తుపోతూ భోజనం కోసం దుస్తులు మార్చుకున్నారు.

మహర్షి శబలను పిల్చి "అమ్మా! వచ్చినఅతిథులనుఆనందంగాతృప్తి పరచు" అన్నాడు. సంతోషంతో ఆ రాజపరివారానికీ, రాజకుటుంబానికీ, యథార్థంగా సంకల్పమాత్రంలో సమకూర్చింది. ఒకవంక అరటియాకులలో, పప్పులు, కూరలు, పచ్చళ్ళు, అప్పడములు, వడియాలు, గారెలు, బూరెలు, వెండిగిన్నెలలో పానకం, పాయసం, పులుసు, పెరుగు, వెండి చెంబులలో మంచినీరు, వెండిబిళ్ళలు వేసిన పీటలు అమర్చబడగా, ఇంకొక వంక బంగారు పీటలు, చెంబులు, వెండిపళ్ళాలు, షడ్రసోపేత భోజనపదార్థాలు సమకూర్చబడినై. అతిథుల చెంత దంతపుగజాల తలలపై ఉంచబడి సువాసనలు వెదజల్లుచున్న అగరువత్తులు చుప్పలుతెప్పలుగాకూర్చబడినై. దేవతాంగనలు సవిలాసంగా, కర కంకణ కింకిణీ స్వనంతో, పాదమంజీర ఘల్లులతో, మృదుమధుర సరససంభాషణతో, కొసరి కొసరి వడ్డించగా, మర్త్యలోకం ఇది అని, మానవులం మేమని మరిచిపోయి కంఠదఘ్నంగా అతిథులు భోజనం ముగించారు. చిత్రలేఖన రమ్యమైన పళ్ళెరాలనిండా, తమలపాకులు, వక్కలు, ముత్యాలసున్నం, పచ్చకర్పూరం, కస్తూరి, కుంకుమపువ్వు, జాజికాయ, జాపత్రి, లవంగాలు, ఏలక్కాయలు, దేవతా ఫలాలు నింపి చర్వణం నిమిత్తం అందించబడ్డాయి. భుక్తాయాసంతో నోట మాటరాక ఒడలు మరచి పరివారమంతా గాఢ నిద్రాంగన కౌగిలింతల్లో కరిగి పోయింది.

రామభద్రా! మీ గురుదేవులు 'ఇంతశక్తి ఈ ఆవులకు ఎక్కడిది? ఇది ఈ దేవతాగోవు మహిమ. ఇది ప్రభువునైన నావద్ద ఉండవలె కాని, వీరల కెందుకు? నాకదనున్న, ఎన్నో యజ్ఞాలుచేసి దేవతలనూ, కోరిన కోర్కెలు తీర్చి ప్రజలనూ సంతోషపెట్టగలను. ఈ గోవుకు ప్రతిఫలంగా మహర్షి ఏమికోరినా ఇస్తాను' అని తలచి, వసిష్ఠులవారితో విందువిషయం ప్రస్తావించి, అపూర్వం అనీ, అనితరసాధ్యంఅనీ, ఆనందించామనీ ప్రశంసించి శబల నీయమని కోరాడు. అందుకుగానుక్షీరసమృద్ధమైన ఆవుల లక్ష ఇస్తానన్నాడు. అందులకాయన అంగీకరించలేదు. కొంచెం రాజాధికారంతో మళ్ళీ కోరాడు. బ్రహ్మమానసపుత్రుడు శాంతంగా, వినయంగా ఇలా అన్నాడు. "గాధేయా! ఇది మాకువలె మీకుతోడ్పడదు. ఈమె సర్వశక్తి

సంపన్న అయినా మా అనుమతిలేక ఆ మహత్తు ప్రకటించదు" అనగా ఆయన "మీకు ఇష్టముతోనే ఆయవలసిం"దనిపల్కారు. "రత్నహారులు రాజులు. ఈగోవు ఆ జాతిలో రత్నం. కాబట్టి దీన్ని గ్రహించక తప్పదు. మీరెందులకేమి కోరినా యిస్తాను.మాకిది కావాలి." ఇది ఈ మహనీయుని మాట. మహర్షి వచ్చే కోపాన్ని వుపశమింపచేసుకుని, "తొందరపడవద్దు ప్రభూ! నా జపం, తపం, హవ్యం, కవ్యం, అగ్నిహోత్రం, యజ్ఞం. ఒకటేమిటి సర్వం, ఈమె వల్లనే సాగుతున్నది. ఈమె లేక నేను లేను కనుక ఇవ్వను" అని గట్టిగా చెప్పాడు.

## శబలను గాధేయుడు బలవంతముగా కొనిపోవుట

ఆ మాటల కాగ్రహించి "శబలను కొనిపోతున్నాను. శక్తి కల్గిన నివారించుకో" అంటూ అధికారులకు ఆజ్ఞ యిచ్చాడు. బలవంతంగా వారు ఆవును బంధించి కొనిపోబోతుంటే, దీనాస్యయై శబల కంటనీరు మంటి తడుపుతూ, "బ్రహ్మపుత్రా! ఈ ఉదాసీనతకు కారణం ఏమిటి? నీ బిడ్డ పరాభవం పొందుతుంటే నీకు అభిమానంలేదా? అడ్డగింపవేమి? ఆగ్రహింపవేమి?" అన్నది. మహర్షి, "అమ్మా! నేనేం చేస్తాను. అతడు రాజు. అక్షౌహిణీ సేనాపరివృతుడు. వీర్యబల గర్వితుడు. నేను బ్రాహ్మణ్ణి. ఒంటరివాడను. ఏ విధంగా నేను నిన్ను కాపాడగలను?" అన్నాడు. "పండ్రీ! ఈ పని మీ కిష్టంలేకుండా జరిగింది. కనుక, నాకు అనుజ్ఞ ఇవ్వండి. బ్రహ్మబలం ముందు క్షత్రబలమెంత? నేనే సమర్థించుకుంటాను" అన్నది. "నా ఇష్టం. కావలసిన కార్యం కానీయి" అని అనుమతి ఇచ్చాడు.

## కల్పిత సైన్యంతో కామధేనువు గాధేయుని పరాభవించుట

అనుజ్ఞనందిన దేవతాధేనువు అంభారవం చేసింది. "పహ్లవులు" ఆవిర్భవించారు. ఆ లోకభీకరాకారుల దాటికి అగ్నిలోవేసిన సమిధల్లాగా రాజసైన్యం ఆహుతి ఐంది. ఆపాటుమాని కౌశికుడు ధనువుచేనంది, నాల్గు మహాస్త్రాలద్వారా పహ్లవసైన్యాన్ని పరలోకానికి ప్రయాణం కట్టించాడు. సర్వశస్త్రాస్త్ర సంక్షోభితంగా యవనుల సృజించింది. వారు గత శేషులైన ప్రభువు సేనను మారణహోమం చేశారు. ప్రభువు రోషకషాయితాక్షుడై

యవనకోటిని నేలకు కోలకు తెచ్చి అంతకపురి కనిపాడు. ఆ సమరం చూస్తున్న వసిష్ఠమహర్షి, నిశ్చేతనంగా నిలబడ్డ శబలను చూచి, "బిడ్డా! శోకింపకు. యోగబలంతో పునస్సృష్టిచేయి. నాతపశ్శక్తి తోడిస్తున్నాను" అనగానే, అత్యంత శక్తి సమన్వితులైన కాంభోజులు, పహ్లవులూ, కిరాతులూ, మ్లేచ్ఛులూ, శకులూ, శంబరులూ అసంఖ్యాకంగా, సర్వాంగాలల్లో నుంచి జనించారు. వారు చండమార్తాండులై, గండుమిగిలి ధంధనంలో గాధేయుని బలాన్ని సమూలంగా, కాలుని సన్నిధానంలో కాపుకు పంపారు. సైన్యనాశనం గాంచి మహారాజపుత్రులు నూర్గురు మహర్షిపై కురికారు. ఆయన ఆగ్రహించి ఆరకంటితో చూచి అందర్నీ అంతిమయాత్ర కంపాడు.

కన్నకొడుకులు నూర్గురు కాలగర్భంలో కలిసిపోవటం, సర్వసైన్యం సమూలంగా చెడటం చూచి, అలలులేని సముద్రంలాగా, కోరలు తీసిన సర్పంవలె, రాహుగ్రస్తుడైన చంద్రునిరీతి, రెక్కలుతెగిన పక్షిపోలిక, అశక్తుడై, అప్రతాపుడై, అహంకారదూరుడై, అవమానఖిన్నుడై, మరలి పురానికిపోయి, కనిష్ఠసుతునికి పట్టంగట్టి, హిమశైలంచేరి, ఈశ్వరుణ్ణిగూర్చి ఘోరాతిఘోరంగా తపస్సుచేశాడు. గిరిజావరుడు ప్రసన్నుడైనాడు. ఆయన కరుణాకటాక్షంచేత ధనుర్వేదం సాంగోపాంగంగా, సమంత్రకంగా, యక్ష, రాక్షస, గరుడ, గంధర్వ, సిద్ధ, సాధ్య, విద్యాధరాది దేవతానీకానికి తెలిసిన అన్ని అస్త్రాలూ గ్రహించి, పర్వదినంనాడు సముద్రంలాగా పొంగిపోతూ, ఎకాఎకి వసిష్ఠుల ఆశ్రమానికి వచ్చి, ఆగ్నేయాస్త్రం ప్రయోగించి, ఒకనాడు ఏఆశ్రమం సత్యలోకాన్ని తలపించిందని తలిచాడో, ఎవరి తపస్సుచే ఈధరామండలం శాంతి సుభిక్షాలతో వర్థిల్లుతున్నదని సంభావించాడో, ఆ ఆశ్రమాన్ని భస్మసాత్కృతం చేశాడు. మునులు భీతిల్లారు. పక్షులు రొదచేస్తూ, కులాయాలను వదలిపోయినై. శిష్యులు నిర్జీవులై నిలిచారు. ప్రాణాశతో పారిపోయే తాపసులతో "నిలవండి. తపస్వులకు జీవిత భ్రాంతికూడదు. నిర్హేతుకంగా, ఈరాజు యుగాంతరాలుగా సమృద్ధిపొందిన నా ఆశ్రమం మంటలపాలు చేశాడు. ఇంతవరకు సహించాను. ఇక సహిస్తే నాకు దోషం వస్తుంది. ఈమూర్ఖుని ఇప్పుడే సంయమనిలోకానికి సాగనంపుతాను, ఆగండి" అంటూ, రౌద్రాకారంలో, త్రిమూర్తులకు అజేయమైన

బ్రహ్మదండం చేతదాల్చి "భూపతీ! విశ్వసంరక్షకుడవనీ, బ్రహ్మవంశజుడైన కుశుని వారసుడవనీ, నీపట్లఓర్పు వహించాను.

## వసిష్ఠ విశ్వామిత్రుల యుద్ధం

ఇదిగో నిల్చున్నాను. నీ ఈశ్వరదత్త మహాస్త్రశక్తి కనచూపించు. కాదా? శరణాగతుడవై వెంటితో పురానికి పొమ్ము" అని అన్నాడు. ఆ మాటలకు కౌశికుడు తోకత్రొక్కిన మహాభుజంగంలాగా విజృంభించి, ఆగ్నేయాస్త్రాన్ని మహర్షి అభిమంత్రించివేశాడు. మహర్షి బ్రహ్మదండాన్ని తన వేదికముందుంచి, తపస్సులో లీనమైనాడు. అగ్నిబాణం అపహృతమైంది. వారుణ, రౌద్ర, ఐంద్ర, పాశుపత, ఇషీక, స్వాపన, గాంధర్వ, మోహన, మానవ, జృంభక, మాదన, సంతాపన, విలాపన, దారుణ, శోషణ, దారణ, వజ్ర, బ్రహ్మపాశ, వారుణ, కాలపాశ, దండ, పైశాచిక, క్రౌంచ, శుష్క, ఆర్ద్ర, పినాక, ధర్మచక్ర, కాలచక్ర, విష్ణుచక్ర, మథన, వాయవ్య, హయశిర, శక్తి, ముసల, కంకాళ, కాల, విద్యాధర, కపాల, త్రిశూల, కంకణములనే సకలదేవతాస్త్రాలు విడువకుండా విడిచాడు. మహర్షి ఉలకలేదు పలకలేదు. మహాప్రవాహంలో పడినవృక్షాల్లాగా, సుడిగాలిలో చిక్కిన వగుడాకుల్లాగా, బ్రహ్మదండంలోపడి ఏమైనాయో ప్రయోగించిన ప్రభువుకే అంతుచిక్కలేదు. చివరకు తెగించి, బ్రహ్మాస్త్రం విడిచాడు. అది భూనభోంతరాళాలు దహిస్తూవచ్చి బ్రహ్మపత్యబ్రహ్మదండంలో లుప్తమైపోయింది. ఎప్పుడు ఆ అస్త్రదండంచేత ఆహరింపబడ్డదో, అప్పుడే సమాధినిష్ఠుడైన మహర్షి సర్వాంగాలలో నుంచే హుతాశనకీలలు ఉద్భవించసాగాయి. దుర్నిరీక్ష్యంగావున్న ఆమూర్తిని దర్శించి మునికోటి "ప్రభువు నిర్జితుడైనాడు. మహర్షి! శాంతింపుము. శాంతింపుము. నీ వెంతటివాడవో ముల్లోకాలు తెలుసుకున్నవి. ఇంతకుపూర్వం ఎలా వున్నదో తపోవనం ఇప్పుడు అంతకు అధికాధికంగా వెలుగుతున్నది. ప్రతీకారేచ్ఛ వదలిపశ్చాత్తాపంతో రవిపుల పిలుపును తపం నిమిత్తం హిమవంతానికి వెళ్లాడు" అని వాకొన్నారు.

## త్రిశంకూపాఖ్యానం

సమాధి చాలించి, యథాపూర్వంగావున్న ఆశ్రమాన్ని చూచి,

శాంతించి, శబలను సంభావించి, గాధేయుని గర్వభంగానికీ, తపస్సం
కల్పానికీ సంతోషించి, నిత్యకర్మలో మునిగిపోయాడు. పరితప్త చిత్తంతో
భార్యా సమేతుడై హిమశైలానికి వెళ్ళినరాజు తపం చేయసాగాడు. వేయి
వత్సరాలయిన తర్వాత బ్రహ్మ దర్శనమిచ్చి "రాజర్షి" వైనావని పలికి
అంతర్హితుడైనాడు. ఆ కాలంలో కలిగిన, హవిష్యంద, మధుష్యంద,
దృఢనేత్రులను ముగ్గురు కుమారులకు రాజ్యం వప్పగించి, భార్యనువారితో
పంపి యిలా భావించాడు. "ఇంత తపం చేసి సాధించిన అస్త్రాలు వ్యర్థ
మయినాయి. రాజర్షిగానే పరిగణింపబడ్డాను. ఛీ! బ్రహ్మబలం ముందుక్షత్ర
బలం సూర్యుడి ముందు దివిటీవంటిది. నేను బ్రహ్మర్షిని కావాలి. అయి
తీరుతాను" అని వెంటనే ఇంద్రియాలను అనుశాసించి, మహా తపస్సులో
మగ్నమైనాడు.

ఇదే సమయంలో త్రిశంకు భూపతి, మేనితో స్వర్గం వెళ్ళాలని
వసిష్ఠుని కోరాడు. అసాధ్యమని ఆయన తిరస్కరించాడు. ఆయన కుమా
రుల దగ్గరకేగి, విషయం చెప్పి యజ్ఞం చేయించమని వేడుకున్నాడు. గురు
ద్రోహికి నరకమే కాని, నాకం లభించదు, పొమ్మన్నారు. అందుకా భూమి
భర్త, వేరే ఆచార్యులను వరించుకొంటానని పోబోతుంటే, చండాలుడవు
కమ్మని శపించారు. బ్రాహ్మణ శాపంతో ప్రాప్తించిన చండాలత్వానికిరోసి
బంధువులు, హితులు లోనగువారంతా విడిచి వెళ్ళిపోయారు. దిక్కుమాలిన
తన దీనస్థితికి పొక్కుతూ ఈ మహాత్మునిపాదాశ్రయుడయ్యాడు. ఈయన
పూర్వాపరాలు పరికించి, "నీ తప్పులేదు. నీ కోరిన రీతి యజ్ఞం చేయించి
బొందితో స్వర్గం పొందేట్లు చేస్తా"నని అభయమిచ్చి, శిష్యులద్వారా ముని
కోటికి కబురు పంపాడు. వారు భయంతో కొందరూ, భక్తితో కొందరూ
క్రతువు నిమిత్తం వచ్చారు. శిష్యులు శ్రోత్రియుడయిన మహోదయుడు
సోదర శతంతో రాలేదు. దానితోపాటు ఈ మాటలన్నాడు.

"చండాలుడు దీక్షితుడూ, భూపాలుడు యాజకుడూ, బాగున్నది.
బ్రాహ్మణాగ్రేసరులు ఎలా వస్తారు? దేవతలు హవిర్భాగాలు ఎలా స్వీక
రిస్తారు? చండాల శరీరంతో స్వర్గం ఎలా పోతాడు? పోతే ఆ స్వర్గం
ఎటువంటిది? ఈ సవనం పొడుగుపడినట్లే." ఆ మాటలు విని, దండతాడితమైన
దందశూకంవలె ఈయన కస్సనిలేచి "నన్ను వ్యర్థంగా దూషించిన వాసి

షులు వెంటనే కాలపాశవశులై, గతాసువులై, ఏడువందల జన్మలెత్తి కుక్క మాంసం ఆహారంగా దుర్గాతులై, వికార వేషధారులై, అపూజ్యులై తిరుగుతూ, నరకంలో కూలుతారు" అని శపించి, "నన్ను దిట్టిన మహోదయుడు కిరాతజన్ముడై, తిరిగి తిరిగి ఆత్మ హత్యాపాపంతో రౌరవ నరకాలు పొందుతాడు" అంటూ,

క్రతువు ప్రారంభం చేసి, అధికారుల నియమించి, త్రిశంకునికి దీక్ష ఇచ్చి, ఆజ్యాహుతులర్పిస్తూ, దేవతలను ఆహ్వానిస్తేవారు రాకున్నారు.

## త్రిశంకునికై స్వర్గం సృష్టించుట

ఆ మాటలకు ఆగ్రహించి "మీ రెంత? మీ శక్తి ఎంత? స్వర్గానికి నేనే పంపుతా" అని తిరస్కారంతో, కుడిచేతిలో వున్న స్రువాన్ని పైకెత్తి "త్రిశంకూ! హతాశుడవుగాకు. సన్నర్థించి స్వర్థుడుగా ఎవరూ పోలేదు. నా వేయి సంవత్సరాల తపఃఫలమంతా నీ సశరీర స్వర్గారోహణకు ధారావత్తం చేస్తున్నాను! పో స్వర్గానికి" అని కమండలంలోని జలం ఆచమించి రాజహస్తంతో నీళ్ళు వదిలాడు. చూస్తుండగానే విమానంలో ఆకాశపథానికి ఉద్గమించి స్వర్గంలో దిగాడు. దేవతలు "శాపహతుడవూ, చండాలుడవూ, నీ కిక్కడ స్థానంలేదు, పో" అంటూ ఇంద్రుడు గెంటివేశాడు. ఆ త్రోపుకు తలక్రిందై ధూపాతం అవుతూ, "మహర్షీ! రక్షించు, రక్షించు" అంటూ రోదించాడు. "ఆగు రాజా! అక్కడే ఆగు. నీకై స్వర్గం సృష్టిస్తాను. ఎవరు అడ్డు రాగలరో చూస్తాను" అని గంభీరంగా పలికి, "సప్త మహర్షులను, నక్షత్రములను సృజించి, దక్షిణ దిశలో దేవతలనూ, ఇంద్రుణ్ణీ కల్పించి, నిను సేవించేట్లు చేస్తా"నని జలాన్ని స్పృశించబోతుండగా, బ్రహ్మాదులు వచ్చి వారించి, "వేద విరుద్ధంగా నీవంటి వాడు ప్రవర్తిస్తే సృష్టికే అంత్యకాలం వస్తుంది. శాంతించి కర్తవ్యోన్ముఖుడవు కమ్ము" అని అర్థించారు. "నేను అనృత దోషాన్ని పొందలేను. త్రిశంకుని స్వర్గానికి పంపుతానన్నాను. పంపితీరతాను" అని చెపితే అమరులంతా ఆలోచించి, "వైశ్వానర మండలానికి వెలుపలగా, నీచే సృజింపబడిన సప్తఋషి మండలం, నక్షత్రాలు శాశ్వతంగా వుంటై. అక్కడ త్రిశంకుడు స్వర్గంలోవలెనే సర్వ సౌఖ్యాలు అధోముఖుడై అనుభవిస్తాడు"

అని అనుగ్రహించి అదృశ్యులైనారు. "ఈ ప్రదేశంలో తపో విఘ్నం జరిగింది. పశ్చిమంగా పోయి ఆ ప్రశాంత వాతావరణంలో తపస్సు చేసుకుందాం" అని మునులతో ఆ దిశాభిముఖంగా వెళ్ళాడు.

## శునశ్శేపోపాఖ్యానం

ఆ కాలంలో అయోధ్యానగరాన్ని "అంబరీషుడు" పాలిస్తున్నాడు. ఆయన మహాతపస్వి. అనేక సవనాలు చేసి, దేవతలనూ, భూదేవతలనూ, ప్రజలనూ, అతిథులనూ, అభ్యాగతులనూ సంతృప్తులచేసి విశ్వ విఖ్యాతిని ఆర్జించాడు. సలిపిన జన్నాలకు తృప్తిపడక, నూతనంగా సప్తతంతువు సంకల్పించి, యజ్ఞాశ్వాన్ని వదిలాడు. దాన్ని ఇంద్రుడు హరించాడు. క్రతు భంగం కాకుండా గుర్రానికి బదులుగా మానవుణ్ణి తెమ్మనియజ్వలు చెప్పారు. రాజు దేశాలు తిరిగి, చివరకు 'ఋచీక'ముని ఆశ్రమానికివచ్చి, వచ్చిన కార్యం విశదీకరించి కుమారుణ్ణి ప్రతిఫలం పుచ్చుకొని అమ్మమని అడిగాడు. తండ్రి పెద్దవానినీ, తల్లి చిన్నవానినీఇచ్చుటకుసమ్మతింపలేదు. వారి భావం తెలుసుకున్న శునశ్శేపుడు తానైవచ్చి సవనం సాంగం చేయమనీ, పితరులకు కోరినట్లు ప్రతిఫలం ఇమ్మని చెప్పాడు. అట్లొనరించి, తాపసబాలకుని వెంట నిడుకొని పశ్చిమంగా పయనిస్తూ,విశ్వామిత్రాశ్రమ ప్రదేశం సమీపానికి వచ్చాడు. మధ్యాహ్నమైంది. ఎండకు తాళలేక జలాశయం చేరి దాహం తీర్చుకునే సమయంలో బాలకుడు పరుగెత్తి గాధేయుని శరణుజొచ్చాడు. ఆ దయామూర్తి ఆ బాలునికి అభయమిచ్చి, వరుణ మంత్రోపదేశం చేసి "సవన సమయంలో ఈ మంత్రం జపించు. నీవు దీర్ఘాయుష్మంతుడవౌతావు. క్రతువు ఫలసిద్ధి పొందుతుంది" అని మంత్రం ఇచ్చి పంపాడు. ఇంకొక గొప్ప విశేషం వుంది రామచంద్రా! విను. ఆ బాలునకు ప్రతిగా తన బిడ్డలలో ఒకనిని పొమ్మన్నాడు. వారు నిరాకరించారు, కన్నకొడుకులని కనికరమయినా లేకుండా పరోపకారార్థం,కొడుకులనే శపించినట్టి సత్యశీలుడు. అంబరీషభూపతి హవనం పరిసమాప్తమైంది. ఆ బాలుడు దీర్ఘాయువునందాడు.

మఘమాసం వచ్చింది. పశ్చిమ దిశలో సల్పిన వేయి సంవత్సరాల తపఃఫలితంగా "ఋషి" స్థానం పొందాడు. కాని, తృప్తుడు కాలేదు.

మహర్షి కావాలనీ, మహాఘోర తపం చేయాలనీ సంకల్పించి పశ్చిమశైల సమీపంలోని సరోవరానికి స్నానార్థం వెళ్ళాడు. కోకిల కూతలు, పులుగుల కలకలాలు, వనమయూరాలనాట్యాలూ, మామిడిపూతల, ఇప్పపూతల మాదక పరిమళాలూ,తుమ్మెదల రొదలూ,లతావృక్షాలనూత్నశోభా పొంపుల పరవశుల్ని చేస్తున్నై. ఆ మనోహర సమయంలో, మేనక చెలులతో, జలక్రీడలాడి వస్త్రధారణకు ఒడ్డునకు వస్తున్నది. ఆ దృశ్యంగాంచి, అదుపుదప్పి ఇంద్రియాలు ప్రకోపించినై. వివేకం వెర్రితల వేసింది. మోహితుడై ముని ముందుకు నడిచి ముగుదకరం గ్రహించాడు.ఆలీఢపాదుడైన మారుని మోహనబాణం ధనుర్నిర్గతమై, శాపాయుధుని శరీరం సోకింది. ఆశృంగార క్రీడలేమి? ఆ విలాసములేమి? ఆ ప్రణయకలహాలూ, ఆనర్మగర్భభాషణలెమి? పదియేండ్లు పదిక్షణాలుగా గడిచినై. మేనక పుత్రికను కన్నది. మునీశ్వరునకు కనువిప్పు కలిగింది. చేసిన పనికి సిగ్గుపడ్డాడు. "బలవానింద్రియ గ్రామో విద్వాంస మపికర్షతి [బలమయిన ఇంద్రియసమూహం విద్వాంసుల గూడ కర్షిస్తది]అన్న సూక్తి నా పట్ల సార్థకమైంది రాజధర్మం వదలి, బ్రహ్మత్వం ఆసించి, వేల వత్సరాలు తపించి, ఈ వెలనాటికి లోపడ్డాను. భ్రష్టుడనయ్యాను. ఇంతచేసి ఋషిశబ్దవాచ్యుడను మాత్రమే అయ్యాను. మహర్షిని కాలేదు. బ్రహ్మర్షిని కాలేదు. చేసిన తపస్సు వృథా అయ్యింది. మేనకా! నీ దోషంలేదు. దేవతలుచేసినమోసంతెలుసుకున్నాను. ఇక నీ దారి నీది. నా దారి నాది. పో"మ్మని మంచుకొండకు వెళ్ళివేయి దివ్యవత్సరాలు ఉగ్రంగా తపం చేశాడు. ఆ తపోగ్నికి నిర్జరులు భయపడి విధాతచే "మహర్షి" పదానికి అర్హత అబ్బిందనిపించారు. అయితే "జితేంద్రియుడనేనా?" అని ప్రశ్నించాడు. ఆ అర్హతరాలేదన్నాడు విరించి.

ఆ విరించి మాటలు మందుమంటకు నేయివలెనై, మరల ఉగ్ర తపస్సు చేయ మొదలుపెట్టాడు. ఇంద్రుడు రంభనుపంపి, తానుమన్మథుని గూడి చిలుకయై ఆశ్రమం చేరాడు. రంభ గానం చేసింది. చిలుక మధుర మధురంగా పలికింది. మదనాస్త్రం మునిపై పుప్పొడి చిలికింది. గాధేయుడు కన్ను తెరచి, కలహాపు అరసి, శిలగా రంభను శపించాడు. మళ్ళీ తపోభంగమైంది. "ఇంత తపంచేసి, బ్రాహ్మణత్వానికి ప్రధానగుణాలైన శాంతం సత్త్వం రెండూ నాకు లేవు. కామక్రోధాలు జయింపబడలేదు. అన్నివిధాలా

చెడ్తాను. ఇక తిట్టినా,కొట్టినా ఏమి చేసినా ఆగ్రహించను.ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా బంధించుతాను. బ్రహ్మర్షి అయ్యే పర్యంతం బాహ్యస్మృతి విస్మరిస్తాను" అని నిర్ధారించుకొని, తూర్పుదిశకేగి వేయి దివ్యవర్షాలు నీరు, గాలి, ఆకు, ఆలంబనా స్వీకరించకుండా తపస్సుచేసి, ప్రాశనం చేయబోయే వేళ ఇంద్రుడుముసలిబాపడిరూపంతోవచ్చిఅర్థించగా, ఆఅన్నంపెట్టి, "ఎప్పటికీ అన్నం తిననే తిన"నని, నిట్టుపాసంతో పంచాగ్ని మధ్యంలో నిల్చి, అతిమానుషంగా తపం చేయసాగాడు.

అన్ని రోమకూపాల్లో అగ్ని వెలువడింది. శిరంపై పుట్టిన వహ్ని ఊర్ధ్వలోకాలను నిర్దహించసాగింది. రోమకూపాగ్ని అష్టదిక్కుల ఆవరించింది. వారాసులు తప్తమైనై. జగత్తు క్షోభించింది. సూర్యమండలం తేజోహీనమైంది. భూమి కంపించసాగింది. వాయువు వేడెక్కింది. జీవకోటికి ఆహారం ఆకలి తీర్చటంలేదు. సర్వభక్షకు[అగ్నికి]నకు దహనశక్తి మందగించింది. దేవతలకు హవిస్సులు అందటంలేదు. కౌశిక నిరాహారతపస్సుకూ, నిరహంకారతకూ, నిరుపమాన, నిశ్చలనియమ నిష్ఠకూ సురలు "పాహిమాం హిరణ్యగర్భ! రక్షమాం కరుణానిధే!" అన్న ఆక్రందనం వినిపించి సృష్టికార్యం భంగించింది. వారిని వెంట నిడుకొని సాక్షాత్కరించి "మహర్షీ! రాజర్షివి, ఋషివి, మహర్షివేకాక "బ్రహ్మర్షివి" కూడ అయ్యావు. నీ దీక్ష సాధకులకు రక్ష. అజ్ఞానులకు శిక్ష. జ్ఞానవంతులకు భిక్ష. లెమ్ము లెమ్ము" అన్నాడు. ముకుళిత హస్తుడై మునినాథుడు "చతుర్ముఖా! నేను బ్రహ్మర్షినీ, దీర్ఘాయుష్మంతుడనూ అయితే, ఓంకారం, ఆగమాలు, శ్రుతి, వషట్కారాలు నన్ను చేరుగాక. నీ సృష్టిలో నీయంత వాడై, పోటీ సాటీలేని బ్రహ్మర్షి వసిష్ఠుడు నా సర్వోత్తమాధికారిత్వం అంగీకరించుగాక" అన్నాడు. పరమేష్ఠి, "కౌశికా! మాత్సర్యం విడిచి, మత్పుత్రుని ఆశీర్వదించమని అర్థించు అతడు అంగీకరించుతా"డని చెప్పి అంతర్హితుడైనాడు.

## శివధనుస్సును గూర్చి కౌశికుడు ప్రస్తావించుట

విధి నిర్దేశించినట్లు ఈ త్రిలోకపూజ్యుడు వసిష్ఠులవారికడ కరిగి ఆయనతో చెలిమి పాటించి, ఆ నాటినుండి బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడైనాడు"

అని శతానందుడు విశ్వామిత్రుని ప్రాశస్త్యం ప్రస్తుతించాడు. సభాసదులతో రామలక్ష్మణులు హర్షపులకిత గాత్రులయ్యారు. జనకుడు ఉపచార వాక్యములతో వారిని ఆనందపరచి, "దేవా! మీరు వచ్చుటచే ధన్యుడనైనాను. సూర్యుడస్తంగతుడవుతున్నాడు. సాయంకాల విధులు నిర్వర్తించవలెగదా? రేపు ఉదయం వీరికి శివచాపం చూపిస్తాను. మీరూ కార్య కరణీయాల నిమిత్తం విడిదికి దయచేయండి. తమకు అన్ని సదుపాయాలూ అక్కడ జరుగుతై" అని సెలవుకొని జనకవాటికకు సాగిపోయాడు.

## శివచాపం చేరిన విధం జనకుడు చెప్పుట

పదిహేనవరోజు ఉదయం నిర్వర్తిత సకాలవిధులై, మిథిలేశుని అనుమతితో వచ్చిన ఆహ్వానితులతో గూడి సవనశాల ప్రవేశించిన విశ్వామిత్రునితో, మైథిలుడు యిలా పలికాడు. "దేవా! ఈ చాపంపూర్వం "దేవరాతు"డనే పూజ్యునికి దేవతలిచ్చారు. అతడు నిమికి ఆరోవాడు. దక్షయజ్ఞ విధ్వంసంలో శివుడీ చాపాన్ని ధరించాడు. సురలు భయంతో ప్రార్థిస్తే ఆకృపామూర్తి సురల దేవతలకిది ఇచ్చాడు. వారు నాకు ముందుండిన భూపతికిచ్చారు. అప్పటినుంచీ నా ఇంట నిత్యపూజావిధులతో అర్చనం అందుకొంటున్నది. నేనొక క్రతువు తలపెట్టి నేలనుదున్ని చదును చేయిస్తుంటే నాగటి చాలులో మందసం కనపడ్డది. తెరచిచూస్తే, ముగ్ధమోహనమైన ఆడుబిడ్డ అందులో శయనించి వుంది. ఆ శిశువును నా బిడ్డగా భావించి పోషించుతుండే ఆమె లావణ్యానికీ, సుగుణసంపదకూ ఆశపడి రాజకుమారులు రాసాగారు. అయోనిజగా జన్మించిన ఆ బిడ్డను రాజశబ్దమాత్రులకిచ్చుటకు ఇచ్చగించక, "వీర్యశుల్కగా గ్రహించండి అనీ, ఆ వీర్యం శివచాపం ఎత్తి, నారిని అనుసంధించటం అనీ" చెప్పాను. వారు ఆ పనికి శక్తిలేనివారైనా పురం ముట్టడించి తుదకు వెళ్ళిపోయారు. ఈ కుమారులలో ఎవరైనా ఆ విల్లు ఎక్కుపెడితే నా కూతురు సీతను ఇచ్చి వివాహం చేస్తాను" అని ముగించాడు. "మంచిది మిథిలేశా! ముందు చూడవలెగదా? ధనువును తెప్పించు"మని కౌశికుడు అన్నాడు. మహాబలవంతులైన ఐదు వేలమంది వీరులు అయఃపేటిక తెచ్చి ముందుంచి "ప్రభువులయాజ్ఞ నెరవేర్చబడింది" అని మనవి చేశారు. జనకుడు లేచి, గాధేయునిగాంచి,

కరములు జోడించి, "బ్రహ్మర్షీ! ఇదిగో శివచాపం. దేవ దానవ యక్ష కింపురుషాది దివ్యులకే యిది సాధ్యం కాలేదు. మానవుల సంగతి ఎత్తుటకు-మోపెట్టుటకాని, రాకుమారులు సందర్శింపగా అనుమతినీయండి" అని విన్నవించాడు.

## శివధనుర్భంగం

చిరునవ్వుతో, గడ్డం చేతితో సవరిస్తూ, "రామా! వింటివి కదా రాజర్షి వాక్యాలు. దానిని నీవుకూడా చూడాలనిపిస్తుంది" అన్నాడు గాధేయుడు. ఆసనం నుంచి చివాలున లేచి, మద గజ గమనంతో మందసం వద్దకు వచ్చి, మూత తెరచి, చేతితో తాకి, గురువులవంక చూచాడు. గురుదేవుని కంటి కదలికా, పెట్టెలోని ధనువూ ఒక్కసారే కదిలినై. తొండం సాచి, చెరుకు గడను ఒడిసిపట్టిన కరీంద్రంలాగా, రాముడు ఎడమచేతితో విల్లంది వెలికి తీసి నిలబెట్టాడు. ఆశ్చర్యానందవిభ్రమాలతో ఆ సభ శిల్పాకృతి అయింది. దించివుంచిన నారిని సరిచేసి ధనువంచి కొమ్ముకు సంధింపబోగా మహానాదంతో చాపం ఫెళ్ళున విరిగింది. ఆ నాదం వాయువశంలోబడి పద్నాల్గులోకాలల్లో ప్రతిధ్వనించింది. సభ్యులు చాయామూర్తులైనారు. సుధర్మపీఠం ముందుకువాలింది. విరించి కమలాసనం కంపించింది. భూమి వణికింది. వనచరాలు గుహలనుంచి వచ్చే ధ్వనికి గగ్గోలుపడినై. సప్త సాగరాలు ఘూర్ణిల్లినై. సూర్యాది గ్రహగమనం స్తంభించింది. మహా యోగుల విమనస్క ప్రజ్ఞ విచ్ఛిన్నమైంది.

కొంతసేపటికి ఆ నాదం సన్నగిల్లింది. వాన వెలిసినట్లయింది. సభ తేరుకుంది. జనకుడు కుశికనందనుని చూచి, "పూజ్యులారా! మీ రాకచేత నిజంగా అన్ని విధాలా కృతార్థుడనయ్యాను. ఇదెక్కడి శక్తి? ఇదినిజమా? స్వప్నమా? నా బిడ్డ సీత యెంత అదృష్టవంతురాలు? ఆమె పుత్రికగా కల్గిన నా భాగ్యమేమిభాగ్యం? ఇక్ష్వాకులతో మైథిలులు సంబంధం చేసుకొనటం మా సీతమ్మ చలువచేతనే గదా! నే నిప్పుడనుకుంటున్నాను, మీ రాక ఇందులకేనని. లేకపోతే అనాహూతమానంగా మీరు చతుర్ముఖ సదనానికైనా వెళ్తారా? మీ ఋణం జనకుడు తీర్చుకోలేడు. మీ అనుజ్ఞ ఐతే మీ శిష్యరత్నం నా పుత్రికా హస్తంలో పొదగబడుతుంది. నా పుత్రిక వీర్య

శల్క యన్న నా మాటకు అస్మృతదోషం దూరమవుతుంది. ఏమి సెలవు మాకు" అని అన్నాడు. ప్రభువు సాదరంతో చూచి, "బ్రాహ్మణ్యుడా! ఎందులకీస్తుతి? ఏ జనకనామం వేదాంత లోకానికే జనకసదృశ్యమైందో, ఎవని గార్హస్థ్య ధర్మం, ఋషీశ్వరులకు సయితం ఆదర్శకమైందో, ఎవని పాలనం, మూడు లోకాల పరిపాలకులకు శిరోధార్యమైందో, ఆ జనక చక్రవర్తి నన్నింత పొగడటం మరి నా అదృష్టానికి హద్దేమిటో నీవేచెప్పు" అని గాథేయుడు ప్రతి వచనం చెప్పి, ఈ శుభ సందేశాన్ని అయోధ్యకు పంపి, వియ్యంకుడుగా రావలసిందని ఆహ్వాన లగ్నపత్రికలు దశరథేశున కందింపుమన్నాడు. ముఖ్యమంత్రులు జవసంపన్నాలైన గుర్రములపై మూడు దినాలు ప్రయాణించి నాల్గవరోజు అయోధ్యకు చేరి, ద్వారపాలకుల ద్వారా తమ రాక తెల్పుకొని ప్రవేశార్హత కలిగించుకుని రాజదర్శనం చేసుకున్నారు. వచ్చినవారి కార్యం నివేదించుకుని లగ్నపత్రిక యిచ్చారు. వృద్ధ రాజు పరమానందభరితుడై, వసిష్ఠాదుల అనుమతితో అంగీకరించి, ఆ రాత్రికి వారి నచ్చించి, మరునాడు వేకువజామున సర్వసన్నాహాలతో తరలి, వసిష్ఠ, వామదేవ, జాబాలి, కాశ్యప, మృకండు, కాత్యాయనాది మహర్షుల అందలములపై, ముందుగా పంపి, రాజులతో, దాసదాసీ జనంతో, మంత్రులతో, చతురంగబలంతో, నేల ఈనినట్లు, మంగళనాదాలతో, మగువల ఆనందగీతాలతో, నర్తక నర్తకీ గాయకాది సంగీతభరత శాస్త్ర ప్రవీణులతో వాహనారూఢుడై, మిథిలా నగరానికి చేరుకున్నాడు. మిథిలాపతి అల్లంత దూరాననే ఎదుర్కోలు సలిపి, ఉచిత మర్యాదలతో సంతుష్టి గొలిపి, నగరానికి ఆమంత్రణంచేసి విడుదులలో విడియించాడు. ఆ రోజంతా దశరథుడు, కొడుకులతో, ధర్మపత్నులతో, మంత్రి పురోహిత సాధుసజ్జనులతో, ఇష్టాగోష్ఠి సలుపుతూ గడిపాడు. సూర్యోదయానంతరం సవన వాటిక సందర్శించి ప్రీతుడైనాడు.

## జనకుడు దశరథుని ఉపచార వాక్యాలతో కుశల మడుగుట

సుధర్మాసనుడైన ఇంద్రునివలె నున్న వియ్యంకునిచేరి, మైథిలుడు నమస్కరించి "తరణికుల మండనా! దశరథ మహీపతీ! నీకు స్వాగతం.

వచ్చిన పెద్దలందరికీ వందనం. మహాత్ముడైన విశ్వామిత్ర మహర్షి ఆజ్ఞానుసారం శివధనుర్భంగం చేసి, నా ప్రతిన చెల్లించిన మీ జ్యేష్ఠపుత్రుడు చిరంజీవి శ్రీరామచంద్రునకు, నా పుత్రిక చిరంజీవిని, లక్ష్మీసౌభాగ్యవతి సీతను ఇచ్చి, పాణిగ్రహణం జరిపించుటకు పెద్దలు సుముహూర్తం నిర్ణయించినారు. నా అభ్యర్థనం మన్నించి తాము దయచేసినారు. సూర్యవంశజులతో సంబంధం చేయుటచే మా చంద్రవంశం బహుధా ప్రకాశింపగలదు. ఈనాడు యాగపరిసమాప్తం. రేపు విధివిహితంగా వివాహం. తాము ఆనందముతో అనుమతి యిచ్చి, తమ ఆదేశామితో సెలవిప్పించండి" అని నిల్చున్నాడు. దశరథుడు వృద్ధపంచాస్యంవలె లేచి, బాహువులు చాచి, జనకుని గాఢంగా కౌగలించుకొని, పొంగివస్తున్న సంతోషంతో ఆనందాశ్రువులు కురుస్తూ అన్నాడు. "రాజర్షీ! లోకాచారం యిక్కడ వ్యత్యస్తమైంది. వరుని తండ్రి కన్యను కోరటం, వధువు తండ్రి అనుమతించి దానం చేయటం పరిపాటి. మీరే అర్థించి, మమ్మాహ్వానించి నూతన సంప్రదాయం నెలకొలిపారు. అందుకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. ఆ పైగా ఆదేశం చొప్పున కల్యాణవిధి తీర్చదలిచానంటూ కోరటం, అధికాధికమైన ఆనందం కల్పించింది. సర్వజ్ఞులు, మహర్షులు, ఉభయవంశక్షేమాభిరాములు, ఈ విశ్వామిత్ర వసిష్ఠ వామదేవ శతానందాదులు. వారి నిర్ణయానుసారం వర్తిస్తాను. అయోనిజా, లోకోత్తర సౌందర్యరాశీ, సద్గుణఖనీ, అయిన నీ బిడ్డ నా కోడలు కావటం, ఆమె ఆదర్శగృహిణీ జీవితం చూసి ఆనందించటంకన్న ఈ వయోవృద్ధునికి కోరదగిందేమున్నది? అది నెరవేర్చనున్నావు. మా రాముణ్ణి నీ అపారకృపవల్లా, గాధేయుని సంకల్పంవల్లా, కల్యాణరాముణ్ణిగా కనులార చూస్తాను" అన్నాడు. సభాస్తారులందరూ, ఆ ఇద్దరి సంభాషణలను విని, హర్షధ్వానాలూ, కరతాళధ్వానాలూ కావించారు.

సలక్షణంగా పూర్ణాహుతితో సవనం ముగిసింది. రాబోయే వేడుకలు ఊహించుకుంటూ, అందరూ విడుదలకు చేరి ఆరగించి విశ్రాంతి పొందారు. తథాస్తుదేవతలు సురపతికి ఈ శుభవార్త చెవిని వేశారు. ఆయన సంతోషం పట్టలేక శచీదేవి అంతఃపురానికి అతి వేగంగా వెళ్ళాడు. అకాలంలో భర్త రాక గమనించిన శచీదేవి, ఆదరాదరాగా అలంకరించుకొని, పాదప్రక్షాళనాది విధులు తీర్చి ఆసనం సమర్పించింది. ఆసీనులై దంపతులు—

శచీ: స్వామీ! ఏమిటీ అకాల వర్షం?

ఇంద్రుడు: దేవీ! ఇది సకాల వర్షమే. దాశరథి గృహస్థు కాబోతున్నాడు.

శచీ: ఎంత మంచి శుభవార్త చెప్పారండీ.

ఇంద్రుడు: మనం చేయవలసిన పని చాలావుంది. మన దేవతా వృక్షాలు ఇడిచిన పుష్పాలు తెచ్చి మాల కూర్చాలి. అమృతం కమల పత్రంలో కూర్చాలి. చింతామణి ప్రభావంతో సీతకు సర్వాభరణాలు సమకూర్చాలి. గాయక సార్వభౌములైన నారద తుంబురులనూ, అశ్వనీ దేవతలనూ, అష్టదిక్పాలకులనూ, ఇక్ష్వాకు ప్రభువులనూ, బృహస్పతుల వారినీ రప్పించాలి. నవరత్నాలతో కూడిన ముత్యాలు తలంబ్రాలకు తయారుచేయాలి. నీవూ నేనూ—

శచీ: తప్పేమునదీ? దంపతి పూజకు తయారుకావటం—

ఇంద్రుడు: ఆఁ! అదీ అసలు సంగతి. నీవు ఎవరి పక్షం వుంటావు?

శచీ: మా అబ్బాయి రాముడు పక్షమే.

ఇంద్రుడు: ఇంత పక్షపాతం కూడదు. నీవు వధువువైపూ, నేను వరుని వైపూ సరేనా?

కైలాస, వైకుంఠ, సత్య, నాకలోకాలు, శచీంద్రులవలెనే యథా గౌరవంగా, బహుమతులూ, చదివింపులూ, కట్నాలూ కానుకలూ సేకరించు కుని సిద్ధంగా వున్నారు. జనకుడు మంత్రి శతానందులను విడిదికి పంపి వియ్యంకుణ్ణి వివాహ వేదికకు తీసుకుని రమ్మన్నాడు. అక్కడ మంగళ స్నాతుడైన రాముణ్ణి తోడుకుని, కొమరులతో, రాజులతో, పరివారంతో దశరథుడు కదలివచ్చాడు. జానకిని అలంకరించి, వృద్ధ సువాసినులు కళ్యాణ వేదికకు కొనివచ్చారు. మైథిలుడు కుశధ్వజాది సోదరులతోనూ, పురోహితులతోనూ, మంగళ ద్రవ్యాలతోనూ వచ్చి ఆసీనుడైనాడు. రాజానుమతితో వసిష్ఠుడు లేచి మధుర గంభీరంగా ఇలా చెప్పాడు.

## వశిష్ఠ శతానందులు ఉభయవంశానుక్రమణిక చెప్పుట

"సదస్యులారా! మా రాజవంశ చరిత్ర వివరిస్తున్నాను. ఆది పురుషుడు బ్రహ్మ. ఆయనకు మరీచి, మరీచికి కశ్యపుడూ, వానికి వివస్వంతుడూ ఆయనకు మనువూ, అతనికి ఇక్ష్వాకుడూ, అతనికి కుక్షి, వానికి వికుక్షి, ఆయనకు బాణుడూ, వానికి అనరణ్యుడూ, అతనికి పృథుడూ, వానికి

త్రిశంకుడూ, వానికి దుంధుమారుడూ, యువనాశ్వుడూ, మాంధాతా, శ్రీమంతుడూ, సుసంధీ, ధ్రువసంధీ, భరతుడూ, అసితుడూ, సగరుడూ, అసమంజుడూ, అంశుమంతుడూ, దిలీపుడూ, భగీరథ, కకుత్స్థ, రఘు, కల్మాషపాద, శంఖణ, సుదర్శన, అగ్నివర్ణ, శీఘ్రగ, మరు, శుశ్రుక, అంబరీష, నహుష, యయాతి, నాభాగ, అజులు క్రమంబున జన్మించి వంశవర్ధనులైనారు. అజమహారాజునకు దశరథుడూ, వారికి రామలక్ష్మణులు సుతులైనారు. కావున నీ పుత్రికా ద్వయాన్ని కుమారద్వయానికిమ్మని వేడుకున్నాను" అని ముగించేడు. వెంటనే శతానందుడు, లేచి "సర్వేభ్యో మహాజనేభ్యో నమః. మా ప్రభువుల వంశం మనవిచేస్తాను. మూల పురుషుడు నిమి. వానికి మిథి, అతనికి యుదావసువూ, ఆయనకు నందివర్ధనుడూ, సుకేతుడూ, దేవరాతుడూ, బృహద్రథుడూ, మహావీరుడూ, సుధృతి, ధృష్టకేతువూ, హర్యశ్వుడూ, మరువూ, ప్రతీంధకుడూ, కీర్తిరథుడూ, దేవమీఢుడూ, విబుధుడూ, మహీధ్రకుడూ, కీర్తిరాతుడూ, మహారోముడూ, స్వర్ణరోముడూ, హ్రస్వరోముడూ క్రమానుగతంగా జనించి కులం విస్తరించారు. ఆ హ్రస్వరోమ భూపతికి మా జనకమహర్షి కలిగాడు. ఆయనకు సీతా, ఊర్మిళా పేర్లుగల ఇద్దరు కుమార్తెలున్నారు. వారిని మీ కుమారులకిచ్చి పాణిగ్రహణోత్సవం చేయసంకల్పించాడు" అని కూర్చున్నాడు. పురోహితులు మంత్ర పఠనంచేస్తూ వధూవరులను అభిముఖంగా వేదికలపై కూర్చుండపెట్టారు. నాకంనుంచి ఇంద్రుడు సతీ సమేతుడై వచ్చి రథం దిగి హుటాహుటి కల్యాణ మంటపంచేరి తాను కొనివచ్చిన దివ్యపదార్థాలను బ్రాహ్మణులకిచ్చాడు.

## శ్రీ సీతారామ కల్యాణం

వారు అందుకొని మంగళసూత్రం తీసి, సభ్యుల కందించి రామచంద్రుని కర కమలానికి అందించారు. రాముడు వరహాస సుందరవదనారవిందంతో సీతామహాదేవి మంగళగళంలో మంగళసూత్రం బంధనం చేశాడు. శచీ దేవేంద్రులు రెండువైపుల నిల్చి మంచి ముత్యాల పళ్ళేలు అందించారు.

"చలమూని వెనుక తగ్గక
నెలఁబ్రాయపు టాలు మగలు నేర్పు మెఱయగా,
తలఁబ్రాలుం బోసికొనిరి
సలలిత హస్తద్వయములు స్పర్శసుఖమిడన్."

మంగళ వాద్యాలు "ఆనందమానందమాయెనే, మా రాముడు పెండ్లికొడుకాయెనే, మా సీతమ్మ పెండ్లికూతురాయెనే. ఆనందమానంద మాయెనే" అని గతిభేదంతో మ్రోగిపోతున్నై. దేవతలు కుసుమ వృష్టి కురిపించారు. మలయమారుతం వీచింది. మానవ లోకం మల్లెల వనంలా వికసించింది.

శ్లోకం

జానక్యాః కమలామలాంజలి పుటే యాః పద్మరాగాయితాః,
న్యస్తా రాఘవ మస్తకేచ విలసత్కుంద ప్రసూనాయితాః,
స్రస్తా శ్యామలకాయకాంతికలితా యా ఇంద్రనీలాయితాః,
ముక్తాస్తా శ్శుభదా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః.
సమస్తసన్మంగళానిభవన్తు.

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



Volume One

Price Rs.

Cover Printed At Supreme Arts Hyd- 20.